# JOHN 3, 16

## యోహాను సువార్త ౩: ౧౬.

—లేక—

### శ్రీయేసునాధుని సిలువయొద్ద నేర్చుకొను పది పాఠములు.



—ఇది—

బాపట్ల మిషనెరీవారైన జి. యస్. కాంపర్ దొరవారిచే రచింపఁబడి

రామాయపట్నములోనున్న జటిక దావీదుగారిచే
తెనిగింపఁబడెను.

దేవుఁడు లోకమును ఆలాగుననే ప్రేమించెను, గనుక తన జనితైక కుమారునియందు విశ్వాసముంచు ప్రతివాఁడును నశింపక నిత్యజీవము పొందుటకై ఆయనను యిచ్చెను.

—:(0):—

Printed at the "BHARATI VILASA PRESS",
BAPATLA.
1909.

# ప్రకటన.



నేను అమెరికా దేశములో 1878 సంవత్సరము నుంచి 1879 సంవత్సరమువరకు విద్యార్థిగా నుండినపుడు ఇంగ్లాండు దేశమునుండి వచ్చియుండిన అసమాన్య సువార్త సేవకుడగు హెన్రిమూర్‌హౌస్ అనువారితో నాకు పరిచయము కలిగియుండెను. ఈయన తన బైబిలునుమిక్కుటమైన యాశతో ప్రేమించువాడు. వీరు యోహాను 3: 16 మీద వరుసగా పది ప్రసంగములను చేసినట్లును తానినిఅమె. రికాలోని గొప్పసువార్తసేవకుఁడగు మూడీదొరగారు తానువినినానని చెప్పెను! నేనా ప్రసంగముల నెప్పుడయినను వినియుండలేదు; మరి యు అవి ముద్రింపఁబడను లేదు. మూడీదొరగారు పలికిన సంగతి యే నాహృదయమందు ఒకవిత్తనమువలె నాటబడి పది శాఖలుగల వృక్షముగాఁ బెరుగుటకు కారణమాయెను. ఇది ఫలములుఫలిం చు జీవవృక్షమై అనేకజనములఆత్మ స్వస్థపరచునదగునట్లు తండ్రియు యిన దేవుని ప్రార్థించుచున్నాడను.

ఈ ప్రసంగములను నీవెవరికి అందచేసి దేవునిని వశబరచు కొనగలవని కొందరు నన్నడిగిరి. ఎవరికా? నాకును, నీకును! నీవు నాతో గలసి జతగా కలువరిగొయ్యిద్దకు రావా? అక్కడ సిలువ వేయఁబడిన మన రక్షకుని చేపట్టినవిమ్మటజీవకిరీటమును పొందువరకు ఆయన మనలను నడిపించునుగాక. ఆమేన్.

జి. యస్. టాంనర్.

# విషయసూచిక.

—:(o):—

బైబిల్ గ్రంథములోని యీముఖ్యవచనముయొక్క పదముల క్రమము గ్రీకుభాషప్రకారము ఇక్కడ వ్రాయబడి యున్నవి. మరియు ఆ క్రమముప్రకారము ఈగ్రంథములోని యధ్యాయములున్నవి.





## I. అధ్యాయము.

# SO:—ఆలాగుననే.

సకలభాషలలో చిన్నపదములు మిగుల భావప్రకాశమైనవిగను, విశేషసంగతి గలిగియుండువవిగను, ప్రయోజనమయినవిగ నున్నను వానిని వివరించుట మిగుల కష్టముగా నుండును. గ్రీకుభాష ప్రకారము యోహాను 3:16 వ, లోని ప్రథమపదము 'ఆలాగుననే' యను చిన్న పదము ఇమిడియున్న అర్థమంతటిని వివరింపగల వారెవరు? ఈ వచనమునం దిది అతిముఖ్యమైనదిగ నున్నందున మొదటి పదముగా నున్నదని నమ్ముచున్నాను ఈ సత్యము నా మనస్సునకు యెంతదిట్టముగఁ దట్టెనో మీతోఁ జెప్పెదను. కొన్ని సంవత్సరముల క్రిందట నేను జర్మనీదేశమందు ప్రయాణముఁ జేయుచుండగ నాపరగణాయొక్క సర్కారు ఉద్యోగస్థుఁడు మాతోఁగలసి ప్రయాణముఁ జేయుచుండెను. అతఁడు ఆ యా దేశపు చరిత్రలను చాలా తెలిసికొని యుండెను. ఆయన సహవాసము మాకు నిండా మనోహరముగ నుండెను. ఆదివారమున మేమిద్దరము గుడికి వెళ్లి ఒక బోధకుఁడును కవియునయిన వాని దివ్య ప్రసంగమును వింటిమి. సోమవారమున వినోదములను జూడ వెళ్లితిమి. నాస్నేహితుఁడా సుందరమయిన పట్టణవైభవమును జూపించెను. మేము పచ్చని కొండల మీఁదనుండి పట్టణమును దేరి చూచుచుండఁగా సమాధుల తోటను జూడ వెళ్లుదము యని అడిగెను. ఆ సమాధులమధ్యఁ దిరుగుచుండఁగా నీప్రియమయినవారలలో నెవరయిన నిక్కడ సమాధి చేయబడి యున్నారా? యని అడిగితిని.

అవును, కొన్ని మాసముల క్రిందట నాప్రియ కుమార్తెను ఇక్కడ సమాధి చేసితిననెను. ఆ చోటును జూడవలయునని కోరినప్పుడు నన్నొక లోయలోనికిఁ దీసికొని వెళ్లెను. అక్కడ నేనొక చిన్న సమాధిని జూచితిని. దానిమీఁద నొక తెల్లని సిలువ నాటబడి యుండెను. దాని యొద్దకు వచ్చినప్పుడు 'ఆలాగుననే' అను చిన్నపదము సిలువయొక్క రెండు కొయ్యలు కలిసికొని యుండుచోటున జూచితిని. సమాధి రాతిమీఁద నిట్టి చిన్నవాక్యమును నే నెన్నడు జూడలేదు. అంతట నేను మీ వ్యసనమునకు గురుతుగ ఈ చిన్నపదము నేర్పరచుకొనుట కేమి కారణమని యడిగితిని. అందు కాయన యిచ్చిన ప్రత్యుత్తరము నా జీవిత కాలములో

మరచునట్టిది కాదు, ఆ దినమున నేను నేర్చుకొనిన పాఠములకుగాను దేవునికి నిత్య స్తోత్రములు. ఎందుకనగా శిలువయొద్ద నేర్చుకొనగల గొప్ప పాఠములు కలవు. నా స్నేహితుఁడు హీన స్వరముతోఁ దక్కిన నాబిడ్డలందరికంటె ఈమెను మాత్ర మెక్కువగా ప్రేమించితిని. ఆమె మిగుల ఉత్సాహస్వభావము గలదై యుండినను బహు దృఢచిత్తురాలై యుండెను. ఆమె ఒక కార్యమును చేయ దీర్మానించుకొని నపుడెల్లను 'అలాగుననే' అను పదముతో దన దీర్మానమును పలుకునది. అదే ఆమె కడపటి మాటయై యుండెను! ఆమె చాలా జబ్బుపడి చనిపోవుటకు తొలిరోజున వైద్యుఁడు జాగ్రతగా బరీక్షించి నన్ను బయటికి రమ్మని పిలిచెను. మేము వంటియొక గదిలోనికి వచ్చిన తరువాత నీబిడ్డ చాలకాలము బ్రతుకదనియు, ఇంక ఈదినములోనే చనిపోవుననియు జెప్పెను. అది విని దుఃఖపడితిని తిరుగ ఆగదిలోనికి వెళ్లగా 'నాయనా, వైద్యుఁడేమనెనో నాకుఁ జెప్పుము' అనెను. నన్నడుగకూడదు; ఎందు కనఁగా అది నీకు దెలియకుండుట మంచిదంటిని. కాని నాకు చెప్పవలయునని పట్టు పట్టినందున నాదుఃఖము నాలో నణచుకొని 'నీవు చాలాకాలము బ్రతుకవని' చెప్పి నంటిని. దీని వినిన వెంటనే నాప్రియబిడ్డ నిట్టూర్పు విడిచెను. మఱియు ఆమె మనస్సులో నొక గొప్పవిచార ముండెనని ఎగరొప్పవలన గనుగొంటిని. కొంతసేపటికి సంతోషముతో నన్నుజూచి 'అలాగుననే' అను నొక్కమాట బలికెను. ప్రతిది ఆ ఒక్కమాటలో నిమిడియున్నది. తరువాత నా ప్రియకుమార్తె పనగలేదు. దుఃఖప డలేదు, వ్యాకులపడలేదు. పసిబిడ్డ తనతల్లి రొమ్మానుకొని నిద్రించునట్లు దీర్ఘ నిద్ర నొందెను. ఆమె సమాధిమీఁద ఆ గొప్పమాటను జెక్కినందుకు నీవాశ్చర్యపడుచు న్నావా?

నేను నేడు కలువరిలోని మరియొక వేదనా సిలువయొద్దకు మిమ్మును నడిపింప కోరుచున్నాను. ఆ సిలువను జూడుము. మన పరమ తండ్రియొక్క 'అలాగుననే' అను శాశ్వతమయినమాట ఆ సిలువమీఁద చెక్కబడి యుండుట మీరు జూడలేదా? ఎందుకది ఇక్కడ నున్నది?

## మానవహృదయ మెల్లప్పుడు జెడుస్థితినే గోరుచున్నదని

దేవుని గొప్ప చరిత్రగల బైబిలును జదువునపుడు దానియందు కనుగొనుచున్నాము. ప్లేటో అనువారు వర్ణించు ప్రకారము మన బ్రతుకు ఈలాగున ఉన్నది. ఏలాగనగా బండికి ముందుకట్టిననల్లగుఱ్ఱము ఎప్పటికి వెనుకకు అడుగువేయును. గనుక తెల్లగుఱ్ఱపు

సహాయముతో బండి తోలువాఁడగు ఆత్మ ముందుకు సాగిపోనేరదు'. ఇది మాత్ర
భూతభవిష్యద్వర్తమానచరిత్రమును దృష్టాంతపరచుచున్నది. బైబిలులోని మొదటి
రెండు వచనములు ప్రతి తరములో జీవించినమానవచరిత్రసారమైయున్నది. దేవుఁడు
భూమ్యాకాశములను సృజించెను. ఆకాశము కొరకు భూమిని, భూమి కొరకు ఆకా
శమును గలుగఁజేసెను. అవి ఒకదానికొకటి పొందిక గలిగియుండెను గాని చెడుతన
మువలన నిరాకారముగాను శూన్యముగాను ఆయెను. చీకటి అగాధజలముపైన
గమ్మియుండెను. మనుష్యుని హృదయము పాప దుష్టత్వము గలదయినందున
అతఁడు ప్రతి లోకమును పాడుగను ప్రతితోటను శూన్యముగను జేయుచున్నాడు.
పాత నిబంధన.

మనుష్యుఁడు దివాలాయెత్తిన చరిత్రను గురించి

వివరించుచున్నది. ఆదాము హవ్వలు తమ సృష్టికర్తవలన జేయఁబడి జీవము పొంది
నందున నిశ్చయముగా వారు పాపరహితులయి యుండవలయును. సైతాను పాప
ము వారిని యాగతికిఁ దెచ్చెను. నిత్యసత్యుఁడయిన ప్రేమగల మనపరలోకపుతండ్రి
మాటలకంటె ఆదినుండి అబద్ధికుడయిన సైతాను మాటలను ఆదాముహవ్వలవలె నీవును
నేనును యెక్కువగా నిష్టపడి నమ్ముచున్నాము.

అలాగున ఆదాము కుమారులు త్వరలో తమ హక్కును పోఁగొట్టుకొనిరి. ప్రతి
వాఁడును తనహక్కును పోఁగొట్టుకొనిన తరువాత దేవుఁడు సమస్త కార్యమును
గొట్టివేసెను. జలప్రళయము తరువాత ఆయన ఒక కుటుంబము నేర్పరచుకొనెను.
నూతనముగా నీతిని స్థాపించుటకయి దేవుఁడు నోవహు కుటుంబము నేర్పర్చుకొనెను.
గాని ఈనోవహుకూడా పాపములోఁబడి దివాలా ఆయెను. మనము చూచుప్రకా
రము ఆదాము హవ్వలును, వారసంతతివారును, ఒక్కొక్కరు పడిపోయిన తరువా
త నోవహు కుటుంబమును ఆయన కుమారులయిన షేము, హాము, యాపెతుఅనువారి
కుటుంబములును, చెడిపోయెను గనుక దేవుడు వేరొక కుటుంబము నేర్పరచుకొ
నెను. భక్తాగ్రేసరుఁడగు అబ్రాహాము 'దేవుఁడు దేనికి శిల్పియు నిర్మాణకుఁడునై
యున్నాఁడో పునాదులుగల యాపట్టణము కొఱకు యెదురు చూచుచుండెను. తన
కుమారుఁడగు ఈసాకును అర్పించుటకుఁ బిలిచినప్పుడు మృతి బొందిన వారిలోనుండి
లేపుటకు దేవుఁడు శక్తిమంతుఁడని యెంచెను' దేవుఁ డబ్రాహామునందు దయిన
భీతి గల ఒక వంశము నిర్ణయించుకొని యుండెను. పాత నిబంధన లోని
పుస్తకము లన్నియూ ఈ వంశము చెడిపోయిన స్థితిని గుఱించిన చరిత్రలతో నిం

డి యున్నవి. దేవుఁడు తా నేర్పరచుకొనిన ఇశ్రాయేలీయులను ప్రేమించి తన్ను తానే వారికి బయలు పరచుకొని వారి ఎడల మితిలేని యోపిక గలవాఁడై వారి రక్షణకొఱకు యజ్ఞములను నిర్ణయించెను. ఆదాము నోవహులకు జేయనిది వీరికి చేసిన తరువాత ఎషయా 43 అ:లో చదువు ప్రకారము 'అడవి జంతువులును అడవి కుక్కలును నిప్పుకోళ్ళును నన్ను ఘనపరచును. యాకోబూ నీవు నాకు మొఱ పెట్టుట లేదు ఇశ్రాయేలు నన్ను గూర్చి నీవు విసికితివిగదా దహన బలులుగా గొఱ్ఱె మేఁకల పిల్లలను నాయొద్దకుఁ దేలేదు. నీబలులచేత నన్ను ఘనపరచలేదు. నా నిమిత్తము సువాసనగల లవంగపు చెక్కను నీవు రూక లిచ్చికొనలేదు. నీబలి పశువులక్రొవ్వుచేత నన్ను తృప్తి పరచలేదు సరేగదా, నీపాపములచేత ,నీవు నన్ను విసికించితివి. నీ దోషములచేత నన్ను ఆయాస పెట్టితివి; అని చెప్పవలసివచ్చెను. నీవును నేనును ఇశ్రాయేలు ప్రజలవలె మనకింతటి మేలుచేసిన దేవుని మహిమ పరచకను సేవింపకను ఉన్నారము. మనమాయన సకలవరములను పొంది ఇశ్రాయేలీయులవలె వానిని దుర్వ్యయము చేయుచున్నాము.

ఇది లోకములో నుండు ప్రతివంశము యొక్కయు ప్రతికుటుంబములో నుండు ఒక్కొక్కని యొక్కయు క్లుప్త చరిత్రమై యున్నది.

## అందఱు దివాలా యెత్తిరి.

భయంకరమైన పాపదోషములనెడు అప్పును ఎవరు తీర్చెదురు? ఎవరుతీర్పగలరు? శాశ్వత న్యాయము, ఋణమును దీర్పుమనుచున్నది ఎవరు దానిని తీర్పగలరు?ఎవరుదానిని తీర్చెదురు? మానవుఁడు నిజముగాఁ దీర్పనేరఁడు. తాను దివాలాదైనందున నిరాశ పంకములోబడి మునిగి పోవుచున్నాఁడు. లోకములోని సకల మత గ్రంథములు యిది సత్యమని ఘోషించుచున్నవి.

యిండియాలోఁ బనిచేసిన సమాయేలు హెబెక్ అనునొక ముసలి జర్మని పాదిరిగారు మిక్కిలి సామాన్యమగు నొక దృష్టాంతము ద్వారా మనుష్యుఁడు పాపకూపములోఁ బడుటను గూర్చియు, దానినుండి రక్షణ పొందుటను గూర్చియు, దేటగా వివరించినాడు. విద్యావిహీనుల మనస్సులకు రక్షణాగత్యతను వివరించునపుడు ఆయన ఒక అర్ధణాను, రూపాయను జూపించును. అర్ధణాను జూపించుచు, ఈ అర్థణాను జూచుచున్నారుగదా, యిదిరాగినాణెము. యిది తక్కువవెల గలదనవచ్చును

మనుష్యుఁడు అట్టివాఁడే. నాబిడ్డలారా, అది మీరే. మీ పాపములు మిమ్ము
ను రాగిగా జేసెను. దేవుఁడు ఆదాము హవ్వలను నిర్మలవెండిగా సృజించెను. వారు
స్వచ్ఛమయిన బంగారు కావలసియుండగా పాపము వారిని ఎట్లు రాగిగాఁ జేసెనో
చూడుఁడి! మరియు దేవునిరూపమును సహా తుడిచివేసెను. పాప మిప్పుడు
మనల నందరిని తక్కువవెలగల రాగిగ జేసియున్నది. కాఁబట్టి మన పాప స్వభావ
మెల్లప్పటికి పైన నుండునని 'చెప్పి రాగినాణెముమీఁద వెండి నాణెము నుంచి తిరిగి
చూపించుచు' యిప్పుడు మీరు రాగినాణెమును జూచుచున్నారా? లేదు. ఎం
దుకు? ఎందుకనఁగా రాగి నాణెము వెండి నాణెము చేతఁ గప్పబడి యున్నది. అటు
వలె శ్రీయేసుయొక్క నీతి మన పాపముల నన్నిటిని కప్పుచున్నది. మనము పశ్చా
త్తాపపడి ఆయనయందు విశ్వాసముంచినపుడు మన సకల పాపములు కప్పఁబడినవి.
దేవుఁడు మాత్రము శ్రీయేసుయొక్క ప్రాయశ్చిత్త బలివలన నీతి యనే వెండిని
చూచుచున్నాఁడు. అయితే ఆ పాతరాగి నాణెము యింకా అక్కడ కలదని మరచిపో
వద్దు. నీవు యెల్లప్పుడు మేలుకొని ప్రార్థించుచు; పౌలు చెప్పినట్టుగా 'అయ్యో నేనెంత
దౌర్భాగ్యుఁడను; ఇట్టి మరణమునకు లోనగు శరీరమునుండి నన్నెవఁడు విడిపించును?
మన ప్రభువయిన శ్రీయేసుక్రీస్తుద్వారా దేవునికి కృతజ్ఞతాస్తుతులు చెల్లించుచున్నాను.
కాగా మనస్సు విషయములలో నేను దేవుని బోధన ప్రమాణమునకును, శరీర విష
యములో పాప న్యాయమునకును దాసుఁడనయి యున్నాను' అని మొరపెట్టుము.
ఓప్రియుఁడా! శ్రీయేసుయొక్క పరిశుద్ధమైన వెండియనే స్వభావము మాత్రమే మన
పాపకరమయిన రాగియనే స్వభావమును కప్పివేయుచున్నది. కాఁబట్టి యిప్పుడు
క్రీస్తుయేసునందున్న వారికి ఏశిక్షావిధియులేదు. వారు శరీరమనుసరింపక ఆత్మనను
సరించియే నడుచుకొందురు. ఎందుకనఁగా క్రీస్తుయేసునందు జీవమునిచ్చు పరిశు
ద్ధాత్మయొక్క బోధనప్రమాణము పాప మరణములయొక్క బోధన ప్రమాణమునుండి
నన్ను విడిపించెను.

'అలాగుననే' అనునది త్రియేకదేవునియొక్క రక్షణ తీర్మానము. మనుష్యుఁడు
ఎక్కడ తప్పిపోయెనో, అక్కడ దేవునికృప ప్రబలమాయెను. మన పరమ తండ్రి
మనమీఁద సైతానుకు జయముఁ గలుగనియ్యఁడు. జగత్తు పునాది వేయఁబడకముందే
మనప్రియతండ్రియొక్క ఆలోచన సభలోఁ దప్పిపోయిన నరుని దయతో రక్షింప
తీర్మానించుకొనెను.

ఈగొప్ప మర్మమును దీర్ఘముగాఁ దలపోయఁగోరుచున్నాను. పరలోక దూతల సహా మానవులై నిలిచి ఈగొప్ప ప్రత్యక్షతను అనఁగా అత్యున్నతమైన సింహాసనమందు ప్రభువు కూర్చుండుట, ఆయన చొక్కాయి అంచులు దేవాలయమును, నిండుకొనుట, ఆయనకు పైగా దేవుని మహాదూతలు నిలిచియుండి ఒక్కొక్కనికి ఆరేసి రెక్కలు ప్రతివాఁడు రెండు రెక్కలతో తనముఖమును, రెంటితో తనకాళ్ళను, కప్పుకొనుచు రెంటితో ఎగురుట. వారు సైన్యముల కధిపతియగు యెహోవా పరిశుద్ధుఁడు, పరిశుద్ధుఁడు, పరిశుద్ధుఁడు, సర్వలోకము ఆయన మహిమతో నిండియున్నదనుట; మందిరము ధూపముచేత నింపబడుట, అను ఈ సమస్త ప్రభావ మహిమలు ప్రపంచమును మౌనముగా నుంచి సమస్తసృష్టిని చెప్పనలవిగాని భయకంపముతో నింపినపుడే నరుడు సైతాను యొక్కయు పాపము యొక్కయు దాసత్వముండి విడుదల చేయబడవలసినదని దీర్మానింపబడినది. నిత్యుఁడైన తండ్రి గంభీరస్వరములో 'అలాగున నే' అని పలుకుచు నరుడును దూతలును చేయజాలనిది మనము తీర్మానించుదము. 'నా కుమారుడా: నీవు నరుడవు కావలయును, నరులమధ్య నరునివలె బీదరికమందు జీవింపవలయును, పడిపోయిన నరునికొరకు విమోచనక్రయధనముగా నీప్రాణము పెట్టవలయునవును. దేవుని జనితైక కుమారుడగు శ్రీయేసు ఇట్లుగాక సమస్తము వ్యర్థమనిఎరిగి దైవచిత్తమునకు లోబడి 'అలాగున నే' అని చెప్పుచు తండ్రిచిత్తమునకు తన్ను తానప్పగించుకొనుచు ఈలాగు చెప్పుచున్నాడు. 'బలియు అర్పణయు నీవు కోరలేదు. పూర్ణ హోమములను పాప పరిహారార్థమైన బలులను నీకిష్టమైనవి కావు. కనుక నీచిత్తము నెరవేర్చుటకు ఇదిగో నేను వచ్చియున్నాను'. అప్పుడు పరిశుద్ధాత్ముడును నిత్యుఁడయిన కుమారుని మరణప్రాయశ్చిత్తములద్వారా పలికిన దెట్లనగా 'నూతన హృదయము నరుల కిచ్చెదను నూతన స్వభావము వారిలో కలుగజేసెదను. రాతిగుండె వారిలోనుండి తీసివేసి మాంసపు గుండెను వారికిచ్చెదను. నేనే మీయందు నివసించి దేవుని ఆజ్ఞల ననుసరించువారినిగాను ఆయన విధులను గైకొనువారినిగాను చేసెదను'.

## నేనుమిమ్మును తిరిగికలువరిలోనిసిలువయొద్దకు పిలుచుచున్నాను.

మానవకోటి కొరకు మరణమగుచున్న పరిశుద్ధరక్షకుని వేదనగల మరణమును విదానించి చూడుఁడు. ఆయన తృణీకరింపబడి మనుష్యులవలన విసర్జింపబడి, హింసింపబడి, తగ్గింపబడి, వ్యసనాక్రాంతుడయి దుఃఖమును భరించినవాఁడు 'నా దేవా

నా దేవా నీవు నన్నెందుకు చేయివిడచితివి' అని చేయు భయంకర కేకను వినుడి. అక్కడ 'అలాగున నే' అను పదముయొక్క భావమును నేర్చుకొనుడు. ఇది దైవసంబంధమైనది. ఇదిమాత్రమే చెడిపోయిన నరుని రక్షింపగలదు. మన దేవుని 'అలాగున నే' అను పదముయొక్క సమాప్తి ఇక్కడకలదు. ఈస్థలమందు రక్షణ సంపూర్ణముగను ఉచితముగను కలదు. దేవునిగొప్పజయ మిచట కలదు. దేవుఁడు లోకము 'అలాగున నే' ప్రేమించెను. ఇప్పుడు తండ్రి క్షమాపణకొరకు తనయొద్దకురమ్మని పాపులనుమనవి చేసి వేడుచున్నాడు. మిమ్మును కడుగుకొనుడి. శుద్ధిచేసికొనుడి. మీదుష్క్రియలు నాకు కనబడకుండ వాటిని తొలగింపుడి. కీడుచేయుట మానుడి మేలుచేయ నేర్చుకొనుడి. న్యాయము జాగ్రతగా విచారించుడి. హింసించువారికి న్యాయముచేయ నేర్పుడి. తండ్రి లేనివానికి న్యాయము తీర్చుడి విధవరాలి పక్షముగా వాదించుడి. యెహోవా ఈమాట సెలవిచ్చినాడు. రండి మన వివాదము తీర్చుకొందము, మీపాపములు రక్తమువలె ఎర్రనివైనను అవి హిమమువలె తెల్లబడును. కెంపువలె ఎర్రనివయినను అవి గొర్రెబొచ్చువలె తెల్లనివగును. బంధుడయిన శ్రీయేసు అపారమయిన కనికరముతో 'ప్రయాసపడి భారము మోసికొనుచున్న సమస్తమయినవారలారా! నాయొద్దకు రండి; నేనుమీకు విశ్రాంతి కలుగజేతును. నేను సాత్వీకుడను దీనమనను గలవాఁడను. గనుక మీమీఁద నాకాడి ఎత్తుకొని నాయొద్ద నేర్చుకొనుడి. అప్పుడు మీప్రాణములకు విశ్రాంతి దొరుకును. నాకాడి సుళువుగాను నా భారము తేలికగాను వున్నవి' అని పలుకుచున్నాడు. మరియు పరిశుద్ధాత్మ తండ్రి కుమారులకేరట 'అలాగున నే' అను పదముతో బైబిలును ముగించు క్షమా స్వభావముగల తండ్రియొక్క పిలుపును అంగీకరించుటద్వారా దేవునితో సహవసించుడని ప్రోత్సాహపరచుచున్నాడు. 'ఆత్మయు పెండ్లికుమార్తెయు రమ్మని చెప్పుచున్నారు. వినువాఁడు రమ్మని చెప్పవలెను. దప్పిగొనువాడు రావచ్చును. ఇచ్ఛయించువాడు జీవజలమును ఉచితముగా పుచ్చుకొనవచ్చును'.

త్రియేక దేవుని సముఖమందు గొప్పదయిన 'అలాగున నే' అను పదమువలన నీకును నాకును కలిగే గొప్పప్రశ్న యేమనగా, దేవుడు మనలను ఈలాగు ప్రేమించితే మనముకూడ ఆయనను ప్రేమించవద్దా? మనల నట్లు ప్రేమించిన దేవునికి మన బ్రతుకును మనకుగల సమస్తమును సమర్పించుకొనకూడదా? సిలువమీఁద మన రక్షకుఁడు మరణించుటను జూచునపుడు,

గీ॥ ప్రేమయను దేవఋణము 'నే' బ్రీతిఁదీర్చ
పంచనకరముపాటేదియుఁ బనికి రాదు
మహిని నను నేన నీకు సమర్పణంబుఁ
జేసి నేఁజేయఁగలదేది చిత్తగింపు మని చెప్పవద్దా?

'ఔను, దీని నేను చేయవలెనుగాని యెట్లు చేయగలను?' అని చెప్పుచున్నావు. బోధకులెల్లప్పుడు మనము చేయకూడనిది చేయవలసినదని చెప్పుదురుగాని మన దుస్స్వభావము నెట్లు జయింపగలమో చెప్పరు. కాఁబట్టి వారి ప్రసంగమంతయు నిష్ప్రయోజనము. నా స్నేహితుఁడా, నిన్ను నేనడుగున దేమనగా నీవు నీస్వాంతము నకును దేవునికిని యథార్థుడవయి యుండుము. నీ వింతకుపూర్వ మెన్నడును

## పొగబండిని జూడనివాడవయి యుండగా .

ఒకడు పొగబండి నిమిషమున కొకమైలు పోగలదని చెప్పినను దానిమీదప్రయాణము చేసిన వేలాది జనులు 'అది నిజము మేమాలాగు పోవుట యెక్కి చూచినాము' అని సాక్ష్యమిచ్చినను నీవు నమ్మకపోవుదువు నీవు ఆపొగబండిలో ఎక్కి ప్రయాణము చేయకుంటే నీకాయనుభవము యెట్లుండును? గనుక పొగబండిలోకి వెళ్లి కూర్చుండుము అది మిగుల వేగముతో బోవునపుడు ఘడియారమును చేతబట్టుకొని మయిలురాళ్లు మహావేగముగ దాటిపోవుచుండుట జూచి బండి మిక్కిలివడిగా పరుగెత్తు గుర్రముకంటె త్వరగా పోవునని గ్రహింతువు. నీమందబుద్ధిని, దురభిమానములను, సందేహములను జయింపలవయును. పొగబండి వేగమును బరీక్షించినటుల దేవుఁడొకడున్నాఁడని బరీక్షించి కనుగొనవలయును.

నే నాస్ట్రేలియాలో నుండినపుడు దేవుఁడు 'అలాగున నే' ప్రేమించెను అను మూలవాక్యముమీఁద ప్రసంగించుచుండఁగ

## తెలివిగల ధనికుఁడయిన యొక కాపువాఁడు

నీప్రసంగము నాకు మిక్కిలి స్నేహితుఁడయిన ఒకనిహృదయమునందు నుబ్రతుకునందును గొప్పమార్పు కలిగించుట నేను చూచితినిగాని నాహృదయము ఏవిధముగా నైనను తాకలేదు. ఎందుకనగా మహాశక్తి నన్నుకదలింపలేదు. నాహృదయము రాయివలె నున్నదని ఒప్పుకొనెను. అందుకు నేనునీవు నాతో చెప్పగనగినది శ్రీయేసుతో చెప్ప

గోరుచున్నావా ?   అని అడిగి నీవును నీ స్నేహితుఁడును సంఘాధ్యక్షునిగదికి రమ్ము.
ఇచ్చట మనము ఏసంభాషణ చేయక అంతయు శ్రీయేసునకుఁ జెప్పి ఆయనను పరీ
క్షించెదము; అనియు శ్రీయేసు 'ఇద్దరు ముగ్గురు నానామమున నెక్కడ కూడియుం
దురో అక్కడ నేను వారిమధ్య నుందునని చెప్పినట్లు' మనము ముగ్గురము శ్రీయేసు
నాథుని పేర మోకాళ్లమీద నున్నప్పుడు ఆయన నీతో మాట్లాడుటకు ప్రార్థింతము.
నీవు వచ్చెదవా? అని అడిగితిని; అందు కతఁడు సరే వచ్చెదను. నాలో సంతోషము
లేదు. ఈపరీక్ష నాకు సంతోషము నిచ్చినయెడల అడుగుట కిష్టపడుచున్నాను,
అని చెప్పుచు మారుమాటాడక గదిలోనికి ప్రవేశించి మోకాళ్లూని నేను మనవిచేసిన
దేమనగా శ్రీయేసునాథా నీవిప్పుడే నాస్నేహితుని ముఖాముఖిగా దర్శింపరమ్ము
"పాపి" అనుఆయన చెప్పిన దేమనగా ప్రియుఁడయిన శ్రీయేసుస్వామినన్నురక్షించితివి.
ఇప్పుడు నాప్రక్కదగ్గర నున్న నాస్నేహితుఁడయిన చార్లీయొక్క సకలవిజ్ఞాపనములను
విని ఆయనను కూడ రక్షింపమని వేఁడుకొనుచున్నాను. ఒక నిమిషమయిన తరువాత
నాల్లహృదయము పగిలి ప్రియుఁడయిన శ్రీయేసుప్రభువా, నావంటి పాపిని రక్షింప
జాలవా? నాయందు దయవుంచుము; అని ప్రార్థించెను. మరి కొంతసేపు నిశ్శబ్ద
ముగా నున్న వెనుక పశ్చాత్తాపపు కన్నీరు తక్షణమే చెప్ప నలవిగాని సంతోషబాష్ప
ములకు మార్చబడి అప్పుడే చార్లి హల్లెలూయ యెట్టిరక్షకుఁడు.ఆయన నాకొరకుచని
పోయెను; నేను రక్షింపబడితినని కేకలువేసెను. స్నేహితుఁడా, నేను నిన్నడిగే
దేమనగా చార్లీయెట్లు శ్రీయేసునుపరీక్షించి తెలుసుకొనెనో అట్లు నీవు ఆయనను పరీ
క్షించి తెలుసుకొనలేవా? అప్పుడు నీవునహా చార్లీవలె మారుమనసును పొందిన తరు
వాత సంతోష గానముతో ఈక్రిందికీర్తన పాడుదువు.

పల్లవి॥ ఉన్నపాటునవచ్చు-చున్నానునీపాద-సన్నిధికో రక్షకా=యెన్నశక్యముగాని
పాపములన్ని-మోపుగనీవుపయిఁబడి-యున్నవి దినదలేకదొ్రెలు- చున్నవాఁ
డను నన్ను దయగను॥ ఉన్న॥

'కడుభీకరాఁడనం-ధుఁడను దౌర్భాగ్యుఁడను - చెడిపోయి పడియున్నా
ను=నుడిపడినామదికిస్వస్థత- చెడిన కనులకు దృష్టి భాగ్యముఁ- బడయవలసిన
వన్నినీచే-బడయుటకు నాయొద్దయాఁడాయి ద॥ యున్నపాటున॥

దేవుఁడు మనకు రెండుమాటలు చెప్పుచున్నాఁడు. ఈరెంటియందు 'అలా
గున నే' అను మాట కలదు. దీనిని మన హృదయములు తిరిగి పలుకునట్లై యుం

డవలెను. దీనిని నీవు రోమా 10: 8-13 వచనములలో కనుగొందువు. వీనిలో 13-వ వచనము ముఖ్యమయినది. 'యెహోవా నామమునుబట్టి ప్రార్థనచేయువాడెవడో వాడు రక్షింపబడును'. నీవు చేయవలసినదంతయు చార్గ్లి చేసినదే. యెహోవా నామమునుబట్టి ప్రార్థించుము. అనగా

శ్రీ యేసునామమునుబట్టి ప్రార్థించుము; అప్పుడు నీవు రక్షింపబడుదువు.

పై వచనములు ఈ ఆజ్ఞయొక్క భావమును వివరించుచున్నవి ఏమనగా వాక్యము నీయొద్దను, నీనోటను, నీహృదయములోను ఉన్నది; అది మేము ప్రకటించువిశ్వాసవాక్యమే' లేక మరియొక విధముగా చెప్పితే మనదేవుని ఘనమయిన 'అలాగునే' అను పదము మీకు ప్రకటించుచున్నాము. ఈవిషయమందు మీరు దేవునితో ఏకభావముగలవారగుటకు విశ్వాసపదమగు 'అలాగునే' అనునది మీ హృదయములయందును కలదు. ఎందుకనగా 'శ్రీయేసు ప్రభువని నీనోటితో ఒప్పుకొని దేవుడు మృతులలోనుండి ఆయనను లేపెనని నీహృదయమందు విశ్వసించినయెడల నీవు రక్షింపబడుదువు. ఎందుకనగా నీతికలుగునట్లు హృదయములో మనుష్యుడు విశ్వసించును. రక్షణ కలుగునట్లు నోటితో ఒప్పుకొనును. ఏలనగా ఆయనయందు విశ్వాసముంచు ప్రతివాడును సిగ్గుపడడని లేఖనము చెప్పుచున్నది. యూదుడని హెల్లెనీయుడని భేదములేదు'. కావున మీరందరు చేయవలసిన దేమనగా, శ్రీ యేసుస్వామి పేరట ప్రార్థించుడి. అప్పుడు మీరు రక్షింపబడుదురు. దీనికన్న తేలికైనమార్గము మరియొకటి కలదా? ఉంటే, ఎందుకు చేయకూడదు? ఇప్పుడే ఎందుకు చేయకూడదు? పై ఈ ప్రార్థనయందు రెండు సంగతులు కలవు. ఏవనగా,

1. హృదయములో విశ్వసించుట, 2. నోటితో ఒప్పుకొనుట.

ఒకడు తన హృదయమందు విశ్వసించుట మన మనుకొనునంత తేలికయయినది కాదు. లోకసంబంధమయిన మనుష్యుడు సైతాను అబద్ధములనతనహృదయమందునమ్ముచున్నాడు. ఎందుకనగా అతని హృదయము సైతానుకు సంబంధించినది గనుక దానినుండి చెడ్డతలంపులు బయలుదేరును. అనగా వ్యభిచారము, అత్యాశ, చెడ్డతనము, మోసము, కామాతురత, చెడుదృష్టి, గర్వము, దూషణ, బుద్ధిహీనత ఈమొదలయిన దుష్కార్యములు మనుష్యుని లోపలనుండే బయలుదేరి అతని నపవిత్రునిగా జేయునని మన ప్రభువయిన శ్రీయేసు చెప్పుచున్నాడు. ఈపాపములన్నియు నరకమునుండి దయ్యములవలె లేచుచున్నవి. మనుష్యునికి దేవునిజూచి విశ్వసించునట్టి ప

రిశుద్ధ హృదయము గలిగి ఆదయ్యాములను జయించవలెను. ఇట్టి విశ్వాస కార్యము మన స్వబలముతో నెన్నడయినను చేయలేముగాని శ్రీయేసుక్రీస్తుద్వారా విజయ మిచ్చు దేవుడు మనకు జయము కలుగజేస్తున్నాడు. మనమాయనతో నుండెఅయ న మనలో నుండును. ఆయన నిశ్చయముగా సైతానును జయించును. మనతొందర సమయమం దెల్లప్పుడు సహాయము చేయును. శ్రీయేసు, ఆయనయందు విశ్వాస ముంచు వానిని యెన్నడయినను త్రోసివేయడు. దేవుడు, శ్రీయేసును, చనిపోయిన వారిలోనుండి లేపియున్నాడని నీహృదయమందు నమ్ముచున్నావా? నీవు సజీవుడ యిన రక్షకుని సన్నిధానమందున్నావని తెలియునా? అప్పుడునీకు నీతి గలుగునట్లు విశ్వసించుచున్నావు. ఆకాశమును భూమియు గతించిపోవు ఆమహాఅంత్యదిన మున భయపడవలసిన అక్కర లేదు. ఎందుకనగా శ్రీయేసుస్వామి నీ రక్షకుడు, స్నేహితుడు, సహోదరుడు.

మిర్జాయొక్క దర్శనమును మీరెన్నడయినను చదివినారా?

## మిర్జా బాగ్దాదు పట్టణమునకు దగ్గరనున్న ఎత్తయిన కొండలమీద కెక్కి

మానవబ్రతుకుయొక్క వ్యర్థతను గూర్చి ధ్యానించుచు చివరకు మహా విచారముతో నిండి వాస్తవముగా మనుష్యుడు నీడవలె యున్నాడనియు ఆయనజీవము స్వప్నము వలె యున్నదనియు పలికెను. అంతటతడు శ్రవణానందకరమైన సంగీతమును విని హృదయానందభరితుడాయెను. పిల్లనగ్రోవితో అత్యుల్లాసకరముగ వాయించిన గొర్రెలకాపరి ఆయనను పర్వత శిఖరముమీదికి దీసికొనిపోయి తూర్పువయిపు చూడ మని చెప్పెను. అప్పుడొక పెద్దలోయయు, ఆలోయగుండా గొప్ప శబ్దముతో పారుచున్న ప్రవాహమును కనుపడెను. అది దుఃఖలోయ, ఆలోయలోని భయం కరమయిననది లోకారంభమునుండి లోకాంతమువరకు పారుచున్నది. ఆనదియొక్క ఆరంభము చివరయు చీకటిగా నుండెను. ప్రవాహమధ్య నొకవంతెన కలదు. అది మానవ బ్రతుకను వంతెన. ఈవంతెనకు డెబ్బది మంచికమానులు కలిగియుండె. ను. కొన్ని అరిగియుండినను యితరమయినవాటితో కలసి యుండినందువలన్నియు చేరి నూరుకమానులై యుండెను. ఈవంతెనకు పూర్వము నూరు కమానులుండెను. గాని గొప్ప వరదవచ్చి తక్కినవి కొట్టుకొని పోయినందున ఇప్పుడు సిథిల స్థితిలో నున్నవి. వాటిమీద బహు జనసమూహములు నడచి వెళ్లుటను, దాని యిరుపా ర్శ్వముల దట్టమయిన మేఘము కమ్మియుండుటను మిర్జా చూచెను. దాని నిదానించి

చూచినప్పుడు లెక్కలేని బోనులవంటి తలుపులు వంతెనమీద నున్నవి. ప్రయాణ
స్థులు వాటిమీద బోవునపుడు క్రిందనున్న ప్రవాహములోబడి కనబడకుండాపోయిరి.
జనులు గుంపులు గుంపులుగా మబ్బుగుండా ప్రవేశించినప్పుడు అనేకులు ఆప్రవాహ
ములోబడి కనబడకుండా బోయిరి. కొంద రాపగిలిపోయిన కమానులమీద సహిత
ము నడుచుచుండిరి. చివరకు వారుకూడ ప్రయాణమువలన అలసి వాటిగుండా పడి
పోయిరి ఆవలి కొనన ఒకలావు మహాసముద్రములోనికి చొచ్చినట్లుండెను. దానిమధ్య
నొక వజ్రపుకొండ యుండెను. ఆయన అలంకియొక్క రెండుప్రక్కలను చూచినప్పు
డు ఒకప్రక్క పొగమంచుతో కప్పబడియుండి, మరియొకప్రక్కన పండ్లతోను పుష్ప
ములతోను నిండిన లెక్కలేనిదీవులను చూచెను. జనులు పూదండలువేసికొని చెట్ల
మధ్యను దిరుగుచు వూటలు యొద్దనను పువ్వుల బడకలలోను పరుండుచుండిరి. పక్షు
లపాటలు, నీటిధ్వనులు, మనుష్యశబ్దములు వాయిద్య నాదములుగా వినబడుచుం
డెను. రాంబందువలె నాకు రెక్కలు కలిగియుంటే ఆ సంతోషకరమయిన లంకల
లోకి యెగిరిపోదునని మిర్జా చెప్పెను. అక్కడికి వెళ్లుటకు మరణముద్వారానేగా
ని వేరొకమార్గములేదు. ఈలంకలు సజ్జనులు మరణానంతరము వాసముచేయు స్థల
ములు. కడపట మిర్జా కారు మేఘములను చూచి ధ్యానించుచు ఆకఠినబండ కా
వల దుర్మార్గులయొక్క స్థలమున్నదని తెలిసికొని యింతలో నిద్ర మేలుకొనెను.

స్నేహితులారా, ఈదర్శనము ఒకపట్టిస్వప్నముకాదు, అది నిత్యత్వము
యొక్క సత్యరూపయి యున్నది. నీవాబండకు ఎప్రక్కనుందువు? జీవము నెడి వంతెన
దాటి ప్రవాహముచే నదిలోబడి నిత్యత్వముచే మహాసముద్రములో కొట్టుకొని పోయే
టప్పుడు ఆబండకు ఎప్రక్కన నుందువు? పరదయిను అనే లంకలయొద్దకు చేరుదు
వా? లేక కారుమేఘములతోను శాశ్వత భయములతోను నిండియుండు నరకమునకు
పోదువా? దేవునియొక్క గొప్పదయిన 'ఆలాగునకే' అనునది నీదయి యుండేలాగున
జేసికొనుము. అప్పుడు నీవు భయపడనక్కరలేదు. నీ ముందుగతి మేలుకరమైన
దగును.

---

## 11. అధ్యాయము.

# LOVED:—ప్రేమించెను.

ప్రపంచములోని గొప్ప శాస్త్రజ్ఞుఁడగు సర్ ఐజిక్ న్యూటను తన దీర్ఘజీవితమండలి ప్రయాణములను పునర్విచారణ చేసికొనుచు "లోకులు నన్నుగుఱించి ఏమితలంతురో నాకుఁ దెలియదు. సత్యమనే మహా అగోచర సాగరముయొద్ద ఒక బాలుఁడు సుందరమైన గుల్లనైనను నున్నని రాతినైనను గనుగొనినట్లు నా విషయమై నేననుకొనుచున్నాను" అని చెప్పెను. దేవుని వాక్యము చదువునపుడు మనమును చిన్నబిడ్డలవలె నున్నామనుకొనవచ్చును. ఎందుకనఁగా అది దేవుని అనంతమైన సత్యసాగరము. నిజమే ప్రతిపుస్తకము, ప్రతిఅధ్యాయము, వానిలోని ప్రతిమాటయొక్క లోతు యేమిటో గనుగొనలేనంతటి సత్యముగల మహాసముద్రము. వానిలోతు, వెడల్పు మనము కనుగొనలేకపోయినను చిన్నపిల్లలవలె గట్టుననిలచి మహా సముద్రములోనుండి కొట్టుకొనివచ్చిన గుల్లలనుజేర్చి చెవియొద్ద పెట్టుకొనినయెడల ఆ మహాసముద్రమునుగూర్చి అవి చెప్పు చరిత్రను వినగలము. "ప్రేమించెను" అను ఈచిన్నమాట దేవుని మహా సత్యసాగరమునుండి గట్టుకు గొట్టుకొనివచ్చిన యొక గుల్లవంటిది. దానిని మన హృదయమందుంచుకొని దేవునిగూర్చియు ఆయన రాజ్యమును గూర్చియు అది ఏమి చెప్పునో విందము. "దేవుఁడు లోకమును ఎంతయో ప్రేమించెను" అనే మాటలు వినిపించగలవు గాని పొడవు, వెడల్పు, లోతు, ఎత్తు ఇంతవరకెవరును కొలత తెగించి నట్లగుపడలేదు. ఇది దూతలు చూడవలెనని ఆశించినమర్మము. సృష్టిలోనిది గొప్ప అద్భుతము. ఇది దూతలయొక్క సమస్త వినోద వాద్య నాదములకు మించిన పరలోక మధుర గానము. ఎందుకనఁగా నిది భూమ్యాకాశములందుగల మహాశ్చర్యమును విశదపరచుచున్నది.

దేవుఁడు లోకమును ప్రేమించెనని మనమెట్లు తెలిసికొనగలము? సృష్టి నిజముగా దీని నెవ్వడైనను మానవులకు వెల్లడిపరచలేదు. ఎందుకనఁగా సృష్టిలో సుందర మెక్కడ ఎక్కువగానున్నదో అక్కడ మనుష్యుఁడు నాగరికతయందును, దేవునిగూర్చిన జ్ఞానమందును, తక్కువగానున్నాఁడు. దీని ఋజువుపరచుటకు ఆఫ్రికా ఖండ

మందలి అపారమైన అడవులకు వెళ్ళుము. అక్కడ బాటసారులు మాకుఁజెప్పినట్లు అడవుల మహిమ నుజాతువు. అక్కడి తరుగుల్మాదులు బహుగొప్పవి. పర్వత ప్రవాహములు మహిమాకరమై యుండును గాని ఈ మహారణ్యములందు నివసించు మాధుని మనస్సునకు ఇవి అన్నియు దేవుని గూర్చిగాని ఆయన ప్రేమను గూర్చిగాని చెప్పవు. వారు వికారమైనట్టియు, అసహ్యమయినట్టియు విగ్రహముల నెడి దయ్యముల నారాధింతురు. సముద్రములలోని అనందమైన దీవులమీదనున్న మనుష్యులను వృక్షములు గాని, స్ఫటికమువంటి నిర్మల ప్రవాహములు గాని, మనుష్యుల ఔదార్యతగాని అందముగాని, వీరిని గొప్పవారినిగను, కులీనులుగను స్వేచ్ఛాపరులుగను జేయలేవు. వారిలో ననేకులు నరమాంస భక్షకులయి నీచపు బ్రతుకు బ్రతుకుచున్నారు. ఎందుకనఁగా వారు దేవు నెరుగరు. మనము దక్షిణ ఇండియాలోని నీల గిరులకుఁబోయి తోడాలు కోటాలు అను అడవిజనులను జూచితే వారు దేవు నెరుగరని తెలిసికొందుము. ఆ సుందరమయిన పర్వత శిఖరములలో నివసించుచున్న వారందరిలో వీరు పశుప్రాయులయి యున్నారు.

సృష్టియొక్క సకల వైభవములుగాని అందముగాని దేవుఁడు ప్రేమాకరుడని నరుల కెంతమాత్రముఁ దెలియపరచజాలవు.

గొప్ప సముద్రపు అలలు గాలివలన అతివిస్తారముగాఁ గొట్టుకొనుచుండినను దానియందు ఓడలు బెండ్లువలె నీళ్లమీఁదగొట్టుకొనుచుండినను దేవుఁడు ప్రేమించును అను దానిని ఎన్నడయినను మనుష్యునికిఁ దెలుపదు. సూర్యోదయమువలన లోకము జీవమహిమలతో నింపబడుచున్నది చంద్రకిరణములు నక్షత్రప్రకాశము రాత్రివేళల లోకమును దీపింపజేయుచున్నవి గాని మనుష్యునికి దేవుని ప్రేమను నేర్ప నేరవు. మహా ఆకాశములోని సత్యమును సృష్టియెప్పుడయినను ప్రకటింపలేదు, మానవహృదయము ఈ ఆశ్చర్యకరమయిన తలంపు నెప్పుడైనను తలంచలేదు.

తత్వశాస్త్రముసహా దీనిగూర్చి ఏమియు బోధింపదు.

లోకములో బహుదీక్షముగాఁ దలంచేవారి యభిప్రాయముల దెలిసికొనగోరి వారిని ధారణకు హేతువులనే మహాసముద్రములో మునిఁగి కేవల గుల్లలతో బయటికి వత్తురేగాని సత్యమనే ముత్యము నొక్కటైనను దెచ్చుట గానము. తత్వశాస్త్రము నిశ్చయముగా సత్యము కనుగొను శాస్త్రము. ఈశాస్త్రముయొక్క కడపటి మాటలే యోబు 28: 12-22 వ లలోఁ బలికియున్నాడు. "అయితే జ్ఞానము ఎక్కడదొరు

కును? వివేచన దొరకు స్థలమెక్కడనున్నది? నరులు దాని విలువ నెరుగరు. ప్రాణులున్న దేశములో నది దొరకదు. అగాధము-అది నాలో లేదనును. సముద్రము నాయొద్ద లేదనును. సువర్ణము దానికి సాటియైనది కాదు. దాని విలువకొలుటకై వెండి తూచలేము. అది ఓఫీరు బంగారమునకయినను విలువగల గోమేధికమునకయినను నీలములకైనను కొనబడునది కాదు. సువర్ణమయినను స్ఫటికమయినను దానితో సాటికావు. ప్రశస్తమయిన బంగారునగలకు ప్రతిగా అది ఇయ్యబడదు. పగడములపేరు స్ఫటికములపేరు దానియెదుట ఎత్తనేకూడదు. జ్ఞాన సంపాద్యము కెంపులకన్న కోరతగినది కూషుదేశపు గోమేధికము దానితో సాటికాదు. శుద్ధసువర్ణమునకు కొనబడినది కాదు. అట్లయిన జ్ఞానము ఎక్కడనుండివచ్చును? వివేచన దొరకు స్థలమెక్కడనున్నది? అది సజీవులందరికి కన్నులకు మరుగయి యున్నది. ఆకాశపక్షులకు మరుగుచేయబడి యున్నది.

అలాగయితే దేవుడు లోకమును ఎంతగానో ప్రేమించెననే నిజమును మనమెట్లు తెలిసికొనగలము? ఆయనే మనకు దీనిని తెలియపరచెను గనుక ఎరుగుదుము. లోకమంతయు పట్టినది గాను, నిరూపింపలేని మర్మముగలదిగనున్నది. దేవుని గ్రంథము మాత్రమే దీనిని మనకు దెలియపరచుచున్నది. దేవుడు ప్రేమయై యున్నాడనునది భూమ్యాకాశములందు బయలుపరచబడిన సత్యము. దీని భావమును దెలియపరచుటకు అనుదినము మనము చెప్పు సాధారణసంగతు లుపయోగింతును. సూర్యుడు వెలుగైయున్నాడని చెప్పుచున్నాముగనుక వెలుతురును గూర్చి తలంపకుండ సూర్యునిగూర్చి తలంచలేము. ఎందుకనగా ఈమాట లొకటికొకటి సంబంధించి యున్నవి కాబట్టి "దేవుడు ప్రేమయై యున్నాడు" అను మన మూలవాక్యములో నున్నట్లు "దేవుడు లోకము నెంతగానో ప్రేమించెను" అని బైబిల్ చెప్పునపుడు "దేవుడు" "ప్రేమ" అను నీ రెండు మాటలు ఒకటికొకటి సంబంధింప దగియున్నవని నేర్పించుచున్నవి. అనగా దేవుడు ప్రేమయై యున్నాడు. ప్రేమ దేవుడై యున్నాడు. త్రిత్వమును విడచి మనము దేవుని గ్రహింపజాలము. ఎందుకనగా దేవునివలె ప్రేమయు త్రిత్వమైయున్నది. మొట్టమొదట "ప్రేమగలతండ్రి" తరువాత "ప్రియకుమారుడు" ఆటుపెమ్మట "ప్రేమగల ఆత్మ" యున్నారు. ప్రేమ వీరిముగ్గురిని ఏకీభవింపజేసి వీరితో సర్వలోకమును సంబంధపరచి చివరకు వీరుముగ్గురు ఒకటియని తెలియపరచుచున్నది. వ్యాకరణప్రకారము ఒక వాక్యమునకు కర్త కర్మ క్రియ కలదని చెప్పుచున్నాము. ఇందును "దేవుడు లోకమును ప్రేమించెను" అను ఈగో

ప్రవచనమే దృష్టాంతము. దేవుడు కర్త, లోకమును కర్మ. ప్రేమించెను క్రియ "ప్రేమించెను" అను ఈ క్రియ దేవుడు లోకమును వీరిద్దరికిగల అగాధముమీద కట్టబడిన వంతెనవలె నున్నది. కాబట్టి ఈ గొప్ప ప్రేమాత్రిత్వమందు తండ్రియైన దేవుడు గొప్పకర్తయు ప్రేమకర్తయునై యున్నాడు. తండ్రియొక్క జనితైక కుమారుడగు శ్రీ యేసుక్రీస్తుయందు సర్వలోకము ప్రేమా కర్మయైయున్నది. పరిశుద్ధాత్ముడు కర్త కర్మల నేకీభవించు ప్రేమయై యున్నాడు "దేవుడు లోకము నెంతగానో ప్రేమించెను" అని చెప్పబడినదాని ఋజువును కనుగొనగోరితే మనమొకసారి కలువరికొండకు వెళ్లవలయును. మరణించుచున్న శ్రీ యేసునాథుడు సిలువమీదనుండి తనశత్రులకొరకు ప్రార్థించడము, దొంగకు పరదైసు అనగా మోక్షము నివ్వడము, తనకుప్రియులయినవారిని గూర్చి అంతమువరకు జాగ్రత్త తీసికొనడమును వినుము. అక్కడ పరిత్యాగమును పగులగొట్టగల వ్యవహార ప్రేమను జూచుచున్నాము. "నిజముగా ఈయన దేవుని కుమారుడు" అని శతాధిపతివలె కేకవేయుము. ఆయన మొదటినుండి తుదవరకు ప్రేమించెను.

కొంతమంది క్రైస్తవులు తమ బైబిలు నెట్టుచదువుదురో నేను గ్రహింపజాలను. వారు తమ బయిబిలులో సత్యల్పమయిన వానిని మాత్రమే కనుగొందురని యగపడుచున్నది. జర్మనిదేశస్థులు చెప్పునట్లు అత్యల్పమయిన వానితో వారు కాగితముల ఇండ్లుకట్టుదురు. అవి ప్రతివానము నెదుట పడిపోవునవిగా యుండును. సువార్తలు అపొస్తలుల కార్యములు ఉత్తరములు. ప్రత్యక్షీకరణము చదువునపుడు సృష్టియొక్కయు ప్రత్యక్షతయొక్కయు మూలాధారమైన మాట "సిలువవేయబడిన యేసుక్రీస్తు" అని అగుపడుచున్నది. నామట్టుకు నేను దీనితప్ప మరిదేనినయినను ముఖ్యవిషయముగా నెంచను.

నూతన నిబంధనలో ప్రేమనుగూర్చి విస్తారముగ వ్రాసిన అపొస్తలుడయిన యోహాను దేవుని ప్రేమనుగూర్చి గంభీరమయిన మాటలలో అనేకసారులు చెప్పుచున్నాడు. దేవుని ప్రేమనుగూర్చి మూడు ఋజువు లిచ్చుచున్నాడు. ఈ సత్యమయిన ప్రత్యక్షత నొప్పుకొనజేయుటకు ఎంతటి జ్ఞానికయినను అజ్ఞానికైనను ఈ ఋజువులు చాలును. 1 యోహాను 4: 9. "మనమాయనద్వారా జీవించునట్లు దేవుడు తన జనితైక కుమారుని లోకములోనికి బంపెను. దీనివలన దేవుడు మనయందుంచిన ప్రేమ కనుగొనబడెను." ప్రెసిడెంటు లింకను యొక్క ప్రేమనుగూర్చి అమెరికా దేశస్థులు మెచ్చుకొనుచున్నారు. ఏలాగనగా శిక్షాస్థు

లయిన రాణువ వారిలో నెవరినయినను క్షమింప వీలుగలిగిన సంతోషముతో క్షమించువాఁడఁట. నేను బాలుఁడనయి యున్నప్పుడు చెప్పఁబడిన ఒకసంగతి నాకుజ్ఞాపకమున్నది. ఒక రాణువ వాఁడు మెళుకువతో నుండవలసినప్పుడు నిద్రపోయినందున వానిని గుండుతో కాల్చవలసినట్లు శిక్షవిధింపఁబడెను. ప్రెసిడెంటుగారీసంగతి విని ఆపిల్లవానిని తనయెదుటకుఁ బిలిపింపగా వాఁడు వణకుచువచ్చి నిలచెను. ప్రెసిడెంటుగారి మాటలు అతనికి జీవమైనను మరణమైనను గలిగించుటకు శక్తిగలవై యుండెనని ఆయనకు తెలుసును. అప్పుడాయన 'నీకు తలిదండ్రులుగాని అన్నదమ్ములుగాని అక్కచెల్లెండ్రుగాని లేరా?' అని అడిగెను. అతఁడీలోకములో బంధువు లెవరును లేక ఏకాకియయి యున్నాఁడని తెలిసికొనిన వెనుక స్నేహితుఁడయినను లేడాయని అడిగెను. అందు కతఁడు 'లేదయ్యా' అనెను. అందుమీఁద ప్రెసిడెంటుగారు 'నేను నీకు స్నేహితుఁడనయి యుందును. నీకు మరణము తప్పివదలెను. తన స్నేహితుఁడగు ప్రెసిడెంటుగారి ప్రేమను ఆ పడుచువాఁడు ఎప్పుడయినను మరచిపోవునుకొందురా? తన్ను రక్షించిన లింకనుయొక్క ప్రేమను తన జీవితకాలమంతయు ప్రతివానితోఁ జెప్పకుండునా? ఇంకగొప్పదైనను మనము క్రీస్తుద్వారా జీవించునట్లుఈలోకములోనికి తన జనితైకకుమారుని పంపిన దేవుని ప్రేమయెదుట, లింకను ప్రేమఎంత? మనకునిత్యజీవము కలుగుట యేసు చనిపోయెను. మనము చేసినతిరుగుబాటు నిమిత్తము చావవలసినదని నిత్యుడయిన న్యాయాధిపతి కోరుచుండఁగా మనకు క్షమాపణ కలుగుట కాయన చనిపోయెను. దీనియందు మనయెడల దేవుని ప్రేమ బయలుపరచఁబడెను.

## మఱియు దీనిలో ప్రేమయున్నది.

మనము దేవుని ప్రేమించితిమని కాదు; ఆయన మనలను ప్రేమించెను. ఈ మాటలందు యెంతటిన్యాయము కలదు? మనలను ప్రేమించువారిని ప్రేమింతుము. వారినట్లు ప్రేమింపవలసినదే మనము దేవుని ప్రేమించినయెడల ఆయన మనలను యెంతగా ప్రేమించునో, గ్రహింపవచ్చును. 'దీనిలో ప్రేమయున్నది; మనము దేవుని ప్రేమించితిమని కాదు; ఆయన మనలను ప్రేమించెను.'

## పాపమనుజుఁడు దేవుని శత్రుఁడు.

అతని హృదయము మహా చెడ్డది. చీఁకటి వెలుగును ద్వేషించునట్లు అతఁ

డు దేవుని ద్వేషించును. అతఁడు స్వామిద్రోహి, రాజద్రోహి. సైతానును, స్వకీయాధిపత్యమును, రాజ్యము చేయవలయుననుద్దేశముతో దేవునిని, ఆయన ఆజ్ఞలను విఫలము చేయును. సిలువమీఁద యేసునకు రెండవ ప్రక్కనున్న దొంగ నీకును నాకును ప్రతినిధిగా నున్నాఁడు. దేవుని సర్వశక్తివలనను, నిండా ఓర్పుగల ప్రేమచేతను మన హృదయములు మార్చబడకపోయినయెడల మనమరణావస్థయందు సయితము దేవుని తిట్టి శపించువారము. మనమాయనను ప్రేమింపలేదు కాని ఆయనే మనలను ప్రేమించెను. ఆయన ప్రేమయే తుదకు జయమొందెను.

'సిరులెల్ల వ్యర్థగాగ - బరికించి నాకున్న - గరువము దిరస్కరింతున్
ఘనమహిమ యువరాజు - మరణాద్భుతపు సిలువ
నరయుచున్నట్టివేళన్ - ముఖ్యములయిన ॥సిరులెల్ల॥
ఖానివృతి రక్తంబు వస్త్రంబువలె సిలువ - పైనతని తనువు గప్పెన్
ఇక నేనీలోక - మంతటికి మృతుఁడనై
తిని నాకు లోకమెల్ల - మృతంబయ్యె ॥సిరులెల్ల॥

తప్పిపోయిన లోకమును దేవుఁడు ప్రేమించెను. అను దానిని ఋజువు పరచుటకు అపొస్తలుఁడయిన యోహాను ఇచ్చిన మూఁడవ కారణమేమనఁగా, 'మనరక్షణకొరకుఁ దగిన విలువ నిచ్చుటయే.' అనగా మన పాపపరిహారార్థము తన కుమారుని ప్రాయశ్చిత్తముగాఁ బంపెననుటయే' ఆయన చెల్లించిన వెల అదే. మనస్నేహితు లెవరయిన మన కెదురు పడినప్పుడు 'నీబండి యెద్దు వెల యెంత? నీయింటిని ఎంతకు కొంటివి? నీసొమ్ము లెంతఖరీదు?' అని అడిగినప్పుడు 'ఇది ఇంత, ఇది అంత' యని చెప్పను. ఆ వెల ఆ వస్తువుల ఖరీదును ఋజువుపరచును. గాని మనము 'మనుష్యుని రక్షణ కొరకు దేవుఁ డెంతఖరీదు నిచ్చెనని' అడిగినట్లయిన చెడిపోయిన మనుష్యుని విమోచనముకొరకు ఆయన యిచ్చిన ఖరీదు దాని వెలను ఋజువుపరచును. నీ విమోచనముకొరకును నా విమోచనముకొరకును తన కుమారుని ప్రాణమిచ్చెను. మన ఆత్మలకు ఆయన వేసిన ఖరీదు అదే. నీయాత్మకు యేమి ఖరీదు వేయుదువు! మన పాపములకొరకు ఆయన కుమారుఁడు ప్రాయశ్చిత్తముగుటనే చెప్ప నలవిగాని దానము యొక్క వెలను ఋజువుపరచుటకయి నీవు కృతజ్ఞతగల బ్రతుకు బ్రదుకుటకు దేవుఁడు నీకు సహాయము చేయుఁగాక.

'మనము దేవుని పిల్లలమని పిలువఁబడుటకు ఆయన మనయందు ఎంత ప్రేమ ఉంచియున్నాఁడో చూడుఁడి. మనము ఏమిగా నుందుమో అది ఇంకా గనుబరచఁ

బడలేదు.' అన్నిట పరిశుద్ధ బ్రతుకును, దైవభక్తియు గలిగియున్న యెట్టివార మయి యుందుము? ఎందుకనఁగా దేవుఁడు మన తెలివికి మించిన అధికృతలు అనుగ్రహించి యున్నాఁడు. నీవు దేవుని బిడ్డవా? నేనాయన బిడ్డనని ఎరుగుదును. ఆయనకు స్తోత్రము. రమ్ము ఇప్పుడే ఆయనబిడ్డ వగుము, 'నాతండ్రీ, నేను నీవాఁడను నీవునావాఁడవు' అని చెప్పుము. నిన్ను నీవేఆయన కప్పగించుకొనుము. అప్పుడు నాకు కలిగిన అధికృతలు నీకునుఁ గలుగును. అవియేవియనగా?

## మన హృదయములు పాపభారముచేత ప్రయాసపడునప్పుడు

ఆయనయొద్దకువచ్చి ఆయన పాదములయొద్ద మనభారముంచి "మేముక్షమించిన ట్లు మమ్మును క్షమించుమని" ప్రార్థించుటయే. తండ్రి నన్ను ప్రేమించి క్షమించి పవిత్రపరచును. అన్నికాలములందు మనము సమీపింపగలిగిన ప్రేమగలతండ్రి మనకుండుట ఎంతటిభాగ్యము! ఆయన మనను ప్రేమించుచున్నాఁడని ఎరిగి మనపాపములను గూర్చి ఆయనఎదుట దుఃఖించితే మనలను చేరదీసి దుఃఖమును కన్నీళ్ళను తుడిచి వేయును. క్షమాపణవలనగలుగు సంతోష మెంతగొప్పది! నీపాపములనుగూర్చి ఆయనయొద్దకువచ్చి చెప్పుము. నిన్నాయన హృదయపూర్వకముగ నంగీకరించును.

## మనము రోగిష్ఠులమైనప్పుడు

ఆయన సన్నిధి మనతోఁగూడ నున్నదనియెరుగుట ఎంతమంచిది! ఒకరాణువవాఁడు వైద్యశాలలో చావబోవుచుండగా అతనితల్లి శ్రమపడుచున్న తనకుమారుని విడకయొ ప్రకు మధ్యరాత్రిలో పరుగెత్తుకొనివచ్చి స్మారకముఁదప్పి పడియున్న తన కుమారుఁని నొసటిపై జేయివేయగానే కన్నులుఁదెరచి "అదినాతల్లిచేయి" అనెను. అంతట తనతల్లివైపు ప్రేమతో చూచిన చూపుతో ఆరాత్రి అంతయు నెమ్మదిగా నిద్రపోయెను. మనము శ్రమపడు దినము లన్నిటియందును మన దేవునిచేయి మనమీఁద నున్నది. ఆయన ప్రేమగలదెబ్బను మనము గుర్తెరుగగలము. దేవుఁడు నన్ను ప్రేమించుచున్నాఁడు. మనము జబ్బుపడినప్పుడును గాయపరచబడినప్పుడును ఇదే మన సంతోషము.

## ఆలాగయితే మరణసమయమందు

దేవుని ఎరుగుట ఎట్టిసంతోషము. ఇట్టిదరుణము మనలో ప్రతివారికివచ్చుట నిజము

ఆసమయమందు తలిదండ్రులను అన్నదమ్ములను, అక్కచెల్లెండ్రను, స్నేహితులను, అందరిని మనము విడచి మరణమనే యొర్దాను నదిగుండ ఒంటరిగపోవలసివచ్చినపుడు మన మెట్టు మన పరమతండ్రియొక్క హస్తములున్నవని తెలిసినయెడల భయపడము. "దేవుఁడునన్ను ప్రేమించుచున్నాఁడు" నుమాట చనిపోవుచుండువానికిని విడువఁబడుచుండువారికిని, మరణము నెమ్మదినిచ్చును. చాల సంవత్సరములక్రిందట ఎండకాలమందు నా పెద్దకుమారునికి వాంతిభేది తగిలెను. మా ప్రియకుమారుఁడు క్షీణదశకు వచ్చెగాలఁదిఆరాత్రిఅంతయు నెంతో వేదనతో ప్రార్థించితిమి. మరునటి ఉదయమున నా ప్రియమైన ప్రథమపుత్రుఁడు నా చేతులలోనుండగా దేవుని దూతలువచ్చి వారిచేతులతో పరలోకపు ఇంటికిఁ గొనిపోయిరి. మేమక్కడ నొంటరిగ నుంటిమి. మమ్ము నాదరించుటకైనను సహాయముచేయుటకైనను మాయొద్ద నెవరులేరు. మా ప్రాణములకంటె నెక్కువగ ప్రేమించిన మా ప్రియబిడ్డను మా స్వంతచేతులతో సమాధిపెట్టెను, సమాధిని, ప్రతిష్ఠించితిమి. నా బ్రతుకుదినములన్నిటిలో ఈదుఃఖకరదినముకంటె సంతోషకరదినము మరేదిలేదు. క్రైస్తవునికి మహావిపరీతముగ నగుపడువాటిలో నిదియొకటి. మా ప్రియబిడ్డ చనిపోయినపుడు దొరసానమ్మగారు మంచిరోగగదిలోనుండిరి. పిల్లవాఁడు మనయొద్ద లేఁడని నేనామెతోఁజెప్పి అయినను, దేవుఁడు మనతోనున్నాఁడు. ఆయన మనను ప్రేమించుచున్నాఁడంటిని. ప్రేమ ఎప్పుడైనను చనిపోలేదు. కుమారునికిని దేవునికిని కట్టబడియున్న ప్రేమానుబంధమును మరణము త్రెంపఁజాలదుగాని బలపరచగలదు. మరణశైత్యమునకును సమాధి భయంకరత్వమునకును వెనుకనుండి కలుగు "దేవుఁడెంతగానో ప్రేమించెను" అను సత్యమాతప్ప దుఃఖించుచున్నవారి నోరార్పగలిగినది మరేదైనను లేదని నేనెరుగుదును. నీ ప్రియులిక్కడలేరు. వారులేచి జీవించుచున్నారు అలసటఁబడినవారు దుష్టుల తొందరలను తప్పించుకొని విశ్రాంతిఁబొందునట్టి యనేక నివాసములుగల మహిమలో కమఁదు నీవును లేచి వారితో నిత్యము జీవింతువు.

"నాదు ప్రేమవృక్షము - దాని ఎత్తులోతులు
ఎన్నవిలుకానివి - మృత్యువాక్రమించును".

ఏవిద్యనైనను మూలగ్రంథములులేకుండఁ జదువుట అసాధ్యమని యెరుగుదుము. భూశాస్త్రమును జదువుటకు అంశమునుగూర్చి వ్రాయఁబడిన మూలగ్రంథ మగత్యము. భాషాభాగములనుగూర్చి తెలియఁగోరినచో వ్యాకరణమగత్యము. అటువలె

ప్రేమయొక్క పొడవు వెడల్పు, లోతు తెలియవలయునని కోరినయెడల

దేవుని ప్రేమను దెల్పు బైబిలనే మూలగ్రంథమును చదువవలయును

మన దేవుని అనంత ప్రేమనుగూర్చి అపోస్తలుడైన యోహాను తాను వ్రాసిన సువార్త యందును, ఉత్తరములందును, ప్రత్యక్షీకరణమునందును, అనేకమారులు వ్రాసియున్నాడు. ఆయనతో మనముగూడ మన అలసిన తలలను యేసు రొమ్మున వాలించినట్లయిన మనము మన దేవుని హృదయమును తెలిసికొందుము. మనకేమి సంభవించినను దేవుఁడు ఎంతయో ప్రేమించెనని చెప్పగలుగుదుము. గురువునొద్ద నేర్చుకొనని విద్య అసంపూర్ణమైనది. ఉపాధ్యాయునికిని, విద్యార్థికిని మధ్య ప్రశ్నోత్తరములు జరుగుచుండవలయును. అటువలె దేవుఁడెంతగానో "అను దానిని నేర్చుకొనగోరిన యెడల దేవునికిని మనకును మధ్య రాకపోకలు జరుగవలయును.

## ఆరాకపోకలే ప్రార్థనలు.

తలిదండ్రులకు తమ బిడ్డలయొక్క ముద్దుమాటలెక్కువ సంతోషమును కలిగించును. తండ్రియొక్క హృదయములోని, ప్రేమగలతనకుమారుఁడు నోరు తెఱచి పలుకు ప్రార్థన వికసించునట్లు మరేదియు వికసింపజేయదు. మూగి వారికి విద్య నేర్పించు ఒకదొరసాని ఒకప్పుడు చెప్పిన అనుభవము ఈసత్యమును దృష్టాంతపరుచుచున్నది. అమెరికాలో నొక ధనికురాలయిన స్త్రీకి ఒక్కఁడే కుమారుఁడు కలఁడు. వాఁడు చెవిటి మూగ. వాని ఉపాధ్యాయిని ఎక్కువశ్రద్ధ దీసికొని, మా-మా-అను రెండు చిన్న అక్షరములను పలుక నేర్పించెను. తల్లియొద్దకు వాని దీసికొని పోయినప్పుడు వాఁడామెవయిపు పరుగెత్తి మా-మా- అనెను. ఆప్రియబిడ్డ బలుకగా తల్లి విన్న మొదటిమాట యిదే. బిడ్డకును తల్లికిని గల సంబంధమును దెలుపు ప్రేమగల ఈమాటను వినగానే తల్లి సంతోషబాష్పములు రాల్చుచు బిడ్డను కౌగలించుకొని 'ఈ బిడ్డకొరకు నేను చేసిన సమస్త ఖర్చులకును, పొందిన అవమానములకును, తొందరలకును, ఈమాటే చాలునని' పలికెను. మనము మన పరలోకపు తండ్రియొద్దకు వచ్చి 'అబ్బా, తండ్రీ' యనిపలుక దేవుడు కోరుచున్నాఁడు. మన మాయనయొద్దకు వచ్చినట్లయిన ఆయన మనల నెంతమాత్రము త్రోసివేయఁడుగాని తన ప్రేమగలరొమ్మున చేర్చుకొని మన ప్రభువైన క్రీస్తుద్వారా తనకుఁగలిగిన ఐశ్వర్యము చొప్పున మన అక్కరలన్నిటిని సంపూర్తి చేయును.

"దేవుఁ డెంతగానో ప్రేమించెను" ఎందుకనఁగా ఆయన మొదట మనలను

ప్రేమించెను. మనము ఆయనను ప్రేమింపవలయును. మన మాయనను ప్రేమించితే

ఆయనకొఱకు పని చేయుటకు క్రీస్తుప్రేమ మనలను బలవంతపరచును. ప్రేమ సోమరిగా నుండజాలదు. ప్రేమ పని చేయవలయును. ఒక చిన్న బిడ్డ తొన్ని బొమ్మలతో నాడుకొనుచు తన కాలమును వృథాగా గడపక దగ్గరకూర్చుండియుండు తల్లియొద్దకు పరుగెత్తి "అమ్మా నిన్ను నేను ప్రేమించుచున్నానని" చెప్పెను. అందుకు తల్లి చిరునవ్వుతో "నా ప్రియబిడ్డా నీవు నన్ను ప్రేమించుచున్నావని ఎరుగుదును వెళ్లి ఆడుకొనుమని" చెప్పెను. ఇది ఆ పిల్లకుఁ దృప్తికలిగించదు గనుక తిరుగ తల్లియొద్దకుఁ బరుగెత్తి "అమ్మా నేను నిన్ను ప్రేమించుచున్నాను నాకొకపనినిమ్మని" అడుగును. ముద్దుతీసికొని బొమ్మలయొద్దకు వెళ్లి ఆడుకొనుచు మూఁడవసారి తల్లియొద్దకువచ్చి "అమ్మా నిన్ను ప్రేమించుచున్నాను నేను ఎంతగా నిన్ను ప్రేమించుచున్నానో చెప్పలేను. నాకొకపని నిమ్ము. నిజముగా నాకొక కష్టమయినపని నిమ్మ" అని అడుగును. దేవుని నిజమయిన ప్రతిబిడ్డకు ఇట్టిమనస్సుకలదు. మనము మన ప్రేమగల తండ్రియొద్దకు వచ్చి "నాయనా నిన్ను ప్రేమించుచున్నాను నాకు పని నిమ్మని" చెప్పను. దేవుని నిజబిడ్డ డెప్పుడయినను "నీసేవకొఱకు నన్ను నేను సమర్పించుకొన్నాను. యేసుకొఱకు చేయు నా పనియందు కష్టములు కలవు," అని చెప్పడు గాని హృదయ పూర్వకముగా "పనినిమ్ము నాకొక కష్టమైన పనినిమ్మని" అడుగును.

క్సావియరు దొరగారు ఇండియాకు బయలుదేరుటకు ముందటిరాత్రి తనచిన్న మంచముమీఁద పండుకొని ఇటు నటు కొట్టుకొనుచుండగా "అంప్లియస్" అను లాటిను పదమును తిరిగి తిరిగి పలుకుట తన తోడుపండుకొనిన మనుష్యులు వినిరి. యేసుకొఱకు అనేకసంవత్సరము లీ ఇండియా యొక్క యుష్ణప్రదేశములలోఁ బని చేసి అనేకులను తనరక్షకునికొఱకు జయించి ఆకలి దప్పులను సహించినను, లెక్కలేని శ్రమలను బొంది జ్వరమునబడి, తెలిసి, తెలియని అనేక అపాయములపాలై రోమాపట్టణము మళ్ళీఁ జేరెను. నీవిక్కడనుండి బయలుదేరుటకు ముందటిరాత్రి తిరిగి చెప్పఁబడిన "అంప్లియాస్" అనుమాటకర్థమేమని యడుగగా ఆయన "ఆరాత్రి నా ముందరనున్న సమస్తమును జూచితిని. నాకు ప్రతికష్టము ప్రతి అపాయము స్పష్టముగా బయలుపరచుబడినది. అయినను ఓ నా దేవా అనేక ఆత్మలను చీకటి

లోనుండి వెలుగులోనికి వచ్చునట్లు నాకిప్పుడగా "అంప్లియస్" నిన్నుని సంతో షముతోఁ జెప్పెను.

కష్టములు తెరతెరలు - గావచ్చిన మదాత్మ - నిష్టదప్పకయోర్చి
నిలువంగ వలయుఁగా - నష్టముగు కాలోవ పయనంబు తుదముట్ట-
శ్రేష్ఠమగు నాయిల్లు - చేరునందాక ॥ఎదినా॥
యేసుక్రీస్తు మింపుకే - వెల్గిగ గల్గానువేళ - దాసులతనము చింతా-
దాపి చనె వెతలు - భాసురంబుగ మంచుపడిది తళతళలాడ-
జేయునా కన్నీళ్ళు - చింత లేదఁబాపి ॥ఎదినా॥

ఇట్లు క్రీస్తువుని ప్రేమగల బ్రదుకు ప్రేమగల సేవయై యుండును. ప్రార్థనతోఁ బలుకును ఘని కోఁటకును, దేవావేశమును ఆశక్తిని సంపాదించుకొనుటకును ప్రతిదినము బైబిలు చదువును. తనకును తన ప్రేమగల దేవునికిగల సంబంధమునుపో కుండుటకును అభ్యంతరము గలుగకుండుటకును నిత్యము ప్రార్థించును. వీనినన్ని టిపయిని ఆత్మీయారోగ్యమును విశ్వాస ప్రేమాబలము వృద్ధి నొందించుటకును తాను నిత్య మనుభవింపఁబోవు పరలోక సౌఖ్యము భూలోకమందు బొందుటకు యేసుకొఱ కు పని చేయును. తన నిత్యానిత్య బ్రతుకుయొక్క మూలము సేవయై యున్నది. ఫ్రాన్సు దేశమందు మహా ఆలోచనపరుఁడని పేరు వడసిన పాస్కల్ అనువారు ఒకప్పుడొక సత్యమును శ్రేష్ఠమయిన మాటలతోఁ బలికెను. జనులు దానిని తమ హృదయములోనికిఁ దీసికొనినయెడల మంచిబ్రదుకు బ్రదికి మంచిమరణ మొందుటకు సహాయపడును. ఆయన పలికిన సత్య మేమనఁగా:—

మనుష్యులను ప్రేమించుటకు వారి నెరుగవలయును. దేవుని ఎరుగుట
కు ఆయనను ప్రేమింపవలయును.

ఇది ఎంతటిసత్యము! మన బ్రతుకులో మన ప్రాణము ఎంతో వేదన నొందెను. ఎ న్నో అధైర్యతలు కలుగును. ఎందుకనఁగా మనము మనుష్యుల నెరుగకయే ప్రేమిం చితిమి. ఎంతోమంది యౌవనస్త్రీలు సంతోషకరమయిన బ్రదుకు, పాపిష్టిబ్రదుకా యెను. ఎందుకనఁగా వారెట్టివారని యెరుగక తుంటరివారిని ప్రేమించిరి. ఎంతో మంది సజ్జనులు ప్రార్థించి, ప్రకటించి, ప్రలాపించిన, వేషధారులను ప్రేమించి చెదరి దుఃఖిరి. అయ్యో! మనుష్యులు వారిని ప్రేమించి తమకుగల యానందాస్థిని పోగొ

ట్టుకొనిరి. ఎందుకనఁగా వారిని యెరుగరయిరి. దివాలాతీసిపోయిన అనేకులను గూర్చి వార్తాపత్రికలు ప్రతిదినము దెలుపుచున్నవి. ఎందుకనఁగా వారు యెరుగక ఇతరులను ప్రేమించిరి. నిజముగా తెలివిగల ప్రతి (స్త్రీ) పురుషుఁడు పాస్కల్ అను మహావీయుని మాటలను గైకొని ఎవరినైనను ప్రేమించరు. సర్వకాలములందును సర్వస్థితిగతులందును ఒకరిని పూర్ణముగా నెరుగక తమగుట్టు ఇతరులకు పట్టియ్యరు.

అందుచేత మనము దేవుని ఎరుగుటకు ఆయనను ప్రేమింపవలయును. దేవుని యెరుగుటకు ప్రేమయే మార్గము. బుద్ధిహీనుఁడును, దుష్టుఁడును, దేవుఁడు లేడని చెప్పును. ఎందుకనఁగా అతఁడు జ్ఞానములవలనను, తెలివివలనను, దేవునికనుగొనుటకుఁ బ్రయత్నించి యుండును. అయితే ఆలాగు కనుగొనుట అసాధ్యము. దేవు నెరుగగోరితే ప్రేమించుము. మన మాయనను ప్రేమించుకొలఁది ఆయనవలె నుందుము. మన మాయనను ముఖాముఖిగాఁ జూచుదినమున ఆయనవలె నుందుము. స్నేహితులారా! జీవమందు, మరణమందు, దేవుఁడు లోకము నెంతగానో ప్రేమించెనని జ్ఞాపక ముంచుకొని ఆయనను ప్రేమింతుముగాక.



## III అధ్యాయము.

# GOD:— దేవుఁడు.

మన దేశములో నొక సామెత కలదు యథాదేవ తథాభక్తః అనఁగా దేవుఁడెట్టివాఁడో ఆయనను ఆరాధించువారును అట్టివారు. ఇది ఇతర సామెతలవలె కొంతమట్టుకు సత్యమైయున్నది. అయితే సంపూర్ణ సత్యమేమనఁగా, ఆరాధకుఁడు ఆరాధింపఁబడు స్వామికంటె మంచివాడుగనయినను లేక చెడ్డవాడుగ నయినను ఉన్నాఁడు. ప్రతియూదుఁడును క్రైస్తవుఁడును నేను యెహోవా వంటివాఁడను కాను, ఆయన నిత్యుఁడు, నీతిమంతుఁడు, మహిమాకరుఁడు, ఇశ్రాయేలులోని పరిశుద్ధుఁడు అని విధేయతతో నొప్పుకొనును. యూదుఁడును క్రైస్తవుఁడును గొప్ప వినయముతో "దేవా నన్ను కరుణించుము నీ కృపాతిశయమును బట్టి నా అపరాధములను తుడిచివేయుము" అని ప్రార్థించును. క్రైస్తవుఁడు తన దేవునియొద్దకు సమీపింపలేనని ఎరిగి అపొస్తలుఁడయిన పౌలువలె ముందుకు పరుగెత్తుచు "ఏవేవి నాకు లాభకరములై యుండెనో వాటిని క్రీస్తునిమిత్తము నష్టముగా నెంచుకొంటిని. నిశ్చయముగా నా ప్రభువయిన యేసుక్రీస్తును గూర్చిన అతిశ్రేష్ఠమయిన జ్ఞానము నిమిత్తమయి సమస్తమును నష్టముగా నెంచుకొనుచున్నాను. క్రీస్తును సంపాదించుకొని బోధన ప్రమాణమూలమయిన నా నీతిగాక క్రీస్తునందలి విశ్వాసము వలననయిన నీతి, అనఁగా విశ్వాసమునుబట్టి దేవుఁడనుగ్రహించు నీతిగలవాఁడనయి ఆయనయందు అగపడునిమిత్తమును ఏ విధముచేతనయినను మృతులలోనుండి నాకు పునరుత్థానము కలుగవలెనని ఆయన మరణ విషయములో సమానానుభవము గలవాడనయి ఆయన పునరుత్థాన బలమును ఎరిగికొను నిమిత్తమును, ఆయన శ్రమలలో పాలివాడనగుట ఎట్టిదో ఎరుగునిమిత్తము సమస్తమును నష్టపరచుకొని వాటిని పెంటతో సమానముగాఁ జూచుచున్నాను. ఇదివరకే నేను గెలిచితినని యైనను, ఇదివరకే సంపూర్ణసిద్ధిఁ బొందితినని యైనను నేననుకొనుట లేదుగాని నేను దేని నిమిత్తము క్రీస్తుయేసుచేత పట్టబడితినో దాని పట్టుకొనవలెనని పరుగెత్తుచున్నాను. సహోదరులారా, నేనిదివరకే పట్టుకొనియున్నానని తలంచుకొనను. అయితే ఒకటి చేయుచున్నాను. వెనుకనున్నవి లక్ష్యపెట్టక ముందటనున్న వాటికయి వేగిర

మనము క్రీస్తు యేసునందు దేవుని పరసంబంధమైన పిలుపునకు కలుగు బహుమాన
ము పొందవలెనని గురియొద్దకే పరుగెత్తుచున్నాను." అని పలుకును.

అంతేగాక రాష్ట్రికులు పై తానును దానిసమూహములను దేవుండ్లుగ
జేయునంత క్రిందికి దిగిపోయిరి. మనుష్యులు ఒహాలు నీచముగా తక్కువచేయఁబడిన
ను తాము ఆరాధించు దేవుండ్లకంటె చాలా శ్రేష్ఠులు. పరమందలి దేవునినుండి నర
కమందలి సయితానుయొద్దికిదిగుటకు మూఁడు మెట్లు మాత్రమే కలవు. మొదటి ది
గుడు మెట్టులో తాను భయపడు అదృశ్యుఁడైన శక్తిమంతునికి ప్రతినిధిగా దృ
శ్యమయిన ఆకాశ సూర్య చంద్ర నక్షత్రములను ఆరాధించుచున్నాడు. రెండవ ది
గుడు మెట్టు ఏమనఁగా "అక్షయుఁడగు దేవునిమహిమను క్షయమగు మనుష్యులయొ
క్కయు, పక్షులయొక్కయు, చతుష్పాద జంతువులయొక్కయు, పురుగులయొక్క
యు, ప్రతిమా స్వరూపముగా మార్చిరి." ఇదియే విగ్రహారాధన. అన్నిటికన్న త
క్కువమెట్టు సయితాను నారాధించుట. "వారు దేవుని సత్యమును అబద్ధమునకు
మార్చి సృష్టికర్తకు ప్రతిగా సృష్టమును పూజించిరి. యుగయుగముల పర్యంతము
ఆయన స్తోత్రార్హుఁడై యున్నాడు. ఆమేన్"

కడపటిభాగమందు భయంకరయేర్పాటు మనముందు ఉంచఁబడియున్నది. నీ
దేవుఁడెవరు, యెహోవా లేక సయితానా? కొన్నిసారులు మనము ఎటు నిశ్చ
యింపలేని స్థితిలోనుందుము. జ్ఞానముతో యేర్పాటుచేసికొందము. నేనును నా
యింటివారును యెహోవాను సేవింతుము. దేవునికి స్తోత్రము. ఎందుకనగా మే
మంతరము దేవుని ప్రేమించుచున్నామని ఎరుగుదుము. మేము ఆయనవలె నుండలేదు.
అయితే మేము ఆయనవలె నుండు దినమువచ్చును. మరియు స్నేహితులారా, మీ
రు యెహోవాను సేవించుటకు యింకా నిశ్చయించుకొనకపోతే ఈలోకనాథునికం
టెను సయితానుకంటెను శ్రేష్ఠులని నా దేవుని స్తుతించుచున్నాను. మీరు సయితా
నునే సేవించుటకు నిశ్చయించుకొని సేవించుచుంటే మీరు ఆయనవలె నుండు దినము
వచ్చును. అప్పుడు ఆయనతోకూడ నిత్యనాశనమనే శిక్షావిధి నొందుదురు. రా
బోవు కోపమునుండి పారిపొండి. సయితానునుండి దేవునియొద్దికి పరుగెత్తుడి. ఆ
యనను ఏర్పరచుకొనుడి. ఇప్పుడే ఆయనను నీదేవునిగా నేర్పరచుకొనుము.
అట్లు ఏర్పరచుకొందువా? అది నీయిష్టము. మనలో ప్రతివారు తమ ఇష్టానుసార
ముగా నేర్పరచుకొనవలయును.

"దేవుడు అలాగునవే ప్రేమించెను" అను నీగొప్ప మాటను శ్రీ యేసు మన
తో చెప్పుచున్నాడు. ప్రశ్నలలో శ్రేష్ఠ ప్రశ్నయగు

దేవుడు ఎవరు?

అనుదానికి ప్రత్యుత్తరమిచ్చుటయే మన బ్రతుకంతటియొక్క ముఖ్యోద్దేశమయియు
న్నది. ఈవిషయమును ప్రశంసించుటకు భయపడుచున్నాను. ఎందుకనగా నే
ను దీని నెంతగా ధ్యానింతునో అంతభయముతో నింపబడుచున్నాను. మోషే మం
డుచున్న పొదను సమీపించినప్పుడు తన కాళ్లనుండి చెప్పులు తీసివేయవలసివచ్చెను.
ఎందుకనగా అది పరిశుద్ధస్థలము. అలాగే ఇదియు పరిశుద్ధస్థలము. "నేను ఇశ్రాయే
లీయులయొద్దకు వెళ్లి వారిని చూచి-మీపితరుల దేవుడు మీయొద్దకు నన్నుబంపెన
ని వారితో చెప్పగా వారు-ఆయన పేరేమి అని అడిగినయెడల వారితో నే నేమిచెప్ప
వలయునని దేవుని నడిగెను. అందుకు దేవుడు-నేను ఉన్నవాడ ననువాడనయి
యున్నానని మోషేతో చెప్పెను.

మనుష్యుడనగా ఎవడు? అని ఒకని నడిగితే వాని ఉద్యోగము వాని గు
ణములనుగూర్చి కొంత చెప్పును. ఆయన ఎవరు? ఆయన గవర్నరు అందురు. అప్పు
డు తాను ఏలుచున్న భాగమందు సర్వాధికారము గలవాడనియు జనులు నమ్మకముం
చగలవాడనియు తెలియును. అటువలె దేవుడెవరని అడిగితే ఆయన పరాత్పరు
డు, రారాజు, ప్రభువులకు ప్రభువునయి యున్నాడని చెప్పుదుము. "ఆసింహాసన
మందు కూర్చుండియుండి యుగయుగములు జీవించుచున్నవానికి మహిమయు ఘనత
యు కృతజ్ఞతాస్తుతులును కలుగు గాకని ఆ జీవులు కీర్తించుచుండగా ఆ ఇరువది న
లుగురు పెద్దలు సింహాసనమునందు కూర్చుండువాని యెదుట సాగిలపడి యుగయుగము
లు జీవించుచున్నవానికి నమస్కరించుచు-యెహోవా మా దేవా నీవు సమస్తమును
సృష్టించితివి; నీ చిత్తమునుబట్టి అవియుండెను. దానినిబట్టియే సృష్టింపబడెను.
గనుక నీవే మహిమ ఘనత ప్రభావములు పొందనర్హుడవని చెప్పుచు తమ కిరీటము
లను ఆ సింహాసనము నెదుట వేసిరి.

దైవత్వమును, అద్వయితమును, విశిష్టాద్వయితమును, ద్వయితమును, త్రి
మూర్తిత్వమును, ఏకదయివమును, అనేకదయివములను, సర్వాంతర్యామిత్వమును
గూర్చియు ఆయన సుగుణములను గూర్చియు వ్యాసములు వ్రాయుటకు వేదవేత్తల

కు, తత్వజ్ఞులకు విడుచుచున్నాను. అయితే నేనీగొప్ప మూలవాక్యమందు ముఖ్యముగా "దేవుఁడు లోకమును అలాగున నే ప్రేమించెను" అను మాటలు నాకు నేర్పించు దానిని జనులకు నేర్పఁ బ్రయత్నింతును.

దేవుఁడు లోకమును ప్రేమించెనను మహిమకరమయిన గంభీర సత్యమును ఇంతకుముందే ఆలోచించి యున్నాముగనుక దానిని తిరుగ నిక్కడవివరింపక బైబిలులోని మఱియొక సంగతిని ప్రశంసింపఁ గోరుచున్నాను. అదేమనిన

దేవుఁడు వెలుఁగై యున్నాఁడు.

తెలియఁబడినవాటి నన్నిటిలో నిది గొప్పది. దేవుఁడు వెలుఁగై యున్నాఁడను మాటల భావమేమి? వెలుఁగను పదమునకు నిర్వచనము చెప్పుట అసాధ్యము. మనము ప్రతిదినముఁ జెప్పు ప్రతివాక్యములోని చిన్నమాటలను వివరించలేము. పులుసు, తీపు, పగరు, అనఁగా నేమో ఎవరుచెప్పగలరు? వెలుఁగు జీవము ప్రేమ అను మాటలందున్న భావము వివరించుటకు జ్ఞానమెవరికిఁ గలదు? నిర్వచనము తెల్లపఱుడుకుచుండు వారికి ఈక్రింది సంగతిలోఁ బిల్లవాఁడిచ్చిన ప్రత్యుత్తరమే, మన మియ్యగలము. ఒకప్పు డొకపిల్లవాఁడు పిడతనిండా తేనెబోసికొని చేతఁబట్టుకొని పోవుచుండెను. ఎవఁడో ఒక అధికప్రసంగి "పిల్లవాఁడా, నీచేతిలోదేమి"టని అడిగెను. అందుకువాఁడు "తేనె" అనెను. "తేనెయనఁగా నేమి"టని తిరిగియడిగెను. "అది తీపివస్తు"వని బదులుచెప్పెను. "అది తీపివస్తువని నీకెట్లుతెలియునని" మాడవమారడిగెను. అప్పుడాబాలుఁడు తేనెపిడత నతనియొద్దకుఁ దీసికొనిపోయి "రుచిచూడ"మనెను. అటువలె దేవుని చూపించుమని యడిగేవారికి నాప్రత్యుత్తరమేమనఁగా, మనుష్యుఁడా కన్నులు తెరచి చూడుము.

సీ॥ తావక కార్యవితతులఁ గాంచుచుండంగ
నేవిధి నాకాశ మెసఁగకుహిమ !
బలపరాక్రమ దేవ భక్తితో భజియింతు
నింగి నర్కునినెవఁడు నిలిపినాఁడు ?
వానికి తేజఃపు వలువ గప్పెనెవండు ?
తార లెవ్వని యాజ్ఞఁ దలచినను ?
నిండుమార్తాండుండు నిష్క్రమించు చుపాను
సాగరంపుటెపుము పాటునిమ్ను

గిన బాలుర దీనియందు రెండుపాళ్లు ఉప్పవాయువు ఒకపాలు ప్రాణవాయువు గలసి నీళ్ళాయెననిరి. అందుకు నేను సరేనని ఆమూఁడు లేక సమస్త సృష్టి నిర్జీవమైనదని చెప్పితిని. రెండుపాళ్ళు ఉప్పవాయువు నొకపాలు ప్రాణవాయువు గలసి జీవదాయకమై దప్పికదీర్చు ప్రవాహములగుచున్నవి. అయితే ఏ రెంటివలన మంట కలుగుచున్నదని అడిగితిని. అందొక తెలివిగల పిల్లవాఁడు ఉప్పవాయువును ప్రాణవాయువును గలయుటవలనని చెప్పెను. అందుకు నేను ఈ రెండును సమ భాగములుగఁ జేర్చుటవలన భయంకర వేఁడిమిని సమస్తమును దహింపఁజేయు మంటయు గలుగుచున్నదని ఇంతకుఁ బూర్వమెన్నఁడయిన దలచి చూచితిరా? పిల్లలారా ఇది దేవుని బయలు పరచుచున్నది. మనము దేవుని గూర్చియు ఆయన ఆత్మను గూర్చియు మాటలాడితే ఆ గొప్ప మూర్తి మహాత్మ్యమందలి రెండు భాగములను గూర్చియే మాటాడుచున్నాము. అప్పుడు మన దేవుఁడు వెలుఁగు మాత్రమే కాక ప్రాణ ఉప్ప వాయువులతోఁ జేయఁబడిన మంటను మించిన దహించే అగ్నియై ఆయన కోపమందునని గ్రహించుచున్నాము. భయంకరమయిన గంభీర దినమున భూమ్యాకాశములు గొప్పశబ్దముతోఁ బారిపోయి, సకల వస్తువులు తీక్షణమైన అగ్ని చేత కరగి, భూమి అందులోని సర్వమును కాలిపోవును. ఆకాశము అందులోని సమస్తమును తీక్షణమైన వేఁడిమివలన కరిగిపోయెను. అప్పుడు ఆ దహించే అగ్ని యెదుట నీవును నేనును ఏలాగు నిలువగలము? మనము శ్రీయేసునందు నమ్మియున్న మాటున ఆయన యొద్దకు వచ్చినయెడల మనవెలుఁగైన దేవుడు దహించే అగ్నియై యుండఁడు.

అయితే త్రిత్వములోని మూడవవాడయిన శ్రీయేసుక్రీస్తు,

దేవుఁడు మనకు విశ్రాంతినిచ్చు జీవ జలముగా జేయును. ఇప్పుడు మీ దేవుఁడెవరు? మీరు ఎవరిని సేవింతురో ఏర్పరచుకొనుడి అని చెప్పగా బాలుర శ్రీయేసుక్రీస్తు నా దేవుఁడు నా దేవుఁడ"నిరి. వారిలో కొందరు దేవునికి తమ్ముతామే సమర్పించుకొనిరని నేనెరుగుదును. నేను చిన్నతనమునుండి వెండ్రుకలు నరసినను ఇంకా శ్రీయేసుక్రీస్తు నా దేవుఁడు, నా దేవుఁడు అను దీనినే నా హృదయ పూర్వకముగఁ బలుకుచున్నాను. స్నేహితులారా మీ దేవుఁడెవరు? బైబిలు నందలి పొరపాటులనుఁ గనుగొని తెలియపరచు వారి తప్పులే బైబిల్ యెదుట బయటకు వచ్చుచున్నవి గనుక వారి తప్పితములను వారు చూచుచున్నారు. పట్టణములోనున్న ఇండ్లన్ని

టిమీద ఎన్ని పెంకులున్నవో అన్ని పిశాచములు మనమీదికివచ్చినను మనము దేవుని యందు నిజవిశ్వాసము ఉంచినయెడల కదలని వారమై స్థిరముగా నిలుతుము అప్పుడు మనము అపోస్తులుడయిన పౌలువలె యిట్లుపలుకుదుము. "మనము జీవించినను ప్రభువు నిమిత్తమే జీవింతుము, చనిపోయినను ప్రభువు నిమిత్తమే చనిపోవుదుము. కాబట్టి మనము చనిపోయినను జీవించినను ప్రభువు వారమై యున్నాము. యేసుక్రీస్తు నా దేవుఁడు ఆయన నీ దేవుఁడా?

## నా బాల్య దినములనుండి దేవుని నిట్లు ప్రార్థించుట

వినియున్నాను. "దేవా ఆకాశములే పవిత్రములు కాకుండగా నా అపవిత్రతో నిన్నెట్లు సమీపింపగలను? గొఱ్ఱపిల్లయొక్క రక్తములో నన్నుఁ గడుగుము." ఈ ప్రార్థన యోబు 15: 15-16-వరలలో ఎలీఫాజు పలికిన మాటలలోఁ గలదు. "ఆలోచింపుము ఆయన తన దూతలందు నమ్మికయుంచడు ఆకాశవైశాల్యము ఆయన దృష్టికి పవిత్రము కాదు. అట్లుండఁగా హేయుఁడును చెడినవాఁడును నీళ్ళు త్రాగునట్లు దుష్క్రియలు చేయువాఁడును మఱియు అపవిత్రుఁడు గదా!" ఎలీఫాజువంటి పొరబాటులుగల మనుష్యుఁడు పలికిన ఇట్టిమాటలమీఁద నొక సిద్ధాంతముఁ గనుగొనలేదుగాని పాత క్రొత్త నిబంధనలను భూమ్యాకాశములు పారిపోవుటయు క్రొత్త ఆకాశము, క్రొత్త భూమిని చేయుటయు చదువుచున్నాము. క్రొత్త ఆకాశము ఎందుకు సృష్టించినాఁడని నాలో నేను ప్రశ్నించుకొంటే సైతానును దాని దూతలును ఆకాశమునుండి పడిపోయినందుననని అనుకొంటిని. కాబట్టి ఆకాశములు దేవుని దృష్టికి పవిత్రములు కావు. ఇందునకొక దృష్టాంతము. నేను బర్లిన్ పట్టణమందున్నప్పుడు కైసరు నగరిపు సుందరమైన ప్రవేశద్వారము వెంబడిగా అనేక సారులు వెళ్ళియుంటిని. రాజు ఆ నగరములో ప్రవేశించుటయు రాణియు ఆమె పరిజనమును బయటికి వచ్చుటయు జూచితిగాని ఆపెద్ద ద్వారములు తెరువఁబడియుండుట నెన్నడు చూడలేదు. అయితే వారు వేరే చిన్నద్వారమున వచ్చుచుండిరి. ఈపెద్ద ద్వారము ఎల్లప్పుడు ఏలదుకు మూయఁబడి యుండును. కైసరు ఆద్వారముగుండా ఎన్నడయినను పోఁడే! ఎందుకు? రాచవంశస్థులు పోదగిన మార్గము దేగదా అని శంకించి దీని వాస్తవముఁ దెలిసి కొనవలయునని ఒక స్నేహితు నడుగగా ఆయన గతశతాబ్దారంభమందున శత్రువుఁడీ పట్టణములో జయముతోఁ ప్రవేశిం

చివది యీద్వారము గుండనేనని నీకు జ్ఞాపకములేదా, అందువలన ఆద్వారము లపవి
త్రమైనవని రాజు గారెంచి వాటిగుండా పోవడమైనను రావడమయినను లేదని చెప్పె
ను. అటువలె శత్రుడు పరలోకములో ప్రవేశించి దేవునిమీఁద తిరుగుబాటు చేసినం
దున ఆకాశము లాయన దృష్టికి కపవిత్రములాయెను. ఆయన ఎవరును ప్రవేశింప
గూడని వెలుగులో నున్నాడు. అయితే ఆగొప్పశత్రుడును, ఇతర శత్రులును కడ
వరిసారి త్రోయబడే ఘనమయిన దినమువచ్చును. అప్పుడు పాపము ఇకనెన్నడె
యినను ప్రవేశింపరాదని క్రొత్త ఆకాశముండును. దాని నూతన గవునులు దేవుడు
ప్రవేశింపఁదగినవై యుండును. "గుమ్మములారా మీతలలు పైకెత్తుకొనుడి. మ
హిమగల రాజు ప్రవేశించునట్లు పురాతనమయిన తలుపులారా మిమ్మును లేవనెత్తు
కొనుడి. మహిమగల ఈరాజు ఎవడు? బలశౌర్యములుగల యెహోవా యుద్ధశూ
రుడయిన యెహోవా గుమ్మములారా మీతలలు పైకెత్తుకొనుడి. మహిమగల రా
జు ప్రవేశించునట్లు పురాతనమయిన తలుపులారా మిమ్మును మీరులేవనెత్తుకొనుడి.
మహిమగల ఈరాజు ఎవడు? సైన్యముల కధిపతియగు యెహోవాయే. ఆయనే
ఈ మహిమగలరాజు

## మనము తిరిగి మనమూలవాక్యమును జూతము.

దేవుఁడు లోకము నాలాగున నే ప్రేమించెను కాగా ఆయన తనజనితైక కుమారుఁడు
గాఁ బుట్టిన వానియందు విశ్వాసముంచు ప్రతివాఁడును నశింపక నిత్యజీవము పొందు
టకై ఆయన ననుగ్రహించెను" ఇది ఎట్టి కృపాద్భుతము! తిరిగి కలువరి యొద్దకు
రమ్ము. అక్కడ ఈ గొప్ప ప్రకటనయొక్క నిర్ధారణను జూడగలము. ఇక్కడ
ఆకవడి నోరుతెరచుకొని యుండు జనసమూహము కలదు. గొప్ప దేవుడు! ఉప
కారము పొందువారు ఉపకారము చేయువానియెడల ఈలాగు నడచుకొనుట న్యా
య్యమా? వారాయనను తిట్టిరి, నవ్విరి, ఎగతాళి జేసిరి. ఆయన వారికేమి చేసెను?
ఆయన ఒక ఉపాధ్యాయుఁడు నేర్పించునట్లు నేర్పించెను, రోగిష్ఠులను బాగుపరచెను
ఆకలిగలవారి కన్నము పెట్టెను, అందరికి అన్నివిధములయిన సహాయములు జేసెను.
అయితే ఇప్పుడాయన త్రోసివేయఁబడి మనుష్యులవలన విసర్జింపఁబడి వ్యసనాక్రాంతుఁ
డుగను, రోగము నెఱిగినవాఁడుగను, మనుష్యులు చూడనొల్లనివాఁడుగ నుండెను.
అతఁడు త్రోసివేయఁబడిన వాఁడుగనుక మనమతని ఎన్నిక చేయకపోతిమి. కలువ
రిలోని సిలువమీఁద "దేవుఁడు ఆలాగున నే ప్రేమించె"నను ఘనమయిన మాట దృష్టాం

తపరచఁబడినగని చూచుచున్నాము. ఆయన మనను ప్రేమింపకుంటే; శ్రీయేసుదేవుని వలన మొత్తబడి బాధింపఁబడి శ్రమను నొందినవానిగా మన మెంచినను మన రోగములను భరించి మన వ్యసనములను భరంపకుంటే; మన అతిక్రమ క్రియలను బట్టి గాయపరచబడి మన దోషములనుబట్టి నలగగొట్టఁబడకుంటే; మన సమాధానార్థమైన శిక్షయతనిమీఁదఁ బడకుంటే; ఆయన పొందిన దెబ్బలచేత మనకు స్వస్థత కలుగకుంటే ఈ వచనము సత్యమై యుండలేదు, ఉండజాలదు. ఇది సత్యమని యెరుగుదుము గనుక దేవునికి స్తోత్రము.

## దేవుఁడెంతో ప్రేమించెను. సైతానునెంతో ద్వేషించెను.

అను సత్యమును ఆకాశమందుండువారికిని, భూమియందుండువారికిని, నరకములో నుండువారికిని సిలువ ప్రకటించుచున్నది. ఇప్పుడు నీవు దేనినికోరుకొనుచున్నావు? దేవుని ప్రేమనా, సైతాను ద్వేషమునా? సిలువయొద్దకువచ్చి దేవునిని ఏర్పరచుకొనుము. నీజీవముగాను నీప్రేమగాను నీసమస్తముగాను యేసుని యేర్పరచుకొనుము. నేను నా బైబిలును దెరచునప్పుడెల్ల ఆదికాండము 1: 1-వ లో 'ఆదియందు దేవుఁడు' అని దేవునిని మొదట చూచుచున్నాము. ఆయన సర్వసృష్టి కాద్యంతమై యున్నాఁడు. మనకు మేలు కలిగితే మన ప్రతిదిన బ్రతుకునందు దేవుఁడే ఆద్యంతమై యున్నాఁడు. మనము మన బ్రతుకును దేవునితో ఆరంభించి ముగించితే అది ఒక సంతోషకరపాత్రమై యుండును. ఆయన పరలోకములోని భజనకూటపు ఆద్యాంతములకు మూలమై యున్నాఁడు. దేవునికి మన జీవితములను శ్రుతి గూర్చితే మన పనియందు పరలోక నాదము వినఁబడును.

## ఇటీవల "అయితే దేవుఁడు".

అనే రెండుమాటలమీఁద నొక ప్రసంగము వింటిని. అది నావీనులకు విన సొంపుగను హృదయానందకరముగ నుండెను. 'అయితే దేవుఁడు' అను గొప్ప తలంపుతో బైబిలు నిండియున్నది. దీని నాలోచింపుము. మనము బలహీనులము నిరాశపడ సిద్ధులము. గతిలేనివారమునయి యున్నాము. అయితే దేవుఁడు మనలోఁ బ్రవేశించ నందున మన బలహీనతనుండి దేవుని సర్వశక్తియు, మన నిరాశనుండి గొప్ప జయమును మన గతిలేని స్థితినుండి అపరిమితమయిన పోషణయు వచ్చుచున్నది. ఇర్మియావలె 'అయ్యో! ప్రభువైన యెహోవా! ఇదిగో! నేను పలుకలేను. నేను బాలుఁడను' అని అంగలార్చుము. అయితే దేవుఁడు మనను మంటిలోనుండి ఎత్తినం

దున :అప్పుడు యెహోవా నన్ను చూచి నేను బాలుఁడనని పలుకవద్దు. ఏలననఁగా నేను నిన్ను యెవనియొద్దకుఁ బంపెదనో నీవతనియొద్దకు వెళ్ళవలయును. నేను నీ కాజ్ఞాపించినదేదో దాని నీవు బలుకవలయును. వారి ముఖములకు భయపడకుము. ఏలననఁగా నిన్ను విడిపించుటకు నేను నీకు తోడయి యున్నానని యెహోవా చెప్పుచున్నాఁడు' అని అందరితో కేకవేసి చెప్పగలము. మరణబాధలు మనకు సంభవించినప్పుడును, ఎంతో నిరాశ నొంది పౌలువలె సంఘమువలన కలిగిన దుఃఖముచేత శరీరాత్మలందు వేదన నొంది కుంగదీయబడినప్పుడును 'సహోదరులారా ఆసియాలో మాకుఁ సంభవించిన శ్రమనుగూర్చి మీకు తెలియక పోవుట మాకిష్టములేదు. అది ఏదనఁగా మేము బ్రతుకుదుమను నమ్మకము లేక యుండునట్లుగా, మాశక్తికి మించిన అత్యధికభారమువలన కృంగిపోతిమి మఱియు మృతులను లేపు దేవునియందేకాని మాయందే మేము నమ్మిక యుంచకుండునట్లు మరణమగుదుమని నిశ్చయము మామట్టుకు మాకు కలిగియుండెను'. అప్పుడు విజయులమయి మన హృదయము దేవునితో నింపబడి ఆయన యిచ్చు ధైర్యములో 'చనిపోయినవారిని లేపే దేవునియందే గాని మాయందు నమ్మిక యుంచకుండే నిమిత్తము మరణమగుదుమని నిశ్చయముగా మామట్టుకు మాకు కలిగియుండెను. ఆయన అట్టి గొప్ప మరణమునుండి తప్పించెను. ఇక ముందును మమ్మును తప్పించునని ఆయనయందు నిరీక్షణ గలవారమయి యున్నాము. 'బైబిలు సందలి' అయితే దేవుఁడు' అను మాటలను చదువుము.

ఒకనాఁడు నేను యొక అనాధశాలకు వెళ్ళి

ప్రసంగించుచుంటిని. నాముందుండు వరుసలో పదిహేనుమంది దిక్కులేని బీదపిల్లలు కూర్చుండి యుండిరి. అప్పుడు నేను సీమసున్నము చేతి దీసికొని మీరు ఒక సున్నగాక మరేమి కారని చెప్పినట్లు పలకమీఁద పదిహేను సున్నలు పెట్టి ఆబిడ్డలనుమీరెంతఁయని యడిగితిని. వారు మేమేమి లేదని చెప్పిరి. ఏమీ, నేను పదిహేను సున్నలు బెట్టియున్నానే అంటిని. నూరు సున్నలు పెట్టినను ఏమి లేదనిరి. ఆ సున్నల వెనుక ఒకటిపెట్టి ఇప్పుడెన్ని అని అడిగితిని. ఒకటే ననిరి. తరువాత నే నా సున్నల ముందొకటియుంచి ఇప్పుడెంత యంటిని. అది యెంతో నాకు చెప్పగలవారా గదిలో ఎవరును లేరు. ఎంతగొప్ప మొత్తము! స్నేహితులారా! దేవుఁడును, ఒకటిని కలిసితే యెక్కువసంఖ్యయయి యున్నది. మనమెక్కడుండినా సరే దేవుఁడు మాను, ఒకటిని గొప్పసంఖ్యగా చేఁ. వస్తువులను తూచువారు పలుమారు దేవుని విడుతురు. లేదా, అన్ని సున్నల అంతమున ఆయన నుంచుదురు, మన ఇండియాలో యిప్పది

కోట్ల క్రైస్తవులున్నారు. మన మందరము అన్ని సున్నలముగాని మనముందు దేవునినుంచి చూచితే ఎంత లెక్కలేని గొప్ప సమూహము! దేవుడును, ఒకటిని అగణ్యమయిన సంఖ్యయై యున్నది.

## వాక్లరు దొరగారు ఇచ్చిన బైబిలు పాఠమంము

రాజయిన దావీదును, అపొస్తలుడయిన పౌలును తమ పాత్రలయందు దేవుని నియమించిరి. ఆయన వీరిద్దరికిని సర్వములో సర్వమయి యుండెను. గనుక కీర్తనలు, ఉత్తరములు, నా దేవుడు, నా దేవుడు, నా దేవుడను మాటలతో నిండియున్నవి. ఇరువదిమూడవ కీర్తనలో 'యెహోవా నా కాపరి నాకు లేమికలుగదు' తక్కిన వచనములందును (నా) అనుమాట విస్తారముగా కలదు. దేవుని నీవు నిర్ణయించుకొనియున్నావా? ఆయన నావాడు, నావాడు, నావాడు, అనేవే నీ హృదయకేకలై యున్నవా? 'నా దేవుడు మీ ప్రతిఅక్కరయు సంపూర్తి చేయును. నా దేవుడు ఆయనలేక నేనుండలేను.

పరిపూర్ణుడయిన దేవునిగూర్చి అసంపూర్ణమయిన రీతిలో కనపరచబడిన ఈ అధ్యాయము ముగింపునందు రష్యా దేశీయుల దేశాభిమాన కీర్తనను మీరు చూడగోరుచున్నాను. అయ్యో పాపము! రష్యా సమాధానముకొరకు ప్రార్థించుచున్నది. ఆదేశాభిమానకీర్తన వారికిని మనకును దేవుడుమాత్రమే సమాధాన మియ్యగలడని చెప్పుచున్నది. ఆలాగు మనమును ప్రార్థింతుముగాక. ఈకీర్తనబట్టి రష్యాదేశమును బహుగా తలచువాడను. రాష్ట్రీయులు తమ రాజ్యసంబంధమయిన కీర్తనను బట్టి అవి యెట్టివయినవి తెలియబడును. మనస్సును కరిగించే ఈమాటలను వినుడి,

('మహిమ' మహిమ' యను వర్ణమెట్టు).

రాగము—ఆనందభైరవి　　　　　　　　　　తాళము—ఆది.

మాకొసంగుము క్షేమరాజ్యము - నోదేవయా - లోకమందుబ్రతుకుకాలము =
భీకరుండవ సార్వభౌమ - నీకు వాయువే మ్రొక్కంగ -
మాకిన మెరుపులు మెరియును - నీకటాక్షమిచ్చి దయతో॥

1. మములనుంబు నిపుడు సేయకు - మోసర్వశక్తి - శ్రమసమయములందుఁ బా
యకు=క్షమము వీడి శూరవైరి - సమితిఁ గనెదవార గాగి-
యామిత మానవృత్తి - దీర్పు లగురఁగసినిఁ దీర్చుబలుఁడ॥

2. పరమదయానిధీ లోకము - నీయనుగ్రహపు - తెరు వెఱుంగదాయె చిత్రము=
హరిచిర భవదు కులనున - పరము లఘువుగఁ దలంప
కరము కోపగించి భయం - కరముగ శిక్షింప వలదు॥

3. భూరివార్థుల్ మోగ్రగ నీసుతుల్ - కృతజ్ఞులై వి-స్తారభక్తిఁ జేతురు నుతుల్=
ధారుణి సుఖము దేశప్రజ - కారయ ప్రభుకు సంస్తుతులు -
ఘోరబారిఁ బాపితి జో - హారుల నర్పింతు మహాహా॥

మహా భయంకరమయిన దేవుని ఎరుగనేర్చుకొని ఆయనయొద్దుట వణకుదుము గాక. ఆయన సర్వశక్తిగల దేవుడని పిలచునప్పుడు మన బలహీనతను చూతుము దేవుని గూర్చిన ఈ యెరుక మనకు నెమ్మది నియ్యదు గాని చివరకు కలువరిలోని సిలువయొద్ద కృపాతిశయముగల దేవుడని ఎరుగనేర్చుకొని, ఒక సముద్రము మొదలు మరియొక సముద్రము వరకు నుండు సర్వరాష్ట్రములకు సమాధానమును దేవునికి స్తోత్రమును కలుగుగాకని పాడుదము. దేవుని నెరుగుట మన బ్రతుకంతటి ప్రయత్నమై యుండును గాక.



## IV అధ్యాయము.

# THE WORLD:— లోకము.

ఒక సైన్యములో మేజరు నాయకుఁడు హెబిక్ దొరగారివలన బాగుపడినవృత్తాంతము యిట్లు చెప్పెను. నేను నా సైన్యముతో యెండకాలమందు మద్రాసురాజధానిలో నొకచోట నుండినప్పుడు నిశ్శబ్దముగా నుండునట్లు బలవంతపెట్టబడి మనస్సు విసికి స్వేచ్ఛలేని కోపముతో నుండగా హెబిక్ వచ్చుచున్నాడని వింటిని. ఆయన పటాలమునకు పలుమారు వచ్చుచున్నందున తొలినాటి సాయంకాలమందు కొందరాయనను గురించి ప్రశంసించుట వినియుంటిని. క్రొత్తవారిని ఇతరులు ఆయనను దర్శనము చేయింప నక్కరలేదు. ఆయనకు పటాలములో నెవనియొద్దకయినను పోవుట స్వేచ్ఛ కలదు, ఎవరిచేతను అడ్డగింపబడక సేనలో తిరుగుచుండెడివారెవరని యొకడడుగగా పరిహాసముగా యుత్తర మిచ్చినందున నా స్నేహితులు నవ్వి ఆయన రాగానే నినుపట్టి చూచునని చెప్పిరి. నీ వెంత స్థిరమయిన పాపివో ఆయన త్వరలో వినును. ఆయన జర్మనీ దేశపు పాదిరి నల్లవారికి బోధించుటకీ దేశమునకు వచ్చినను మనబోటి తెల్లవారికికూడా సువార్త తెలుపుట అగత్యమని వారుండుచోట్ల కరిగి ప్రకటించుచున్నాడు. అనేకు లాయనద్వారా ప్రభువునందు విశ్వసించుచున్నారు అని నేను విన్నప్పుడు కోపపడి ఆయన చేసినది అధికప్రసంగమని తిట్టితిని. ఇదిగాక ఆయన తోటలలో తిరుగ అనుగుపెట్టిన తక్షణమే కొట్టి తరిమెదననియు చెప్పితిని. పిమ్మట ఎండకాలమం దొకరోజున కిటికీలు తెరుచుకొని యెవరు నాయొద్దకు రారని చుట్ట త్రాగుచు మంచముమీద పండుకొని యుంటిని. అప్పుడు హటాత్తుగా నాకొకని అడుగుల చప్పుడు వినబడెను. వెంటనే నేనదిరిపడి లేచి చూడగా నొక బక్కపలుచని మనిషి పదులు చొక్కాయ తొడుగుకొని సంకలో గొడుగును చేతిలో టోపియు గలవాడయి నాకు పరిహాసముగా కనబడెనుగాని ఆయనముఖ వర్చస్సు అట్టగపడలేదు. ఆయన గదిలోపలికి రాగానే నేను నా చుట్టను అవల పారవేసి నిలుచుకొంటిని. అప్పుడు ఆయననన్ను మిక్కిలి గౌరవించగా ఆయనను నిర్లక్ష్యపెట్టవలెనన్న నా తలంపెట్ల పోయెనో తెలియాముగాని, ఆయన సన్నిధి శిష్యుడు ప్రధానోపాధ్యాయునివద్ద నెంతవినయవిధేయతగా నుండునో అట్లునిలువబడితిని. మేమిరువురము చేరి

యొకకుర్చీమీద కూర్చున్నపిమ్మట తనయూరకుండి నన్నొక పుస్తకము తెమ్మనెను. నేను నాపుస్తకముల భాండాగారమునకు పోయి ఏపుస్తకము నతని కిష్టముండదని మూల పడియున్న బైబిలును తెచ్చితిని. అంతట వారు నన్ను పుస్తకము తెరచి ఆదికాండము 1 అధ్యాయము మొదటి రెండు మూడు వచనములు (ఆదియందు దేవుడు భూమ్యాకాశములను సృజించెను. అప్పుడు భూమి నిరాకారముగాను శూన్యముగాను నుండెను. దేవుని ఆత్మ నీళ్ళపై అల్లాడుచుండెను. చీకటి అగాధజలముపైని ఉండెను. దేవుడు వెలుగు కలుగుగాకయని పలికినప్పుడు వెలుగు కలిగెను. అని బిగ్గరగా చదివినాడను. అంతట పుస్తకము మూయుమని పొకరించుకొని ఆయన ప్రార్థించెను. అప్పుడు నామనస్సులో యేదోయొక తలంపు కలిగియున్నందున ఆయన ప్రార్థనలోని సంగతులు గ్రహింపలేకపోతిని. హెబిక్ దొరగారు సలాముచేసి వెళ్ళిపోయినతరువాత నేనేమితలంచవలెనో ఏమిచేయవలెనో యెవరియొద్దకు వెళ్లవలెనో అను తలంపులు కలిగి నామనస్సు కలవరపడజొచ్చెను. ఆరాత్రి భోజనము చేయుటకుకూడ నాకు తోచక, నాపిరికితన మితరులకు తెలియకపోయినను ఎవరిని చూచుటకు యిష్టములేనివాడనయి నాపనిమీద వెళ్ళిపోతిని. మరునాడు నేనట్టిస్థితిలో నుండగా హెబిక్‌దొరగారు వచ్చి తొలిదినమువలె పై మూడువచనములు నాచేత చదివించి ప్రార్థించెను. ఆప్రార్థనలో ఆయన చెప్పినది గ్రహించితిని. ఆహా! ఇది యెట్టి ప్రార్థన. నేనెప్పుడిట్టిది విని యుండలేదు. ఒకడు తన స్నేహితునితో మాట్లాడునట్లుండెను. నాయంతట నేనే శ్రీక్రీస్తుయొద్దకు పోవునట్లు ప్రార్థించెను. యథాప్రకారము ఆయన వెళ్లిపోయినతర్వాత నాబల్లమీద బైబిలు తెరువబడి యుండగా తిరిగి ఆమూడు వచనములు చదివినప్పుడు దానియర్థ మితరులచేత చెప్పబడనట్లు నామనస్సులో నాటుకొనెను. భూమివలె నిరాకారముగాను శూన్యముగాను ఉన్నాననియు పాపము నన్నీలాగు చేసెననియు అవిశ్వాసమనే అంధకారము నానిజస్థితి నాకగపడకుండ జేసెననియు గ్రహించి దేవుని ఆత్మజలముపయి అల్లాడుచుండెను. అనగా దేవుని ఆత్మవలె జీవముగల దేవునితో సంబంధపరచుటకు తన ప్రార్థనద్వారా నన్ను తెచ్చినది ఈఆశ్చర్యమయిన పాదిరిశక్తియై యుండెనాయని యోచించుకొంటిని. ఒకడు తన్నుతాను తగ్గించుకొని యేమియు చేయనివానివలె తన అక్కరను గుర్తెరిగి పాపము పాపముయనుచున్నానని గ్రహించినయెడల యేవిధముగా యుండునో అట్టిది నాకు సంభవించెను. అంతట గర్వము దురభిమానము లోకాభిలాష అనే పాలసులు నాకన్నులనుండి రా

లెను. ఇట్లు నన్ను నేను తెలుసుకొని ఆదిన మట్లు గడిపి మరునాడు హెబిక్ దొరగారు వచ్చునప్పటికి బైబిలు తెరచుకొని సిద్ధముగా నుంటిని. ఆయన లోపలికి రాగానే లేచి మర్యాదచేసి చేయిపట్టుకొని అయ్యా నేనంతయు చేసినాను. రక్షింపబడుటకు నేనిప్పు డేమిచేయవలెనని అడిగితిని. ఆయన నావయిపు ఆత్మసంబంధ ప్రేమతో చూచి తన విశ్వాసము నన్ను తన హృదయములోనికి గొనిపోయెనని ఎరిగి కుమారు డావెలుగగుగాక యని దేవుడుచెప్పిన ప్రభువైన శ్రీయేసుక్రీస్తునందు విశ్వాసముంచుము. అప్పుడు నీవు రక్షింపబడుదువని చెప్పి నామరణమును గొనిపోయిన శ్రీయేసు సిలువవయిపు చూపించెను. మేమిద్దరము మోకాళ్ళూని పుస్తకము చూడకుండా మొదట ప్రార్థించితిమి. దేవుడు లోకమును ఆలాగుననే ప్రేమించెననే ఈమూలవాక్యార్థము నేను చెప్పేదానికన్న ఈమేజరు చరిత్ర బాగుగ వివరింపగలదు. కావున దీనిని మనము లోతుగా ఆలోచించుచు

## లోకమనగా నేమిటి?

అని మనము ధ్యానించునప్పుడు చెప్పజాలని కృతజ్ఞతతో మన హృదయము నింపబడుట నిశ్చయము. ఈప్రశ్నకు ప్రత్యుత్తరము బైబిలుయొక్క ఆరంభమందు కలదు. అక్కడ దేవుని గొప్ప సృష్టిని గూర్చియు అది చెడిపోవుటను గూర్చియు ధ్యానించునపుడు లోకము చీకటితో నిండియుండెననియు చీకటి అగాధజలములపై నుండెననియు లోకము చీకటిమై నిర్మాలమయిన స్థితిలో నుండెనని తెలియబడుచున్నది. అయితే ఈచీకటి నిత్య చీకటి కాదు. ఇది వెలుగుకు ముందుండు చీకటి. ఎందుకనగా దేవునిఆత్మ నీళ్ళపై కదలుచుండెను. లేక పొదిగి యుండెను. దేవునాత్మ యెక్కడున్నదో అక్కడ వెలుగు జీవము లుండవలయును. ఎందుకనగా ఆత్మ అక్కడుండుటనుబట్టియే దేవుడు వెలుగు కలుగుగాకనే ఆజ్ఞ నియ్యకలిగెను. దేవుడాలాగుననే ప్రేమించిన లోకమును గూర్చి మనము మాట్లాడునపుడు అది పాపాంధకారములో నిండియున్న లోకమని అర్థము. అయితే యీపాప మొకమేఘము, ఉదయమేఘముమాత్రమే. 'నీవెలుగు వచ్చియున్నది, లెమ్ము. తేజరిల్లుము. యెహోవామహిమ నీమీద నుదయించెను. చూడుము, భూమిని చీకటి కమ్ముచున్నది. యెహోవా నీమీద నుదయించుచున్నాడు. ఆయన మహిమ నీమీద కనబడుచున్నది. జనములు నీవెలుగునకు వచ్చెదరు. రాజులు నీఉదయకాంతికి వచ్చెదరు'. లోకములోని ప్రస్తుతపు అంధకారము సర్వసృష్టిని భయముతో నింపుచుండగా ఈచీకటి దేవుడు లోకము నాలాగుననే ప్రేమించెననే వాగ్దత్తముమీద నిలచి రక్షణకొరకు ఇం

కా నిరీక్షించుచున్నది ఈలోకము చీకటి, దుష్టత్వము, కీడులతో నింపబడియున్నది.

ఈ సంగతిని గ్రహించుటకు శ్రీక్రీస్తు సిలువయొద్దకు మనము రావలయును. స్నేహితులారా! మనము సిలువయొద్ద నిలచి, కుసర్పజాలని దుష్టత్వముతో నిండిన ప్రతిమానవహృదయముయొక్క అంతరంగస్థితిని బహిరంగముగా నగుపరుచులోకమును చూచుచున్నాము సిలువవేయబడినరక్షకుని క్రమ్మియున్న మానవద్వేషాగ్ని జ్వాలలు లోకారంభముననున్న నిరాకారశూన్యస్థితిని చూపించుచున్నవి. దేవుని పరిశుద్ధాత్ముడు ఆవరించిన తరువాత గలిగిన వెలుగుకు ముందు నిరాకారశూన్యతలు పోగుండా నూతనసృష్టి కలుగుట అసాధ్యము. దేవుని గొఱ్ఱెపిల్లను చీల్చి తినవలెనని తోడేళ్ళవలె సిలువను ఆవరించియున్న దుష్టుల గుంపుయొక్క అరుపులు వినుచున్నాము వారికి అయితే దేవునికి స్తోత్రము. ఉరుము లురుముచుండగా, మెరుపులు మెరయుచుండగా, లోకము యెన్నడును చూడని గొప్ప అంధకారము గ్రమ్మియుండునట్లు చీకటి అధికారులు సిలువను చుట్టియుండగా నా దేవా నా దేవా నన్నేల చేయి విడిచితివి, అని శ్రీయేసు హృదయమునుండి వేదనాధ్వని వెడలెను. అయినను ఈ చీకటి సూర్యోదయమునకు ముందున్నవానివలె నుండెను. సిలువమీద మరణించుచున్న శ్రీయేసు లోకమును ప్రేమించెను. మరియు కలువరియొద్ద కలిగిన కటికచీకటి దేవుడు లోకము ప్రేమించెనను దాని నిర్ధారణ చేయుచున్నవి.

'దేవుడు లోకము వాలాగున నే ప్రేమించెను' అని కలువరిలో విభాగింపబడిన యీ చిన్న వాక్యము రోమా 8 అధ్యాయము యొక్క వ్యాఖ్యానమైయున్నది. లోకమునకు మరియొక పేరు 'శరీరము'.

ఇప్పుడు క్రీస్తు యేసునందుండువారికి యే శిక్షావిధియు లేదు.

నీతిమంతుని మనకొరకు శిక్ష విధించునంతగా దేవుడు లోకమును ప్రేమించెను. శిక్షావిధి ఆయనయందు సిలువలో కలదు. పాపము లేనివాడు మనకొరకు పాపముగా చేయబడెను. శ్రీక్రీస్తు యేసునందు జీవమునిచ్చు పరిశుద్ధాత్మయొక్క నియమము పాపమరణముల న్యాయమునుండి నిన్ను విడిపించెను. శరీర మనుసరింపక ఆత్మననుసరించియే నడుచుకొను మనయందు ధర్మశాస్త్ర సంబంధమయిన నీతిని నెరవేర్చబడవలెనని పాప పరిహారము నిమిత్తము దేవుడు తన స్వకీయ కుమారుని పాపశరీర ఆకారములో పంపి ఆయనశరీరమందు పాపమునకు శిక్షవిధించెను. ఎందుకనగా

శరీరస్వభావమునుబట్టి ధర్మశాస్త్రము బలహీన మాయెను. గనుక అది దాని కసాధ్యమాయెను. శరీరానుసారులు శరీర విషయములను మనస్కరింతురు; ఆత్మానుసారులు ఆత్మ విషయములు మనస్కరింతురు. శరీరానుసారమయిన మనస్సు మరణము. ఆత్మానుసారమయిన మనస్సు జీవమును సమాధానమునయి యున్నది. ఎందుకనగా శరీరానుసారమయిన మనస్సు దేవునికి విరోధమై యున్నది. అది దేవుని ధర్మశాస్త్రమునకు లోబడలేదు. ఏమాత్రమును లోబడనేరదు, కాగా శరీర స్వభావముగలవారు దేవుని సంతోషపరచనేరరు. దేవుని ఆత్మ మీలో నివసించి యున్న పక్షమున, మీరు ఆత్మస్వభావము గలవారేగాని శరీరస్వభావము గలవారు కారు. ఎవడయినను క్రీస్తు ఆత్మలేనివాడయితే వాడాయనవాడు కాడు. క్రీస్తు మీలో నున్నయెడల మీశరీరము పాపవిషయమయి మృతమయి యున్నది కాని, మీ ఆత్మనీతివిషయమై జీవయుక్తమైనదై యున్నది. మృతులలోనుండి యేసును లేపినవాని ఆత్మ మీలో నివసించినయెడల, మృతులలోనుండి క్రీస్తు యేసును లేపినవాడు చావుకులోనయిన మీశరీరములు కూడ, మీలో నివసించుచున్న తన ఆత్మద్వారా నివసింపచేయును.

ఆహా! ఇది ఎంతటి కృపాద్భుతము! లోకము చీకటి గలది. దేవునికి విరోధమయినది శరీరసంబంధమయినది, మరణమున కప్పగించబడినది. అయినను దేవుడు లోకమును ప్రేమించెను. మనము లోకమునుండి తిరిగి ఆయనయొద్దకు వచ్చునట్లు సహాయము చేయును.

## అయితే లోకమునకును మనకునుగల సంబంధము ఆలోచింతము.

ఈలోకమునయినను లోకములో నున్నవాటినయినను ప్రేమింపకుడి. ఎవడయినను లోకమును ప్రేమించినయెడల తండ్రిప్రేమ వానిలో నుండదు. లోకములోనున్న దంతయు, శరీరాశయు, కంటి యాశయు, జీవపు డంబమును, తండ్రివలన పుట్టినవి కావు. అవి లోకసంబంధమయినవే. లోకము దాని ఆశయు గతించిపోవుచున్నవిగాని దేవుని చిత్తము ననుసరించి నడుచువాడు నిరంతరమును నిలుచును. లోకము పాపము లోబడిపోయి దేవుని శాపముక్రింద నిలచి ఆదాము హవ్వల ఆశవలన మరణమున కప్పగింపబడెను. అవ్వ, సైతాను దుర్బోధవలన, తినవద్దనినపండు తినుటకు కోరుట శరీరాశయయి యున్నది. కీడువలన కలుగు శాపము యేమనగా నరుల హృదయమందు కీడును బుట్టించుటయే. కాబట్టి శరీరాశనుండి కన్నులా

శ లేకస్వేచ్ఛతనుండి అమిత స్వేచ్ఛతకు త్రిప్పుగర్వము. లేక యిష్టము వచ్చినట్లు చేయుట పుట్టించుచున్నది. హవ్వ పండును తినినతరువాత తన తలంపులందు వ్యర్థురాలాయెను. గనుక దేవుని సంతోషపరచుట కిష్టపడక తన స్వకీయత్వమును సంతోషపరచుట కిష్టపడెను. కాబట్టి కన్నులాశనుండి జీవపు డంబము పుట్టెను మనుష్యులకు శాపగ్రస్తు చేసినదిని, నరకములోనికి లాగినదిని యేది? జీవపుడంబమే గదా, దేవునియొద్ద విరిగి నలిగిన హృదయములతో వచ్చువారిట్లు ప్రార్థింతురు.

హృదయంబు నీకిస్తు — సదనంబుగా గావించి
పదిలంబుగా దానిఁ - బట్టి కాపాడుము ॥నావన్ని॥

మనము ధూళిలో గూర్చుండి మన గర్వపు ఆత్మలను దేవునియొనుట అణచిగే నేగాని మనము లేవబడి దూతల సమూహముతోను, సాత్వికుడును దీన మనస్సుగల శ్రీయేసుతోను సహవాసము కలిగియుండలేము. లోకమును ద్వేషించునట్లు దేవుడు సహాయము చేయునుగాక. కన్నులాశ ప్రకారమును, శరీరాశ ప్రకారమును నడచుకొనకుండను జీవపుడంబ ప్రకారము జీవింపకుండను దేవుడు సహాయము చేయుగాక. ఎందుకనగా ఇవంతయు గతించిపోవును. శ్రీయేసుక్రీస్తు ఈలోకములో జీవించినట్లు మనమును జీవించుటకు ప్రయత్నింతుముగాక.

యోహాను సువార్త మొదటి అధ్యాయము వెలుగును చీకటిని, వాక్యమును లోకమును, శరీరమును ఆత్మను, మనకు చూపించుచున్నది. మరియు యోహాను ఇదిగో, లోక పాపము మోసికొనిపోవు దేవుని గొర్రెపిల్లయని యేసువైపు చూపించుచు లోకమునకు విరోధముగా ఆయనను గూర్చి సాక్ష్యమిచ్చుచున్నట్లు చూపించుచున్నది మనము యోహానువలె ఈగొప్ప సువార్తను లోకమునకు ప్రకటించుటకు పంపబడు వారమయి యుండవలయును. ఆహా, ఇది ఎంతటి ఆశ్చర్యమయిన సంగతి! ఇది సకల విషయములను మించినవిషయము. ఇది లోకముయొక్క గొప్పఘంటారావము. అది మన హృదయములయందు పాడబడి వాయించబడితే ఇతరులకు పాడి వాయించగలము.

## శ్రీయేసు నేను లోకమునకు వెలుగై యున్నాననియు

మీరు లోకమునకు వెలుగై యున్నాడనే దృష్టాంతము తిరిగి చూచెదము. సూర్యుడు ప్రపంచముయొక్క ప్రతిభాగమును ప్రకాశింపచేయుచు మహిమ పర్చుచు చీకటి

ని వెళ్లగొట్టుచు, సకల సృష్టిని సంతోషపరచుచున్నాడు. ఆయనే యేసుక్రీస్తు. రాత్రి సమయమును అలంకరించు చంద్ర నక్షత్రములు వాటంతటవి చీకటిగలవై యున్నవి. లేక అది లోకమును నిరాకారముగను శూన్యముగను చేయును. అయితే అవి సూర్యుని నుండి వెలుగును పొంది ప్రతిఫలించునప్పుడవికూడ వెలుగు గలవై రాత్రులందు ప్రయాణము చేయువారికి మార్గదర్శకులయి యున్నవి. అలాగు యేసునందు విశ్వాసముంచు మనము లోకమందు వెలుగై యున్నాము. చీకటిగల రాత్రులందు తిరుగువారికి ప్రకాశమానమయిన మార్గదర్శకులమై యుందుము చిన్నవారికి మాత్రమే కాక ఎదిగిన దేవుని బిడ్డలకును, ప్రయోజనకరమయిన కీర్తనను పాడుదము.

వెల్గుచుండుడీ అను నాజ్ఞను - ప్రభువైన యేసు మాకిచ్చెను;
ప్రేమయను దివ్యాలంకరింతును - నీయింటను నీవే నాయింటను నేనే
వెల్గుచుండుడీ అను నాజ్ఞను - ప్రభువైనయేసు మాకునిచ్చెను;
దివ్యోజస్కప్రభ్చ వెల్గుచుందుము॥ నీయింట॥
వెల్గుచుండుడ అనునాజ్ఞ - ప్రభువయిన యేసు మాకునిచ్చెను;
దురితాంధకారముల్ హరింతుము॥ నీయింట॥
వెల్గుచుండుడీ అనునాజ్ఞను - ప్రభువయిన యేసు మాకునిచ్చెను;
యేసు మెచ్చునట్లు ప్రకాశింతుము॥ నీయింట॥

మనమీలోకములోనున్నమనియు, లోకస్థులవలెనుండకూడదనియు దేవుని వాక్యము పదేపదేమారులు మనకు బుద్ధి చెప్పుచున్నది మనమీ లోకసంబందులము కాము. మనము లోక స్నేహమును వెదకకూడదు మన మీ లోకమును గాని దానిలోనున్న దేదయినను ప్రేమింపకూడదు. ఎందుకనగా మనము లోకమును ప్రేమించితే దేవుని ప్రేమ మనయందు వుండదు. మనము దీనిని లక్ష్యపెట్టి నీతి సూర్యునివయిపు మన ముఖములను త్రిప్పితే ఆయన ప్రకాశము మన ముఖములమీద ప్రసరించును. ప్రతి క్రైస్తవుని చుట్టును ఒకహద్దు యేర్పడవలయును. పరిశుద్ధ బ్రతుకు బ్రతికే ఒక పురుషుడుగాని స్త్రీగాని తమచుట్టూనున్న దుష్టులమీద యెంత బలము కలిగి యున్నారో ఎవరు చెప్పగలరు? మౌనముగ నుండువాడు చూడకయుందును, దుర్మార్గపు మాటలు పలుకకయుందును. చెప్పవలసినవి చెప్పకయుందును, దు

ర్మార్గ కార్యము చేయబడకముందును, కంటిచూపు దీనిని కలిగించును. పరిశుద్ధ బ్రతుకుయొక్క శక్తి ఇదే. మనము లోకము ననుసరించితే ఈశక్తిని పోగొట్టుకొని దౌర్భాగ్యులమై ఇతరులను మనవలె దౌర్భాగ్యులగచేయుదుము. కాబట్టి మనము శ్రీయేసుకొరకు నిలువబడుదము. అట్లు మనము నిలుచునప్పుడు మన ప్రతిచూపు ప్రతికార్యము ఈలోకమందు గొప్పబలము గలదయి యుండును.

మన ప్రభువు, యోహాను వ్రాసి సువార్త పదియారవ యధ్యాయమందు మనకును లోకమునకునుగల సంబంధమును గూర్చి ఎక్కువగా చెప్పియున్నాడు. ఆ యధ్యాయముయొక్క ఆరంభమందు తాను తన శిష్యులకు చెప్పిన సంగతులవల్ల వారు అతంకపడకూడదనెను. లోకము వారిని తరిమి చంపినను సహాయకుడొకడు వారితోవుండునని చెప్పెను. ఆయన లోకమును ఒప్పుకొనజేయు న్యాయాధిపతి. ఆయన పాపమును గూర్చియు, నీతిని గూర్చియు, న్యాయతీర్పును గూర్చియు ఒప్పుకొనచేయును. వారు శ్రీయేసునందు నమ్మనందున పాపమును గూర్చియు కుమారుడు తండ్రియొద్దకు వెళ్లినందున వారు చూడకుండుటవలన నీతిని గూర్చియు ఈలోకన్యాయాధిపతి న్యాయము తీర్చినందున న్యాయతీర్పును గూర్చియు ఒప్పుకొనజేయును. ఈ ఆశ్చర్యమయిన ప్రసంగములో ఆయన తిరిగి వచ్చువరకు నిలచియుండు మాటలు పలికెను. 'నాయందు మీకు సమాధానము కలుగునట్లు ఈమాటలు మీతో చెప్పుచున్నాను. లోకములో మీకు శ్రమ కలుగును; అయినను ధైర్యము తెచ్చుకొనుడి. నేను లోకమును జయించియున్నా ననెను'.

శ్రీ యేసుక్రీస్తుయొక్క బలహీనమయిన సందేహ శిష్యుడా, నీవిశ్వాసము స్వల్పమయినదయినను సంతోషించుము. శ్రీయేసు నీతోకూడా నున్నాడు. కడపటిజయము నీవిశ్వాసమువలనగాక శ్రీయేసుయొక్క విజయమువలన కలుగును. ఆయన జయించి నిత్యము జయించుచున్నాడు. సంతోషించుము! శ్రీయేసును వెంబడించు ప్రతివారికి లోకములో తొందరలున్నను ఆయనను జయించియున్నాడు మనము జయింతుము.

దేవుడు లోకము నాలాగున నే ప్రేమించెను, అనునది దేవుడు పలికిన యీవాచనమందు మొదటి వాక్యమై యున్నది. ఇది ఆశ్చర్యమయిన సంబంధము కలిగియున్నది. మొదట దేవునిని లోకమును, చివరను నశించువారిని నిత్యజీవము కాం

దువారిని కలిగియున్నది. బైబిలులోని ప్రతిపుస్తకము, అనేక అధ్యాయములు అనేక వచనములు దేవునిని లోకమును, వెలుగును చీకటిని, రక్షణను నిత్యనాశనమును, జీవమును మరణమును, పరలోకమును నరకమును, చూపించుటవలన ఒకదానిననుసరించి మరియొకదానిని విడువవలయునని చెప్పబడినవి కాని వృధాగాగాని, అలంకారముగాగాని చెప్పబడలేదు. నీవు దేనిని ఏర్పరచుకొందువు? దేవునినా? లోకమునా? శ్రీయేసు నిమిత్తము మనము లోకమును విసర్జించి దేవుని అంగీకరించుకొనునట్లు ఆయన సహాయము చేయునుగాక; ఆమేన్.



V అధ్యాయము.

# HIS ONLY BEGOTTEN SON.

# ఆయన జనితైక కుమారుడు.

మృత్యువెప్పుడయిన నీఇంటిలో ప్రవేసించి నీ వతివిస్తారముగా ప్రేమించిన కుమారుని నీచేతులలోనుండి హఠాత్తుగా కొనిపోవుట సంభవించెనా? పూర్వకాలమందలి దావీదువలె 'నాకుమారుడా! నాకుమారుడా!! అయ్యో నీకు బదులుగా నేను చనిపోతే బాగుండునని' దుఃఖముతో కేక వేసితివా? అప్పుడు కుమారునియెడల తండ్రి ప్రేమ యెంతయినది నీకు కొంతవరకు తెలియును. నాప్రియకుమారుడు చనిపోయిన సమయమును నేనెప్పుడయినను మరువగలనా? అప్పుడు లోకము నాకెంత నిస్సారమైనదిగ దోచెను. నాఆస్తి, నావస్తువులు, నాధనము, నాకు కలిగిన సర్వమును పోయి ఇల్లులేక దరిద్రుడనయినను నాకుమారుడు నాతో వుండిన, నాజీవమందలి శత్రువులందరిని జయించి యుందును. ఎందుకనగా ప్రేమ నన్ను బలపరచినందున శత్రు నోటినుండి నాభాగ్యమును తీసికొనియుందునుగదా యని అనుకొంటిని. నేనొకక్షణ మిట్లు ధైర్యముతప్పి తలంచితినిగాని, దేవుని అనంతప్రేమను గూర్చియు, నాకుమారుడు క్రీస్తు చేతులలో క్షేమముగా యున్నాడనే దానిగూర్చియు, తలంచినప్పుడు నాకు ఓదార్పును, బలమును కలిగినవి.

దేవుడు తన జనితయిక కుమారుని చెడిపోయిన ఈలోకమునకు, నీకొరకును, నాకొరకును, శ్రమ ననుభవించి చనిపోవుటకుగాను పంపుటయందు పరలోక తండ్రి యొక్క ప్రేమను, నాకు కలిగిన ఈదుఃఖముద్వారా కొంతవరకు గ్రహించగలను.

మనకొరకు ప్రవక్తగాను, యాజకుడుగాను, రాజుగాను వుండు,

రక్షకుడయిన శ్రీయేసుక్రీస్తుతిలువ యొద్ద

మళ్ళీ నిలుతుము. ఈదేశములో ప్రభువయిన క్రీస్తు ప్రవక్తమాత్రమే యున్నాడని మహమ్మదీయులు చెప్పుచున్నారు. వారి ఖురానులో మన ప్రభువు ఈ

హానబీ అనగా యేసుప్రవక్త. నబీయనుమాటను హెబ్రూభాషలోనుండి అరాబియా
భాషలోకి తీసుకొనబడినది. దీనికి అభిషేకింపబడినవాడు లేక అభిషేకించువాడు
అధికారము గలవాడుఅని అర్థము. కాబట్టి మహమ్మదీయులు చెప్పు నబీయను ప
దమునకును, యూదులు చెప్పు మెస్సీయాను పదమునకును సంబంధము కలదు. ప్రవ
క్తయను పదము గ్రీకుపదము. దీనికి సత్యము పలుకువాడు, రాబోవు సంగతులు
చెప్పువాడు, ప్రసంగకుడు, దేవునికిని మనుష్యులకును, మధ్యవర్తి, దేవోక్తి, సర్వ
శక్తునితో మాటలాడువాడని భావము. కాబట్టి దేవుడు మన ప్రభువును, రక్షకుడ
యున తన జనితైక కుమారుని ఇచ్చునంతగా లోకమును ప్రేమించెనని ఎరుగుదుము.
ఆయన మన నబీగాను మెస్సియాగాను, మధ్యవర్తిగాను. ప్రవక్తగా నుండెను.
లోకము మధ్యవర్తులను ప్రేమించుచున్నది గాని మన నిజమయిన మధ్యవర్తియగు
శ్రీయేసునే ప్రేమించుట లేదు.

మన చక్రవర్తి ఎడ్వర్డుగారినిగూర్చి ఒక వినోదమయినసంగతి గలదు.

ఏసునిన ఒకబాలిక రాణిగారిని చూడగోరి రాజమందిరము సమీపింపగా రాకూడదని
ఆటంకపరుపబడెను. ఇంతలో మందిరమునుండి దిగి వచ్చుచున్న ప్రిన్స్
ఆఫ్ వేల్స్ ప్రభువుగారు ఏమని ఏడ్చుచున్న చిన్నదాని నడిగెను. అందుకామె
దుఃఖస్వరముతో రాణిగారిని దర్శింపకోరుచున్నాను. నన్ను యీదుష్టుడు నగరము
సమీపింపకుండ తరుముచున్నాడని చెప్పెను. రాజుగారు చిరునవ్వుతో ఆచిన్నదా
నిచేయి పట్టుకొని నాతోరమ్మ నిన్ను రాణిగారియొద్దకు తీసుకొనిపోవుదుననెను.
అందువల్ల ఆచిన్నది రక్షకునితో వెళ్ళి మనోభీష్టమును నెరవేర్చుకొనెను.

అటువలె శ్రీయేసు నాథస్వామి మనయొద్దకు వచ్చి 'నాతోరమ్మ, నాయొ
ద్దకురమ్మ నీకు తండ్రిని చూపింతును' ఆయన ప్రవక్తయను మెస్సియా. ఆయన
మాత్రమే తండ్రిని దర్శింపచేయగలడు. ఆయనతో వెళ్ళుదమా? లోకము ఆయన
ను అంగీకరించునా? రాజుగారియందు ఆచిన్నది నమ్మినట్లు లోకము ఆయనను నమ్ము
నా? అయ్యో! శ్రీయేసుక్రీస్తుయొక్క జీవచరిత్ర నంతయు చూడగా, ఆయన తనస్వ
కీయులయొద్దకు వచ్చెననియు, ఆయన స్వకీయులు ఆయనను అంగీకరింపలేదనియు,
అగుపడుచున్నది. దేవుని ప్రవక్తయు, మానవజాతి రక్షకుడునగు మెస్సియా ఈ
లోకమందు సిలువలో ఆయన పొందిన క్రూరబాధలు వివరింప శక్యముగానంత గొప్ప
విగా నున్నవి. ఆయన స్వదేశీయులు పలికిన పరిహాసకరమయిన దూషణ వాక్యము

లను మన రక్షకుడు సిలువమీద నున్నప్పు డిచ్చిన ప్రత్యుత్తరములను మత్తయి, మార్కు, లూకా, యోహాను, లనెడి ఖ్యాత్రికు లెట్లు వ్రాసిరో చదువుడి. మత్తయి, వ్రాసిన మాటలను చదువుము. శ్రీయేసు ఈ ఉపమానములు చెప్పి చాలించిన తరువాత (అనగా పదమూడవ అధ్యాయములోని గొప్ప యుపమానములు) ఆయన అక్కడనుంచి స్వదేశమునకు వచ్చి సమాజ మందిరములలో వారికి బోధించగా, వారాశ్చర్యపడి యీజ్ఞానమును, నీయద్భుతములును, నితని కెక్కడనుంచి వచ్చినవి; ఇతడు వడ్లవాని కుమారుడు కాడా? ఇతని తల్లిపేరు మరియ కాదా? యాకోబు, యోసేపు, సీమోను, యూదా అనువార లితని సహోదరులు కారా? ఇతని అక్కచెల్లెండ్రందరు మనలోనే యున్నారుగదా? ఇతని కీకార్యములన్నియు నెక్కడనుంచి వచ్చెనని చెప్పుకొని ఆయన విషయము అభ్యంతరపడిరి. అందుకు శ్రీయేసు ప్రవక్త తనదేశమును తన యింటనుతప్ప మరి యెక్కడనయినను, ఘనహీనుడు కాడని వారితో చెప్పెను. వారి అవిశ్వాసమునుబట్టి ఆయన అక్కడ అనేకమైయున అద్భుతములు చేయలేదు. ఏమివింత! మన దినములందును, మన తరమందును, ప్రవక్తయగు శ్రీయేసును అంగీకరించుచున్నామా లేక ఆయనను ఘనపర్చుచున్నామా? లేక గొప్ప వంశములో పుట్టలేదనియు వడ్లవాని కుమారుడనియు అగౌరపర్చుచున్నామా? అప్రవక్తను అంగీకరించి ఘనపరచినగాని మనలో ఆయన గొప్పక్రియలు చేయడని నమ్మెదము లూకా సువార్త 13-వ అధ్యాయములోని కొంతభాగమును ఆలోచింపుమని కోరుచున్నాను. ఏమనగా

హేరోదు నిన్ను చంప నుత్సహించియున్నాడని

ముగ్గురు పరిశయ్యులు భయపెట్టినఅంశము భూత, భవిష్య ద్వర్తమానములు తెలుపు ప్రవక్తకు ప్రాణోపద్రవస్థితి కలుగునని నీవు భయపెట్టగలవా? అవాగ్గురికి ప్రవక్త చెప్పిన ఉత్తరమున్ను ఆయన యెట్లు చింత పడినదిన్ని కనుము. మీరు వెళ్ళి ఆనక్కతో ఈలాగు చెప్పుడి. ఇదిగో నేటు రేపు నేను దయ్యములను వెళ్ళగొట్టుచు రోగములను స్వస్థపర్చుచుండి మూడవదినమున పూర్ణ సిద్ధిపొందుదును. అయినను నేడు రేపుఎల్లుండినా మార్గమునపోవుచుండవలయును. ప్రవక్త యెరూషలేమునకు వెలుపల నశింపుటకు వలను పడదు. యెరూషలేమా! యెరూషలేమా!! ప్రవక్తలను చంపుచు, నీయొద్దకు పంపబడినవారిని రాళ్ళతో కొట్టుచుండుదానా! కోడి తన పిల్లలను తన రెక్కల క్రిందికి నేలాగు చేర్చుకొనునో అలాగే నేను ఎన్నోమార్లు నీపిల్లలను చేర్చుకొనవలెన

ని యుంటినిగాని నీవొల్లకపోతివి. ఇదిగో నీయిల్లు మీకు పాడుగా విడువబడుచు
న్నది. యెహోవాపేరట వచ్చువాడు స్తుతించబడుగాకని మీరు చెప్పే పర్యంత
ము మీరు నన్ను తెలిసికొనజాలరని నిశ్చయముగా మీతో చెప్పుచున్నాననెను. అ
నుభజ్ఞులయిన నొకదొరగారిట్లు వ్రాసిరి. నాజీవితకాలమంతయు అత్యాశ్చర్యము
తో ధ్యానింపదగిన గొప్పమర్మ మేదనగా శ్రీయేసు అనుగ్రహించగా నిత్యమయిన
తండ్రియు పరిశుద్ధాత్మయు, నావంటి పాపులను పుత్ర స్వీకారము చేసికొని దేవు
ని సంతాన మనునట్లు చేయుటయే. దేవుని జనితైక కుమారుడయిన శ్రీయేసును సి
లువవేసి చంపిన ద్రోహులను సహా క్షమించి దేవుని సంతానమని పిలుచునట్లు స్వీ
కారము చేసుకొని మనమీదఁ జూపిన ఆయన ప్రేమ యెంతగొప్పదో చూడుడి.
ఇంతకంటె అత్యాశ్చర్యమయినది మరియొకటికలదా? శ్రీయేసును ప్రవక్తయనియు
అన్నయనియు పిలుచుట ఎంతటిఘనమో ఆలోచించుడి. అమెరికాలో నొకదొ
రగారొక ఉపన్యాసము యిచ్చిరి. నేనప్పుడు బాలుడను. అందరికంటె ముం
దుగా పోతిని. ఆయన రాత్రిభోజనము చేయు ప్రదేశమునకు పోవు గేటువద్దనుండి
అత్యుల్లాసకరమయిన ఆయన ముఖమును చూచితిని. నాచూపొకవేళ ముందుగా
నుండునేమో? ఆయనయొద్దకు పోయి కూర్చుండి మాట్లాడవలెనని యాపేక్ష పడినా
నుగాని అట్లు చేయలేకపోతిని. నేనున్ను, ఆయనయున్ను అన్నదమ్ములమయి
యుండినయెడల యట్లు జరిగియుండదుగదా? ఆయనతో కూర్చుండి భోజనము చే
సియుందునుగదా? కావున సహోదరులారా! శ్రీయేసు మన హృదయమను తలు
పుయొద్ద నిలిచియున్నాడు. 'ఇదిగో నేను తలుపుయొద్ద నిలిచి తట్టుచున్నాను. నా
స్వరము విని ఎవడు తలుపు తెరచునో వానియొద్దకువచ్చి యతనితో నేనును నా
తో వాడును భోజనము చేయుచున్నామని చెప్పుట వినబడలేదా? మన ద్వారము
లను విశాలముగా తెరచి మన అన్నయు ప్రవక్తయునయిన శ్రీయేసును లోపల ప్రవేశ
పెట్టుకొందుము. ఆయన మనకు అతిథిగా నుండి వెంటనే మనకు విందు పెట్టగలవా
డగును. రక్షకుని అంగీకరించుడీ. హెబ్రి యుత్తరము వ్రాసిన గ్రంథకర్తవలె మ
న ప్రభువయిన శ్రీయేసును, ఆయన చరిత్రను అర్థవిచారము చేసినగాని గ్రహింపజా
లము. ప్రపంచక యంశములయొక్క సృష్టిస్థితిలయముల మూలకారణములు, ఆ
యన చరిత్రవలన గ్రహింపగలము. శ్రీయేసును విడిచిన బ్రతుకు సంశయకరమైన
బ్రతుకు ఆయనతో మనము సంబంధించిన యెడల దేవుని వెలుగు ఆయనలో చూతు
ము. అనేక కర్మలతోను, ఉత్సవములతోను, కూడిన హిందూమతము, శ్రీయేసు
నందు విమోచనములేని యూదుల మతమువంటి విమోచనము లేనిది. ' శ్రీయేసు

లోకముయొక్క బ్రతుకునకు, పనులకు. చరిత్ర మూలాధారమయిన కీలకమని హెబ్రీ గ్రంధకర్త గ్రహించి ఔదార్యు, ధైర్యము, దైవానురాగము కలిగియుండెను. యోహాను సువార్త (iii) అధ్యాయము 16వ, వచనము నిశ్చయముగా దేవుడు లోకమును ప్రేమించెను. ఏలాగనిన ఆయన తన జనితయికకుమారుని యిచ్చెను. దీనికి ప్రసిద్ధమయిన వ్యాఖ్యానము హెబ్రీల యుత్తరమే. ప్రతి పుటయు,మహాత్తైన సత్యమును మన మనసానందు చాటుచున్నది. ఆయన మన ప్రవక్తగా నుండుటకు మాత్రమే పంపబడలేదుకాని, దేవుని మహిమను బయలుపర్చి దేవునికోపమునుండి తప్పించుకొని ఆయనతో సమాధానముగా నుండునట్లు మనలను చేయుటకు

ప్రధాన యాజకుడుగా నుండెను.

ఆయన లోకముయొక్క పాప పరిహారార్థము తన్నుతానే యాగపశువుగా నిర్మించుకొనెను. హెబ్రియుల పత్రికలోని దేవునికృప ప్రతి మనుష్యునికొరకు మరణమును అనుభవించుటకు దూతలకంటె కొంతకాలము తక్కువగా చేయబడిన శ్రీ యేసు మరణము పొందినందున మహిమ ప్రభావములనె కిరీటము వేయబడి యుండుట చూచుచున్నాము. ఎందుకనగా అన్నియు ఎవని నిమిత్తమును అన్నియు ఎవనివల్లను కలుగునో ఆయన అనేకులయిన కుమారులను మహిమకు నడిపించుచుండగా వారిరక్షణకర్తను శ్రమలవల్ల పరిపూర్ణుని చేయుట ఆయనకు యుక్తమై యుండెను. ఎందుకనగా పరిశుద్ధపరచు ఆయనయు, పరిశుద్ధపర్చబడే వారును ఒక్కని సంతానమయి యున్నారు. ఈ హేతువుచేతను వారిని సహోదరులని చెప్పుటకు ఆయన సిగ్గుపడక నీనామము నా సహోదరులకు తెలియజేతును. సంఘముమధ్య నిన్ను కీర్తింతునని యు, మరియు నేను ఆయనను నమ్ముకొని యుందుననియు, మరియు ఇదిగో నేనును దేవుడు నాకిచ్చిన పిల్లలును అనియు... కావున ప్రజల పాపములను ప్రాయశ్చిత్తమువల్ల నివృత్తి చేయుటకు దేవుని సంబంధమయిన వాటివిషయము, కనికరము నమ్మకముగల ప్రధాన యాజకుడ యేనిమిత్తము అన్నిటిలో తన సహోదరులతో పోల్చబడవలసి యుండెను.

ఎందుకనగా తాను శోధించబడి శ్రమ పొందెను. గనుక శోధించబడువారికి సహాయము చేయగలడు. కాబట్టి ఆకాశసంబంధమయిన పిలుపులో పాలుపొందిన పరిశుద్ధ సహోదరులారా! మనము ఒప్పుకొనిన అపోస్తలుడును, ప్రధాన యాజకుడయిన శ్రీయేసును శ్రద్ధగా లక్ష్యపెట్టుకొనుడి. ఆయనయొక్క ఇల్లంతటిలో మోషేవలె ఆయనకూడ తన్ను నియమించెను. వానికి నమ్మకముగా యుండెను.

అనే వాక్యములను చదువుడీ! పర్యాలోచన చేయుడీ! ఒకనాటి సాయంకాలము
న నేను న్యూయార్కు పట్టణములో నొకగుడియొద్దకుపోయి అది తెరచియుండగా
అతట్టుపోయి మధురమయినగీతమును విని యింటిలో ప్రవేసించి శాశ్వతానందమునిచ్చు
గీత ననుభవించుటకు నాకు తలంపు కలిగినను శ్రోత్రివాడ నగుటచేత సందేహించిలో
పలికి పోకయుంటిని. నాకు తెలియుని నా స్నేహితులు భార్యాభర్త లిద్దరు కామి
రూన్ మిచ సెరీలు బీదలకున్ను, జ్వరబాధ పడువారికిన్ని ఆరోగ్యస్థలముగానుండు
నొక గృహమ్ము, గుడీ, ఆఫ్రికా పర్వతములమీద నిర్మించుటకు కావలసిన చందా వ
సూలు చేయుచు శ్రావ్యమయిన గీతములు పాడుచుండిరి భర్త జర్మనీ అమెరికా
లోని శ్రేష్ఠమయిన పాటకుడు. భార్య బర్లిన్ దేశములో ప్రసిద్ధిచెందినామె. ఇ
దువురు వాస్తవమయిన క్రైస్తవులు. వారి జ్ఞానవంతయు శ్రీయేసువారి పాదప
ద్మములయందె వినియోగింపబడెను. నేను గుడిలో ప్రవేసించునప్పటికి భర్త తన
సంగీతమును ముగించెను. భార్య పాడ నారంభించెను. అత్యద్భుతమయినట్టిదియు,
వరజనితమయినవారి సంగీత విద్యలో నాటిరాత్రి మునిగి ఆనంద మనుభవించినదెట్లు
మరుతును. వాని గీతములోని ముఖ్యాంశము—లోకపాపమును మోసుకొనిపోవు
దేవునిగొఱ్ఱెపిల్లా! నమ్ము కరుణించుమనియు, చీకటిలోనుండి నిరాశతో మృతినొం
దబోవు మానవ ఆత్మలను రక్షింపమని వేడుకొనుట వుండెను. ఆమెన్ అను పద
ములో గీతము ముగియగానే నేనా గుడినుండి వెడలి వచ్చితిని. ఆరాత్రి నేనొక
శబ్దమును వినుటకుగాని కొకరితో మాట్లాడుటకుగాని యిష్టపడక ఆరాత్రి ఒంటరి
గా నారక్షకునితోనుండి నాప్రధాన యాజకుడా! దేవుని గొఱ్ఱెపిల్లాయని ఆయన
ను స్తోత్రము చేయువలయుననే యిష్టపడితిని. నామనను ఆయనయందు లీనమై ఇ
ట్లు స్తుతించిన కీర్తనలోని అంశమేమనగా యెహోవాను స్తుతింపుడి ఓనారక్షకుడా!
నా విమోచకుడా!

నాప్రధాన యాజకుడా! నాదేవుని గొఱ్ఱెపిల్లా!!

అంతకుపూర్వమజాగ్రతగా దాని యర్థమునుగమనింపకయే పాడుచుండిన యాగొప్పగీతము
నుఅది మొదలు పశ్చాత్తాపము సంతోషము, తెలిసే కన్నీళ్లతో పాడుచున్నాను.
ఇప్పుడు శ్రీయేసు మనలను సోదరులని పిలుచుటకు సిగ్గుపడడు. కొన్ని సమయ
ములలో ఆయనను అన్నాయని పిలుచుటకు సిగ్గుపడుచున్నాను. మనుష్యులవల్ల
విసర్జింపబడి చింతాక్రాంతుడయి ముఖము కప్పుకొనినవానివలె తృణీకరింపబడినవాడ
ని పేతురు ప్రభువునుగూర్చి బొంకినట్లు మనము ప్రభునుగూర్చి బొంకుట, మొదలగుచె

ష్ట కార్యములు చేయుటకు సిగ్గు పడము. ఆయనను మనము ఘనపర్చముగాన ఆయన మనలను తృణీకరించును. నేనొకప్పుడు జూలియస్ అను తెలివిగల యొకబాలుని చూచితిని. అతడు దుర్మార్గపు పిల్లవాడు. అతనిని వెంటబెట్టుకొని ప్రార్థనచేయుచు జూలియస్ శ్రీయేసు నెదుట నీవు సిగ్గుపడుచున్నావు. నిన్ను అంగీకరించి నీవు చేసిన అనేక పాపములను క్షమింపుమని నీవెందు కాయనను వేడుకొనుటలేదు. శ్రీయేసు నెదుటికి నీవు కొనిపోబడు దినము వచ్చును. అప్పుడు ఆయన నిన్ను గుర్తెరుగనని చెప్పుటకు సిగ్గుపడగలడు. అప్పుడు నీవేమి చేయగలవు. భయంకరమయిన నరకములోబడి శాశ్వతమయిన చీకటిలో పండ్లు కొరుకుకొనుచు యేడ్చుచుండుటకు సిద్ధపడెదవా? అని అడిగితిని. అంతట నాబాలుడు మోకాళ్లమీద పడి శ్రీయేసు నన్ను రక్షింపుమని వేడుకొనెను. అప్పుడే వానియందు కరుణ చూపగా అతని దుఃఖము, నిరాశ అతనినుండి పారిపోయెను. ధైర్యము వచ్చెను. మేము మోకాళ్ల మీదనుండి లేవనేలేదు. ఇంతలో ఓహల్లెలూయా! గొప్ప రక్షకుడా! ఇంతిపాపినయిన నన్నుకూడా రక్షించితివి నాదేవా యని యతను పాడుచు లేచి గంతులు వేయుచుండెను. మనము శ్రీయేసునుగూర్చి సిగ్గుపడకూడదు. గ్రీకుల ఉపచనములవలె మన ఒప్పుకోలుయొక్క ప్రధానయాజకుడు, అపోస్థలుడయిన శ్రీయేసు మీద దృష్టి యుంచుడము. ఆవచనములకు సరియయిన తెలుగు వచనములు.

శ్రీయేసుక్రీస్తునకే లజ్జింతు నా పామరులబోలి॥ యే॥
వాసికెక్కినదూతాళియునిన్ వర్ణనలు గావించుచుండంగ
భాసురంబుగ నామమునకును భక్తియుక్తుడు సిగ్గుపడునా॥యేసు॥

చాలాయేండ్లక్రిందట రాచిస్టర్ పట్టణములోని సత్యవేదపాఠశాలయందలి విద్యార్థులు, ఉపాధ్యాయులు వేల్సుదేశపు రాగముతో నిట్లు పాడిరి.

శుభంబు యేసు శక్తికిన్
భజింత్రు దూతలున్
కిరీటముంచి వారికిన్
మీరాజు చేయుడీ

ఆగానము నన్ను భూలోకమునుండి పైకి యెత్తగా ఆకాశము తెరవబడుట చూచితిని. శ్రీయేసు దర్శనమాయెను. పూర్వ మొకప్పుడు ముళ్ల కిరీటము కలి

## VI అధ్యాయము.

# HE GAVE:—ఇచ్చెను.

క్రైస్తవాలయములను కట్టువారికి క్రైస్తవమతసిద్ధాంతములు చిక్కులు బెట్టునవై యుండెను. క్రైస్తవశకారంభమునుండి ఇప్పటివరకును ఆలయములు కట్టువారు ఏముఖ్యమయిన పరిశుద్ధ గురుతులతో గట్టుదుమా యను ప్రశ్న వారిలో ముఖ్యముగా కలుగుచున్నది; ఎందుకనగా కన్నులద్వారా సత్యములు మన హృదయములలోనికి ప్రవేశించును. ఆది క్రైస్తవుల గురుతు లిప్పటివారికి మహా మంచివిగను మనకును తాకునవిగ నున్నవి. ముఖ్యమైన గురుతు లేవనగా సిలువగల గొర్రెపిల్ల, అనగా దేవుని గొర్రెపిల్లయగు క్రీస్తును, పెనసిన ద్రాక్షతీగ, అనగా నిజద్రాక్షావల్లియగు యేసును; చేపనును చేయుదురు. చేపను చేయుటకు కారణ మేమనగా గ్రీకుభాషలో చేపయను పదముయొక్క ప్రతి యక్షరమును పరీక్షించితే శ్రీయేసుక్రీస్తు దేవుని కుమారుడు రక్షకుడు అను మాటలయొక్క ప్రథమాక్షరములుగల శ్రీయేసుయొక్క మహిమగల పేరు అందులో ఇమిడి యున్నది. ఈమూడు గురుతులు క్రీయేసును బయలుపరుచుచున్నవి. ఇవిగాక ఆయన గొర్రెల మంచికాపరి మొదలగు పేరులును కలవు.

### నాప్రయాణమునం దనేక దేవాలయములను చూచితిని.

వానిలో కొన్ని బహు ఆశ్చర్యమయిన అలంకారములతో నిండియుండినవి. వాటిలో నొకటి నాకు ఆదిమ కాలమం దుండినదిగను నిజముగా భక్తియుక్తమయినదిగను కనుపడెను. అమెరికాలోని న్యూయార్కు జిల్లాయందలి బిఫలో పట్టణమందు ఒక దేవాలయము కలదు. దాని మధ్యలో బహు సొగసుగా నలంకరించిన ఒకబురుజు కలదు. ఒకడు దానిని నిదానించి చూచిన యెడల ఒక తలమీదచాలామంది దూత లెగురుచున్నట్లు అగుపడు రూపకము కలదు. దాని సుందరమయిన గోడమీద నీవాక్యములు చదువవచ్చును. 'నీమార్గము లన్నిటిలో నిన్ను కాపాడుటకు ఆయన నిన్నుగూర్చి తన దూతల కాజ్ఞాపించియున్నాడు'. అయితే ఇండియాయందలి బా

పట్లలోని దేవాలయమందుగాక మరి యెక్కడను చూడని ఒకవాక్యమును నేనొక దేవాలయమందు చూచితిని. ప్రసంగ పీఠమునకు వెనుకనుండు గోడమీద నొక సిలువయును దానిలో శ్రీక్రీస్తు సిలువమీద పలికిన ఏడుమాటలును వ్రాయబడి యుండెను. నేను దాని జూచినప్పుడెల్లను నాకు ఆశ్చర్యము, సంతోషము, స్తుతి పుట్టుచుండును. ప్రసంగ పీఠమునందు కమానుమీద 'ఆయన తన జనితైక కుమారునియిచ్చునంతగా లోకమును ప్రేమించెను'. అను మాటలు కలవు.

యోహాను 3: 16 వచనము నందలి 'ఆయనను యిచ్చెను' అనుమాటలభావము ఆశీఃవ నాకు వివరించుచున్నది. దేవుడు నశించుచున్న లోకమునకు, నశించక, నిత్యము పూజనీయమయిన వాక్యముల ద్వారా ఆయన అత్యధికమయిన దానము వ్రాయించెనని కనుగొనుచున్నాము. దేవుడిచ్చెనుగనుక మనమును యివ్వవలయును ఆయన తన జనితైక కుమారుని యిచ్చెను. మనము మన పాప హృదయములను ఆయన కియ్యవలయును. ఇప్పుడాయన కిచ్చెదవా? ఇప్పుడే యిచ్చెదవా? నాతో చెప్పుము.

ఆలాగయిన నేను వాని - కచ్చిన ప్రేమయనుబుణ- మీలుగుదుఃఖాస్రుబిందు-
జలాంబుపల్లదీరదు=హాలాయించియిదిగో - ప్రభువా నన్నే నేనర్పించెదను
ద్వేల భక్తితో సేజేయు - జాలిన యున్నది జేతు॥ కట॥
మరణము నొందుచున్న ప్రియప్రభువు సిలువమీద పలికిన ప్రథమ వాక్యము

అంగలార్పుకయినను దుఃఖముచేత మూలుగుటకయినను కాదుగాని తన శత్రులకొరకు చేసిన ప్రార్థనయే. అక్కడ నిలచి ఆయనను తిరస్కరించి దూషించు సమూహపు మాటలను వినుము. తన మంచి స్నేహితుడు పగిలిన హృదయముతో చనిపోవునట్టుల బాధ పరచినది మాత్రమే గాక అవమానపరచిరి. మన ప్రభువు తనశత్రువుల యెడల వింతా అనంత కనికరము గలిగి వేదనతోను శరీర బలహీనతతోను నిండియుండినను అవన్నియు మరచి 'తండ్రీ! వీరేమి చేయుచున్నారో వీరెరుగరు గనుక వీరిని క్షమించుము' అని ప్రార్థించెను.

## క్రైస్తవము లోకమంతయు వ్యాపించుటను చూచి నీవు ఆశ్చర్య పడుచున్నావా?

ఎందుకు? అవి ప్రవచనములయొక్క నెరవేర్పులే. దేవుడు తన వాగ్దత్తమును నిలుపుకొనుచుండుట నీకు వింతగా నున్నదా? నాకు అలాగు లేదు. 'తనకు కలిగిన వేదనను చూచి తృప్తి నొందును. నీతిమంతుడయిన సేవకుడు జనుల దోషములను భరించి తనకున్న అనుభవ జ్ఞానముచేత అనేకులను నిర్దోషులనుగా చేయును. ఏలయనగా మరణము నొందునట్లు తన ప్రాణమును ధారబోసెను. అతిక్రమము చేయువారిలో నెంచబడినవాడాయెను. అనేకుల పాపమును భరించుచు తిరుగుబాటు చేసినవారినిగూర్చి విజ్ఞాపనము చేసెను. కావున గొప్పవారితో నేనతనికి పాలు పంచిపెట్టెదను. ఘనులతో కలసి అతడు కొల్లసొమ్మును విభాగించుకొనును' అను నీ ప్రార్థన సిలువమీద చేయకముందే అనేక శతాబ్దములక్రిందట సర్వశక్తుడీ వాగ్దత్తమును చేసి యున్నాడు.

దేవుడు శ్రీయేసును పాపుల పక్షమున వాదించువానిగా జేసియుండెను. ఆయన నాకొరకు వాదించును. నీకొరకును వాదించును. అంతేకాదు, లోకస్థు లందరు దేవునితో సమాధానపడుటకయి బ్రతిమాలుకొనును. తన దూతలనుసహా వారియొద్దకు పంపుచున్నాడు. ఆహా, ఇది ఎంతటిదానము! ఈ వకీలు లేక యెవడును తీర్పులో నిలువజాలడు. 'నాపిల్లలారా మీరు పాపము చేయకుండుటకై యీ సంగతులను మీకు వ్రాయుచున్నాను. ఎవడయినను పాపము చేసినయెడల నీతిమంతుడయిన శ్రీయేసుక్రీస్తను ఉత్తరవాది తండ్రియొద్ద మనకున్నాడు. ఆయనే మన పాపములకు శాంతికరుడయి యున్నాడు.' శ్రీయేసు నీయుత్తరవాదియా? పరలోకసభలో ఆయన నీవిషయమిట్లు వాదించుచున్నాడని యెరుగుదువా? ఆయన పరిశుద్ధాత్మ ఈలోకములో నీకు సహాయకుడయి యుండగా ఆయన పరలోకమందు నీ పక్షమై యుండ వేచియున్నాడు. ఆయనను నీ సహాయకునిగా నంగీకరించుము. అప్పుడు నీకు శిక్షావిధి లేదు. ఎందుకనగా నీవు ఆయనయందున్నావు. ఆయన మన ఘనమయిన సహాయకుడును బలవంతుడైన నీతిగల శ్రీయేసుక్రీస్తు.

అపొస్తలుడయిన పేతురు శ్రీయేసును యెరుగనని బొంకి సంతాపపడి యేడ్చి శ్రీక్రీస్తువైపు తిరిగిన వెనుక తనకాలమందు జీవించియుండిన చెదిరిన క్రైస్తవులకు వ్రాసిన ప్రతి వచనమందును వారు మరణము మట్టుకు శ్రీక్రీస్తుయందు నమ్మకముగా యుండుడని గద్దించుచున్నాడు. 'శ్రీక్రీస్తుకూడ మీకొరకు బాధపడి మీరు తన అడుగుజాడలనుబట్టి నడుచుకొనవలెనని మీకు మాదిరి యుంచిపోయెను. ఆయన

పాపమేమియు చేయలేదు. ఆయన నోటను ఏకపటమును కనుపడలేదు. ఆయన దూషింపబడియు బదులు దూషింపలేదు. శ్రమ పెట్టబడియు బెదిరింపక న్యాయముగా తీర్పుచేయు దేవునికి తన్నుతాను అప్పగించుకొనెను. మనము పాపుల విషయమయి చనిపోయి నీతివిషయము జీవించునట్లు ఆయన తానే తన శరీరమందు మన పాపములను మ్రానుమీద మోసికొనెను. ఆయన పొందిన గాయములచేత మీరు స్వస్థత నొందితిరి. మీరు గొఱ్ఱెలవలె దారి తప్పిపోతిరి. కాని యిప్పుడు మీయాత్మల కాపరియు పాలకుడునయిన ఆయన వయిపునకు మళ్లియున్నారు'.

శ్రీయేసు మనుష్యాత్మల కాపరిగను అధ్యక్షుడుగను,

వుండుటకు దేవుడనుగ్రహించెను. దీనివల్ల పేతురుబ్రతుకు కనబడుచున్నది. అయితే సిలువమీద ఈసత్యము మరీ తేటగా బయలుపరచబడినది. నిరాధారుడును, దౌర్భాగ్యుడునయిన నేరస్థుడొకడు శిలువమీద వ్రేలాడుచున్నాడు. అస్వడంతకుపూర్వ మెప్పుడయినను వాడు శ్రీయేసును చూచియుండకుండవచ్చును శ్రీక్రీస్తుకంటే ముందుగానే పెడుకొను వీడు ఆశిలువనుకొట్టబడినట్లు నేనుతలంచుచున్నాను. అతడు తన శిలువ నెత్తుకొని యేసును వెంబడించలేదు. అతడు శ్రీయేసును విశ్వసించకయే జీవించినట్లు చావబోవుచున్నాడు. అయితే పశ్చాత్తాపపడిన దొంగతన శిలువ నెత్తుకొని యేసును వెంబడించెను. మరణమునకయి నడచిన ఆదుఃఖకరమార్గమందు జరిగినవాటి నన్నిటిని విని చూచి చింతాక్రాంతుడాయెను. శ్రీయేసుతన పాపములను శిలువమీదికి మోసికొనిపోయెననియు ఆయన దెబ్బలవలననే తాను గుణపడవలయుననియెరిగెను. అతడు మరణముపొందేటప్పటికి తానెట్లు తప్పిపోయినది గ్రహించెను. గనుక ముండ్ల కిరీటము కలిగి చీలలతో గుచ్చబడి తన ఆత్మకాపరియు అధ్యక్షుడు నయినవారికి మొరబెట్టినవాడై యుండెను. మరియొకదొంగ దుష్టహృదయముతో ఆయనను నిందింపనారంభించెను. అయితే మొదటి దొంగ వీని గద్దించిన పిమ్మట తాను అయోగ్యుడనని గుర్తెరిగి తన చెడిపోయిన ఆత్మనుగూర్చి నిట్టూర్పు విడుచుచూ మిక్కిలి వినయముతో 'యేసునిచూచి ప్రభువా నీవు నీరాజ్యములో వచ్చునప్పుడు నన్ను జ్ఞాపకముచేసికొనుమనెను. అందుకాయన వానిచూచి నేడునీవు నాతోకూడ పరదైసులో నుందువని నిశ్చయముగా నీతో చెప్పుచున్నాననెను'. ఆహా ఎంతటి మార్పు! వానికి శరీరబాధ యిక లేకపోయెను. అతని హృదయము కొట్టుకొనుచుండగా 'నేను రక్షింపబడితిని' రక్షింపబడితిని, శ్రీయేసును కనుగొంటిని

శ్రీయేసు నా ఆత్మకు కాపరియు, అధ్యక్షుడునయి యున్నాడు. హల్లెలూయా, హల్లెలూయా' అని ఆ క్షణము రక్షింపబడిన పాపివలె చనిపోయి పరదైసునకు వెళ్ళెను. ఇప్పుడు శ్రీయేసు నీఆత్మయొక్క కాపరియు. అధ్యక్షుడునయి యున్నాడు. ఆయన నావాడు, హల్లెలూయా ఆయన నావాడు.

మనము శిలువను విడువకుందుముగాక. శిలువయొక్క మర్మమును వర్ణించుటకు మాటలు చాలవు. జనులాయనను ఇంకా అపహసించుచుండినను ఆయన తాను వచ్చినపని నింకా బయలుపరచుచున్నాడు. ఆయనతన్ను తానురక్షించుకొనుటకు రాలేదుకాని పాపులను రక్షించుటకు వచ్చెను. ఆయన అందరి రక్షకుడై యుండుటకు దేవుడనుగ్రహించెను. ఆహా నాప్రభువైన శ్రీయేసు ఎట్టిరక్షకుడు!

## శ్రీయేసు తన జనుల శరీరక్షేమము మాత్రమేగాక

వారి నిత్య క్షేమమును వెదకుచున్నాడు. ఆయన శిలువలో దొంగను శత్రువులను మాత్రమేగాక తన స్వకీయులను గూర్చియు తలంచెను. సువార్త సేవకుని పేరు వహించిన క్రైస్తవులలో అనేకులు తన స్వకీయులనుగూర్చి జాగ్రత్తదీసికొనకుండుట నెన్నోమారులు చూచియున్నాము. ఇతరులనుగూర్చి తలంచబోయి తమ కుటుంబములను అలక్ష్యపెట్టిరి. ఇతరులనుగూర్చి చూడబోయినందున నాకుటుంబమును చూచుటకు నాకు సమయము లేదని చెప్పుట నేనెప్పుడు నమ్మజాలను. మనము చేయవలసిన పనులు వీటికి అడ్డమురావు. నా మొదటిపని నాకుటుంబమునుగూర్చి జాగ్రత దీసికొని వారిని రక్షించుటయే. మేము మిషనెరీలమయినందున మాబిడ్డలను విడచి చాలా సంవత్సరములు దూరదేశములలో పని చేయుచుండినను వారందరు శ్రీయేసు యొక్క దొడ్డిలో క్షేమముగా నున్నందుకు దేవునికి స్తోత్రము. నేను శ్రీయేసును సేవించుచుండగా నాబిడ్డలు సైతానును సేవించుచుంటే ఎక్కడనో ఒకచోట నేదో ఒకతప్పు వుండవలెను. గనుక నాస్వంతబిడ్డలు తప్పిపోయి వున్నంతవరకు నేనితరులకు ప్రకటించుట న్యాయమని నాకు తోచుట లేదు. నాబిడ్డలు అమెరికాలో పాపముచేసి నశించుచువుంటే నేను ఇండియాలో వుండనేవుండను.

శ్రీయేసు మనకొక మంచి మాదిరియని నమ్ముచున్నాను. మన మితరులను రక్షించేవారము మాత్రమేగాక ముఖ్యముగా మనలను మనము రక్షించుకొనవలయును మన స్వకుటుంబికులను రక్షింపవలయును. దేవుడు శ్రీయేసును మన రక్షకునిగా ఇచ్చి

నది చూడుము, 'ఆయన తల్లియు ఆయన తల్లి సహోదరియగు, క్లోపా భార్యయు నయిన మరియయు, మగ్దలేనే మరియయు శ్రీయేసు శిలువయొద్ద నిలుచుచుండిరి. శ్రీయేసు తనతల్లియు తాను ప్రేమించిన శిష్యుడును దగ్గర నిలుచుట చూచి అమ్మా ఇదిగో నీకుమారుడు. అని తన తల్లితో చెప్పెను. తరువాత శిష్యుని చూచి యిదిగో నీ తల్లి అని చెప్పెను. ఆగడియనుండి ఆశిష్యుడామెను తనయింట చేర్చుకొనెను. మొదటి అనాథశాలలు, మొదటి వైద్యశాలలు, బీదలకొరకయిన మొదటయిల్లు విధవల శరణాలయము, వృద్ధాశ్రయము ప్రసవ గృహము, మరణము నొందనైయున్న రక్షకునివలన శిలువమీద స్థాపింపబడెను. శ్రీయేసును లోకరక్షకునిగా దేవుడను గ్రహించెను. నీవు ఆయనను అనుసరించి నడుచుకొనుచున్నావా? శ్రీయేసు శిలువయొద్ద నిలుచున్నావా? ఇతరులను రక్షించుకొరకు నీవు రక్షింపబడితివా? క్రైస్తవులవలనయినను వారి ప్రోత్సాహమువలనయినను తప్ప వేరేవిధముగా క్రైస్తవులు కాని వారుండు దేశములలో శరీరాత్మల రక్షణార్థమై శాలలు కట్టింపకుండుట ఏమి విపరీతము?

శిలువయొద్ద పరలోకమును కొంతమట్టుకు చూడగలము. అయితే మధ్యాహ్నమునందలి కటిక-చీకటియందు నశించినవారమున నరకము కొంతమట్టుకు దర్శన మగుచున్నది. నరకమనగా ఏమిటని అడిగితే ఆగాఢాంధకారమయిన చీకటితో నిండిన మధ్యాహ్నవేళలో నిన్ను శిలువయొద్దకు తీసికొనిపోయి ఆయనయొక్క అత్యధికమయిన వేదనలో 'నాదేవా, నాదేవా, నన్నేందుకు చేయి విడచితివి' అని పలికిన అరుపును వినముందును. అదే నరకము. నశించిన ఆత్మ నిరాధారమైనదిగా విడువబడెను. దేవుడిచ్చిన ఆత్మ నశించెను. దేవునివల్ల నిత్యము విడువబడెను. నరకమునుండి రక్షింపబడుటకు నాదేవా నాదేవా నన్నెందుకు చెయ్యివిడచితివని అరచినట్లు నీవును, నేనును శ్రీయేసునందు విశ్వాసముంచుట ద్వారా నరకబాధనుండి విడిపింపబడుటకై ఆయన యొక్కడనే నరకవేదనలను సహించెను. నరకమనగా ఏమిటో నీవిప్పుడు గ్రహించకుంటే నీచెడిపోయిన స్థితివల్ల నీకురానైయున్న భయంకరమయిన అపాయమును గూర్చియు, నీవు వెగిరపడుచున్న నీదుర్గతిని గూర్చియు, నిన్నురక్షించుటకై శ్రీయేసు ఎక్కడనుండి వచ్చెనో ఆపరలోకమనగా ఏమిటో నీవు బొత్తిగా గ్రహింపలేవు. నీవు రక్షింపబడ గోరుచున్నావా? నీరక్షకుడు నీకొరకు చాపిన చేతులను యిప్పుడు పట్టుకొనుమా!

## శ్రీయేసు శిలువమీద నుండినప్పుడు కలిగిన చీకటిని

ఆయన అరచిన నిరాశగల అరుపును ఈ చెడిపోయిన లోకమునకు సత్యవిశ్వాససాక్షిగనై యుండునట్లు దేవుడు తనజనితైక కుమారుని యిచ్చెననుటకు గురుతై యున్నది. రాబోవు ఉగ్రతను తప్పించుకొనుటకు మనకు హెచ్చరించునప్పుడు ఆయన దేనిని గూర్చి మాటలాడినది ఆయన ఎరుగును. ఆయన సత్యసాక్షి, దైవహతసాక్షి.

## ఇప్పుడు నీవు శ్రీయేసు యొద్దకువచ్చి రక్షింపబడెదవా?

నిన్ను కనుగొనుటకు ఆయన తన్నుతాను పోగొట్టుకొనెను. ఆయన ప్రథమ సాక్షి. క్రైస్తవమతము కొరకు నమ్మకముగను, న్యాయముగను చనిపోయిన ప్రథమహత సాక్షి. దేవుడు తనజనితైక కుమారుని తన సంఘమునకు నిత్యసాక్షిగను, నమ్మకమయిన నిజహతసాక్షిగనుండుటకై యిచ్చెననే సంగతిని గతయిరువది శతాబ్దములలో లక్షల, లక్షల జనులు గ్రహించి యుండిరి. మరియు అనేకులాది జనులు తమ ప్రాణములను సంతోషముతో మరణమున కప్పగించిరి. ఎందుకనగా వారియందుగల ఈ విశ్వాసమును పరికము అపహరించలేదు. దేవుడు తన కుమారుని మన పక్షమున సాక్షిగా నుండుట కనుగ్రహించెను. అపొస్తలుడయిన యోహాను పలికిన మాటలను వినుము. 'యోహాను ఆసియాలోనున్న ఏడు సంఘములకు శుభమని చెప్పి వ్రాయునది. వర్తమాన, భూత, భవిష్యత్కాలములలో నుండుచున్నవాని నుండియు, ఆయన సింహాసనము ఎదుటనున్న యేడుఆత్మల నుండియు, నమ్మకమయిన సాక్షియు మృతులలోనుండి ఆదిసంభూతుడుగా లేచినవాడును, భూపతుల కధిపతియైన శ్రీ యేసుక్రీస్తు నుండియు కృపాసమాధానములు మీకు కలుగును గాక. మనలను ప్రేమించుచు తన రక్తమువలన మన పాపములనుండి మనలను విడిపించినవానికి మహిమయు, ఆధిపత్యమును, యుగయుగముల వరకు కలుగును గాక. ఆమేన్ ఆయన మనలను తనతండ్రియగు దేవునికి ఒక రాజ్యముగాను యాజకులనుగాను కలుగజేసెను. ఇదిగో ఆయన మేఘారూఢుడై వచ్చుచున్నాడు, ప్రతినేత్రము ఆయనను చూచును. ఆయనను పొడిచినవారును చూచెదరు. భూమినివాసులందరు ఆయనను చూచి రొమ్ము కొట్టుకొందురు; అవును ఆమేన్' దేవుడు తన ప్రేమనుగూర్చి నమ్మకమయిన నిజసాక్షిగనుండ శ్రీయేసును దయచేసెను. ఆయననుగూర్చి సాక్షులమై యుండునట్లు మనను లోకమున కిచ్చెను. 'ఆ పండుగలో మహాదినమయిన అంత్యదినమున శ్రీయేసు నిలచి - ఎవడయినను దప్పిగొనిన పక్షమందు నాయొద్దకువచ్చి త్రాగ

వలెను. నాయందు విశ్వాసముంచువాడెవడో లేఖనము చెప్పినట్లు వాని కడుపు
లోనుండి జీవజలనదులు పారునని బిగ్గరగా చెప్పెను. తనయందు విశ్వాసముంచు
వారు పొందబోవు ఆత్మనుగూర్చి ఆయన యీమాట చెప్పెను. శ్రీయేసు యింక మ
హిమపరచబడలేదు. గనుక ఆత్మ యింక ననుగ్రహింపబడి యుండలేదు.' యోహా
ను 7-వ అధ్యాయములోని మాటలు హగ్గయి 2: 6-7-వ వచనములలోని మాటల
నెరవేర్పు కాదా?' మరియు సైన్యముల కధిపతి యగు యెహోవా సెలవిచ్చువదేమ
నగా ఇక కొంతకాలము యింకొకమారు ఆకాశమును భూమిని సముద్రమును నేలను
నేను కంపింపచేతును. నేను అన్యజనులందరిని కదలింపగా అన్యజనులందరియొక్క
ఇష్టవస్తువులు తేబడును; నేను యీమందిరమును మహిమతో నింపుదును. ఇదే
సైన్యముల కధిపతియగు యెహోవా వాక్కు.

## ఏలాగయినను శ్రీయేసు సర్వజనాంగముల కోరిక.

యగుటకుముందు 'నేను దప్పిగొంటిని' యను మహావేదనతో మొరబెట్టవలెను. ఇట్లు
శ్రమ పొందినవాడుమాత్రమే శ్రమ పడువారితో పరితపించి సహాయము చేయగలడు.
పాపము ప్రతిదినమందును, ప్రతినిమిషమందును, ఆత్మవేదనతో మనుష్యుడు మొరబె
ట్టునట్లు చేయును. 'దుప్పి నీటివాగులకొరకు ఆశపడునట్లు దేవా నీకొరకు నా ప్రా
ణము ఆశపడుచున్నది. నా ప్రాణము దేవునికొరకు తృష గొనుచున్నది. జీవము
గల దేవునికొరకు తృష్ణగొనుచున్నది. దేవుని సన్నిధికి నేనెప్పుడు వచ్చెదను? ఆయ
న సన్నిధిని నేనెప్పుడు కనబడెదను' ఈ ప్రాణతృష్ణ యెట్లు తీరును? దేవుడు తన
నుగూర్చి తృష్ణగొనుచున్న ఆత్మలను తృప్తిపరచగలిగినట్టియు, పరమునున్నట్టియు ఒ
క్కడయిన శ్రీయేసును మాత్రమే ఈయుగములన్నిటికొరకు నిచ్చియున్నాడు. తృష్ణ
గొను మన ప్రాణాశలను యేసు మనకంటె బాగుగా నెరుగును. మన ప్రతిఆశను
ఆయన తృప్తిపరచగలడు. శ్రీయేసు సర్వజనాంగముల కోరికయయి యుండునట్లు
దేవునివల్ల మనకియ్యబడినాడని గ్రహించుచున్నావా? నీవీపిలుపును వినినయెడల
యిట్లు పాడుము.

ఇచ్చయించెవాడు యిచటికి - వచ్చి జీవజలంబు రుచిగా-
పుచ్చుకొను గాకనుచు బల్కెను - సచ్చరితుడు మనుష్యపుత్రుడు
జీవజలమును దాగిపుటకుమీ - భావనలనెడి పాత్రముంచుచు
చెవగొని పానించుచు నిరత - జీవమున వెలుగొంది బ్రతుకను ॥ము॥

ఆయన సర్వజనాంగములకొరకయని అంగీకరించి ఈనిత్యజీవమునకు పూరెడి నీటిబుగ్గనుండి త్రాగిన వెనుక విమోచింపబడినవారందరితోను నాతోను కలసియిట్లు పాడుము.

నిజభక్త హృదయానందమై యొన్నడుదాహ-
ము జనింపనీ నిజీవోదకంబు=వృజినాగ్ని వ్యధచేత-
వెతనొందు వేదాత్రిన - నిజముగా నొసగికాంతిని
బొందించెదు ॥యేసునామ॥

తృప్తి, తృప్తి, తృప్తి. రక్షింపబడిన క్రైస్తవ సమూహ మేకగ్రీవముతో పాడు స్తోత్రగీత మిదే. దేవుడు తనకుగూర్చి తృష్ణ గొనునట్లు చేసెను. తన జనితైక కుమారు నిచ్చుటద్వారా ఆయనే మనదప్పి తీర్చును. అందరు ఆయనను వెదకుదురుగాక! మాటికి మున్మాటికి ఆయనను కనుగొనినవారే ధన్యులు.

## మనము శ్రీయేసు శిలువయొద్దనిలచినప్పుడు

మొందట మన హృదయములు దుఃఖముతో నేల వంగును గాని ఆచీకటి కనుపడకుండా పోయినప్పుడు వెలుగు మన ఆత్మలో ప్రవేశించును. అప్పుడుమనము మహా సంతోషముతో 'దేవునికి స్తోత్రము, శ్రీయేసు జయించుచున్నాడు! చివరకు భయంకరమైన పోరాటము ముగిసెను గనుక జయశీలుడయిన శ్రీయేసు సంతోషకేక వేయును, అని పలికెదము. 'సమాప్తమాయెను' రక్షణ కార్యము ముగిసెను. పాతసర్పపు శిరస్సు చితకగొట్టబడెను. ఇక నెప్పుడయినను శ్రీయేసుజోలికిరాను సాహసింపదు. అదితన శక్తియైనంతవరకు చేసెను. శ్రీయేసును చంపునంతవట్టుకు తన దుష్టత్వమును చూపెను. ఆయనను చంపుటద్వారా నిత్యాంధకర ఏలుబడిని స్థాపించెనుగాని మన ఆత్మల సూర్యుడయిన శ్రీయేసు దానిజయించి ప్రతి విశ్వాసిహృదయమును చెప్పనలవిగాని వెలుగుతో నింపెను.

దేవుని జనితైక కుమారుడయిన శ్రీయేసు మనయందు విశ్వాసమునారంభించు వానిగా మాత్రమేగాక దాని ముగించువానిగ నియ్యబడి యుండెనని శిలువయొద్ద నేర్చుకొనుచున్నాము. మన విశ్వాస మహిమలు జయశీలుడయిన శ్రీయేసే. ఆయన రాజ్యము నిత్యమయినది. ఆయనయొద్దకు వచ్చువారందరు భయపడ నక్కరలేదు.

నెను. ఆయన ఈలాగు చెప్పి ప్రాణము విడచెను. శతాధిపతి జరిగినది చూచి ఈ మనుష్యుడు నిజముగా నీతిమంతుడై యుండెనని చెప్పి దేవుని మహిమపరిచెను. వీటిని చూచుటకు కూడివచ్చిన ప్రజలందరు జరిగిన కార్యములు చూచి రొమ్ములను కొట్టుకొనుచు తిరిగి వెళ్ళిరి.

## దేవుడనుగ్రహించిన గొప్పదానమునుగూర్చి ఆయనను స్తోత్రింతము.

సందేహించు ఆత్మా సంతోషించుము. నీసందేహములు, భయములు శిలువయొద్ద మటుమాయమయి పోయెను. శిలువమీద నీ క్రింది మాటలు వ్రాయబడినట్లు చూడగలము. శ్రీయేసు పాపుల పక్షవాదిగా నుండుటకును, నిరాధారులయి చెదిరి తిరుగుచున్న పాపుల ఆత్మలకు కాపరిగాను, అధ్యక్షునిగాను, నిత్యానిత్యము లయినవాటి కన్నిటికి రక్షకుడుగను, ప్రేమగల తండ్రియొక్క క్షమాపణనుగూర్చి మన హృదయమందు సాక్ష్యమిచ్చుటకై నమ్మకమైన సాక్షిగను, సర్వ జనాంగముల కోరికగను, మనము దప్పిగొనకుండునట్లు జీవజలముగను, ఆయన చేతిలోనుండి మన నెవడు అపహరింపకుండునట్లు విశ్వాసముయొక్క ఆరంభము దాని కొనసాగించువానిగను, చివరను మన పునరుత్థానముగను, జీవముగను వుండునట్లు దేవుడనుగ్రహించెను. ఆయన జీవించుచున్నాడు గనుక మనము జీవింతము. ఆయన తిరిగి లేచెను. గనుక మనము తిరిగి లేతుము. ఆయన ఏలుచున్నాడు గనుక మనమును ఏలుదుము. హల్లెలూయా, హల్లెలూయా. ఆమెన్.

శ్రీయేసు ఎల్లప్పుడు మనతో నున్నాడు ఎందుకనగా 'ఇదిగో నేను యుగాంతపర్యంతము దినములన్నియు మీతోకూడ నున్నాను' అని చెప్పుచున్నాడు. కాబట్టి మనము భయపడక ప్రార్థింతము.

ఎందుకె చింతించెదవు-నాడెందమా నీకందరు = ఇందాక రక్షించె నా-డికను
నిన్ను విడువబోడు॥ ఎందుకె॥

తొల్లి నీవొనరించినట్టి-దోష మెంతో యరసి చూడు- చెల్లచెదరై పరచు తరిని
చెయ్యిగా నపట్టినాడు-అల్లుకొని వనీదుర్గుణము-లణగదొక్కి వేసినాడు
తల్లడిల్లకేయు నీకా-త్రివులనరి మిబోధించినాడు = వల్లగాదన్నాడా నేడు-
వస్తు సందేహములు వీడు॥ ఎందుకె॥

తలయెత్తరానిచోట-గళలిచ్చి నిలిపినాడు-పలుమారు నీయక్కరలు
తెలిసియందిచ్చినాడు-బలహీనమపుడునీకు-నిర్భయమియ్యవచ్చెడువాడు-
పలువిధంబులగుబాధల-బారదోలివేసినాడు=శెలవిప్పుడులేదన్నాడా-
నీతోనిక సరియన్నాడ॥ ఎందు॥



VI అధ్యాయము.

# WHOSOEVER:—ప్రతివాడు.

నేను సెలవుమీద అమెరికాకు మొదట వెళ్లినప్పుడు న్యూయార్కు పట్టణములో నొక చిన్న జర్మని సంఘమునకు అధ్యక్షునిగా నేర్పరుపబడితిని. వారా పట్టణమందొక నూతన దేవాలయమును కట్టుపనియందుండగా పడమటిజిల్లాలందుండు జర్మనీ సహోదరులు మాకు సహాయము చేయరమ్మని పలుమారు పిలుచుచుండిరి. నేనక్కడికి ఉయాళువమైన భావముతో వెళ్లలేదని ఒప్పుకొనుచున్నాను. ఎందుకనగా నేను వెళ్లదలంచుకొనునప్పుడెల్ల ఆటంకములు కలుగుచుండెను.

క్యాన్సెసుకు వెళ్ళుటకు ఒకగొప్ప పట్టణములో పొగబండి మార్చ్వడ మాయెను. బండిలో కూర్చుండి యుండగా కోపముతో చిరచిరలాడుచుంటిని ఎందుకనగా నేను చాల అలసి ఆకలిగొని చాలసేపు రయిలుకొరకు కాచుకొని యుండుటవలన కోపము వచ్చుచుండెను. ఇట్లుండగా అప్పుడే వార్తాపత్రికల నమ్ము బాలుడు 'అయ్యా పత్రిక' యనెను. అందుకు నేను 'నాకక్కరలేదు వెళ్లిపో' అంటిని గాని ఆపిల్లవాని యుల్లాస ముఖమును చూచి నేనతని తిరిగి పిలిచి ఒకరూకనిచ్చి పత్రిక నిమ్మంటిని. ఆపిల్లవాడు చిరునవ్వుతో నొక పత్రికను నాకిచ్చి వందనమయ్యా క్షేమముగా వెళ్లుడని నుడివి పోయెను.

ఆపత్రికలో నేమి యున్నదోయని చూడ నారంభించి ఆద్యంత పుటలను చూచి దాని విప్పితిని. ప్రతి పుటలోను ప్రకటనలు దప్ప మరేమియు కనబడక పోయెను. ఈప్రకటనలలో నొకటి ఎర్రని సిరాతో గట్టిగా ముద్ర వేయబడి యుండగా దానిని జూచి అమెరికాకు ప్రకటనల పిచ్చిబట్టి యున్నదని విసుగు జెందితిని. ఆపత్రికయందు వర్తమానమునకంటె ప్రకటన లతివిస్తారముగా నుండుట మాత్రమే గాక కాకితముయొక్క ప్రక్కలనుండు తెల్లని ప్రదేశములమీద సహా ప్రకటనలుంచు నంతటి నూతన మోసములు చేయుచున్నారని తలంచి ఈవిచిత్ర ప్రకటనలు జదువ మనస్సు కలిగి అందు దేవుడు లోకము (అనగా నన్ను) ఆలాగుననే ప్రేమించెను.

కాగా ఆయన తన జనితైక కుమారుని యందు విశ్వాసముంచు ప్రతివాడును(అనగా నేను) నశింపక నిత్య జీవము (నేను) పొందుటకయి ఆయనను అనుగ్రహించెను' అను వాక్యమును ఆశ్చర్యానందములతో జదివితిని. ఈవింతయైన ప్రకటన నామనస్సు మీద ఆవరించియున్న మేఘమును తీసివేసెను. ఆహా క్యాన్సెను పచ్చిక భూములను వడిగ దాటి వెళ్లుచుండగా సమస్తము నాకెంతో ప్రకాశమానముగ నుండెను! నాహృదయ మెంతో సంతోషముతో ఉప్పొంగుచుండెను. నా జీవితకాలమందలి సంతోష దినములలో నది యొకటై యుండెను. 'ప్రతివాడు' అనగా నేను, నేను హల్లెలూయా నేను' అని పలికితిని. అప్రాముఖ్యమయిన దినమున సంతోషములో నాహృదయము నోలలాడిన సంగతి యోహాను 3: 16 వ. ను వినయముతోను, పశ్చాత్తాపముతోను, సంతోషముతోను, చదువునప్పుడెల్లను జ్ఞాపకమునకు వచ్చుచుండెను. 'ప్రతివాడు' అనగా నేను అను దీని భావమును నీవెరుగుదువా? ఎరుగకుంటే, ఎందు కెరుగవు?

యోహాను 3: 16 వ. లోని 'ప్రతివాడు' అను చిన్నపద భావమును కొంత మట్టుకిప్పుడు గ్రహించితిని. ప్రతివాడు అనగా 'అందరు' అని అర్థమిచ్చుచున్నది. ఈ చిన్నపదము మన

## దేవునిరక్షణ విశాలమై బలపరచునదై ప్రతివానిదిగనున్నదని

లోక మంతటికి ప్రకటించుచున్నది. నే నెరిగినంతమట్టుకు 'అందరు' అను పదము యొక్క పూర్ణార్థము బైబిలులోని ఒక వచనమందు మాత్రమే చెప్పబడి యున్నది. 'పరలోకమందును భూమిమీదను నాకు సర్వాధికార మియ్యబడి యున్నది. కాబట్టి మీరు వెళ్లి సమస్త జనులను శిష్యులగా జేయుడి. తండ్రి యొక్కయు కుమారుని యొక్కయు పరిశుద్ధాత్మయొక్కయు నామములోనికి వారికి బాప్తిస్మమిచ్చుచు నేను మీ కేయే సంగతుల నాజ్ఞాపించితినో వాటినన్నిటిని గైకొనవలెనని వారికి బోధించుడి. ఇదిగో నేను యుగసమాప్తి పర్యంతము సదాకాలము మీతోకూడ నున్నానని వారితో చెప్పెను. 'అన్నిటిని' 'సదాకాలము' అనునీ కడపటి రెండు పదములు ఒకరితో నొకరికి గల సంబంధమును తెలుపుచున్నది. 'అందరు' అను నీ పదమందిమిడియున్న మూడు అర్థములను యోహాను సువార్తయందు చిన్నదిగ నగుపడు 'అందరు' అను నీగొప్ప సువార్తయందు కనుగొనగలము.

శ్రీయేసుక్రీస్తుయొక్క రక్షణ భూగోళమందున్న సమస్త రాష్ట్రములను వశపరచుకొనగలుగునంత విశాలమైనందుకు దేవునికి వందనములు. శ్రీయేసు తన శిష్యులను సర్వలోకమునకు వెళ్ళి సర్వసృష్టికి సువార్త ప్రకటించుడని ఆజ్ఞాపించునపుడు తన రక్షణ సర్వజనులకొరకైనదని తెలుపుచున్నాడు. పౌలు ప్రభువునందు తన కుమారుడగు తిమోథెయునకు ఈ సత్యమును గ్రహించి ఇట్లు వ్రాసెను. 'పాపులను రక్షించుటకు క్రీస్తు యేసు లోకమునకు వచ్చెనను వాక్యము నమ్మతగినదియు, పూర్ణాంగీకారమునకు యోగ్యమైనదియునై యున్నది. అట్టివారిలో నేను ప్రధానుడను, పాపియైన ప్రతివాడు రక్షింపబడగలడనుట ఎట్టి సువార్త! పాపులలో ప్రముఖుడు రక్షింపబడెను. గనుక రక్షణ అందరికొరకు కలదు. 'పరిశుద్ధాత్మవశుడనై యున్న నన్ను ఎత్తయిన గొప్ప పర్వతము మీదికి కొనిపోయి యెరూషలేమను పరిశుద్ధ పట్టణము దేవుని మహిమ కలదై పరలోకమందున్న దేవునియొద్ద నుండి దిగివచ్చుట నాకు చూపెను. దానియందలి వెలుగు ధగధగ మెరయు సూర్యకాంతమువంటి అమూల్య రత్నమును పోలియున్నది. ఆ పట్టణమునకు ఎత్తయిన గొప్ప ప్రాకారమును పన్నెండు గుమ్మములు ఉండెను. ఆ గుమ్మములయొద్ద పన్నెండుగురు దేవమాతలుండిరి. ఇశ్రాయేలీయుల పన్నిద్దరు గోత్రముల నామములు ఆ గుమ్మములమీద వ్రాయబడియున్నవి. తూర్పువయిపున మూడు గుమ్మములు, ఉత్తరపు వయిపున మూడు గుమ్మములు, దక్షిణపు వయిపున మూడు గుమ్మములు, పశ్చిమ వయిపున మూడు గుమ్మములు ఉన్నవి. ఈ సర్వసాధారణ సత్యము తిరిగి చెప్పబడియున్నది. ద్వారములన్నియు అన్నిప్రక్కల నెందుకు తెరవబడి యుండెను? ఎందుకనగా అందరు లోపల ప్రవేశింపవలెను.

పశ్చిమము పశ్చిమంబే
నిశ్చయముగఁ దూర్పుతూర్పె నిజతీర్పవకున్
నిశ్చల భూనభములు మహా
గాశ్చర్యంబొందఁజేరు తఱినవికలయున్ ॥

ఈమాటలను జెప్పి నాయనకు ప్రత్యక్షమయిన

ప్రకారముగా యోహాను 3:16 వ. లోని సంగతి సరిపడదు. 'దేవుడు లోకమును ...ఇచ్చెను' అని పలికిన శ్రీయేసుగురుని మాటలు పై మాటలకంటె మంచివని యెంచుచున్నాను. శ్రీయేసునందు తూర్పుతూర్పు గాదు. పడమర పడమర గాదు, దక్షిణము

దక్షిణము గాదు, ఉత్తరము ఉత్తరము గాదు. ఆయనయందు సమస్తమొక్కటే.
భేదము లేదు. నూతనయెరూషలేముయొక్క అన్నిప్రక్కల ద్వారములు తెరువబ
డి యున్నవి. అందరు దానిలో ప్రవేశింపవచ్చును. వారు దానిలో ప్రవేశించిన
ప్పుడు తమ పాత స్వభావమును విడచి క్రీస్తు యేసుయందు నూతనసృష్టి యగుదురు.
వారెప్పు డెక్కడ కలసికొందురో అక్కడ వారేకమౌదురు.

మలయా పర్యాయా ద్వీపమందలి పేరాకుయొక్క అడవులలోకి నాతో రమ్ము.
మోటుజనులయొక్క సమూహము చూడుము. వీరిని కన్నులారా జూచినవా డొక
డిట్లు వివరించుచున్నాడు.—అక్కడొకచోట నానావిధ వయస్సుగల స్త్రీపురుషులు
పిల్లలు దాదాపు 50 మందిగల మద్దిజనులు గుడిసెలలో నివసించుచున్నారు. వారా
పర్యాయ ద్వీపములోని, నిస్సారమైన భూములు దున్నుచు, సౌఖ్యములేని ఇండ్ల
లో నివసించుచు, దుఃఖకరమైనటువంటివిని, దిక్కుమాలినటువంటి రీతిలో జీవించు
చు జనులవల్ల అణగద్రొక్కబడిన అనాదిజనులు. పురుషులు, పిల్లలును, పడుచు
స్త్రీలును బొత్తిగా వస్త్రములులేక యుందురు ఇతరులు చెట్లపట్టలతో చేయబడిన బ
ట్టలను చుట్టుకొందురు. కొండలపైని అతివిస్తారమైన చలి. ఎందుకనగా వర్ష
మువలన నడవిప్రదేశములన్నియు తేమగలవి. ఆకాశమునుండి వర్ష మతివిస్తారముగ
కురియునప్పుడు వారు చెట్ల ఆకులక్రిందను కొమ్మలక్రిందను కూర్చొందురు. వారికి
సరియైన ఆదరణ లేనందున గుడిసెలలోనున్న ప్రతిదియు తడిసి బంకబంకగానుండు
ను. వారు గట్టిగా గొంతు కూర్చుండి కాళ్లుచేతులు బూడిదెలో జొరబడునట్లు
నిప్పుల మంటయొద్దకు జరిగిజరిగి పోదురు. అప్పుడప్పుడు వారిలో నెవరివో ఒకరి
పండ్లు చలివేత కొణుకుచుండును. పిల్లల వేళ్లు ఎడతెగకుండా వెక్కివెక్కి ఏడ్చు
చూ చపలచిత్తులై యుందురు. స్త్రీలు మౌనముగా నుందురుగాని పురుషులు విప
రీతమయిన ఏకాక్షర శబ్దములతో వేరువేరు విధముల నెల్లప్పుడు మాట్లాడుచుందురు.

వారిలో ననేకులు తేమగల అడవులవలనను హీనమైన భోజనమువలనను
తల మొదలు పాదములవరకు కుష్ఠరోగముగలవాని దేహమువలె నగపడుచుందురు.
తేమ వారికెక్కువ శరీరబాధను కలిగించినందున కస్తూరివంటి గోళ్లతో గోకులవలె
గ్గనుకొందురు. ఈగుంపును చూడుము. ఈ యాడవి జనులను వారిని పట్టణమం
దుండు నాగరికులును, ధనికులునైన వారితో పరిపోల్చును. ఫ్రాన్సుదేశపు శాస్త్ర
పాఠశాలలోని వారు పొందు పత్రం సంపూర్ణముగా అనాగరికులైన ఈబీదలు

పొందుటకు సాధ్యమని నమ్ముచున్నావా? ఈ రెండు తరగతులు కలుసుకొనగలవా? అవును కలుసుకోగలవు. వారందరికి ఒక్కే రక్షణ కలదు. ఎందుకనగా అందరు పాపులే. క్రీస్తు యేసునందు అందరు ఒకటి కాగలరు. ఆయనయందు విశ్వాసముంచు వారందరిని రక్షించుటకు వచ్చెను.

## బాపట్లలోని కుష్ఠరోగులశాలకు రమ్ము

ఇదిగో ఇక్కడొక గుడిసెలో నొకకుష్ఠరోగి చనిపోవుచున్నాడు. ఇతర కుష్ఠరోగులు భయముతో వానిని చుట్టు నిలువబడి యున్నారు. మరణము, విద్యావంతులు, గొప్పవారునగువారికి మాత్రమే కాక అనాగరికులకును భయంకరముగ కానుపించును. కుమారులగు ఈదీనజనులు తమవలె బాధపడుచుండు నొకడు కాలమునకును, నిత్యత్వమునకును, మధ్య పొలిమేరమీద నిలచియుండుట చూచిరి. వెంటనే మరణించుచున్నవాడు పశ్చాత్తాపభరితుడై మహిమ మహిమ! ఆకాశము తెరువబడి యుండుట చూచుచున్నాను. శ్రీయేసు చేతులు చాపుకొని నిలువబడి నన్ను రమ్మని సైగ చేయుచున్నాడు. ఆహా, ఎంతటి అంగీకారము! ప్రభువా శ్రీయేసు ఇదిగో ప్రభువైన శ్రీయేసు నేను వచ్చుచున్నాను. ఎంతటి, దర్శనము! నూతన యెరూషలేముయొక్క ద్వారములు తెరువబడి యున్నవి. పూర్వకాలమందలి లాజరువంటి కుష్ఠరోగి దూతలచేత మోయబడి ద్వారములగుండా శ్రీయేసు చేతులలోనికి తీసికొనిపోబడెను. ఇతరులు నిలువబడిరి యీయూ పాంతిక విషయము చూచినప్పుడు పరలోకమందు శ్రీయేసునాథస్వామితో నుండుటకయి చెప్ప వలవిగాని ఆశతో నిండిన హృదయములయిరి. ఈమహిమపర్చబడిన కుష్ఠరోగి ఈశాలలో ప్రవేశించకముందు పేరాపులలోని అడవిజనులవలె నుండెను. ఇప్పుడతడేసుతో నున్నాడు. అవును దేవుడు నిన్నును నన్నును అలాగుననే ప్రేమించెను. ఎందుకనగా మనయందరి కొరకు శ్రీయేసు నంగీకరించువారి నందరిని రక్షించుటకొరకు ఆయన నిచ్చెను. నీవు రక్షింపబడి యున్నావా?

అయితే శ్రీయేసు రక్షణ, అందరి రక్షణయై యున్నది. మనయజమానుడు తన ఆరోహణమునకు ముందు 'సర్వాధికారము నాకియ్యబడి యున్నదని చెప్పెను. ఆకాశమందును భూమిమీదను కొంత అధికారముగాక సర్వాధికారమియ్యబడి యున్నదని దృఢముగా చెప్పుచున్నాడు. ఆయన సర్వశక్తుడు కాబట్టి ఆయన రక్షణ అందరి రక్షణయై యున్నదిగాని కొందరి రక్షణ కాదు.

పౌలు I థెస్స 5: 23 వ.లో 'సమాధాన దేవుడు తానే మిమ్మును సంపూర్ణముగ పరిశుద్ధపరచును గాక. మరియు మీ ఆత్మ, జీవాత్మ దేహమును ప్రభువైన శ్రీయేసుక్రీస్తు వచ్చునప్పుడు నిర్దోషముగా పూర్తిగా కాపాడబడును గాక' అని వ్రాయుచున్నాడు. ఆయన యోహాను 3: 16 వ. లోని 'ప్రతివాడు' అనుదాని నొక్కి వక్కాణించుచున్నాడు. ఆత్మ, జీవాత్మ, దేహము కాపాడుట సంపూర్ణ రక్షణయై యున్నది. మనుష్యునిలోనుండు దేవుని కొద్దిభాగమయిన ఆత్మ మన ప్రభువయిన శ్రీయేసుక్రీస్తు యొక్క రాకడలందు తండ్రిలో తిరిగి సంయుక్తపర్చబడుటకు దేవునివైపు చేర నెల్లప్పుడు ప్రయత్నపడుచుండును. మనలోని తలంపులను, యిచ్ఛలను బుట్టించి మన వ్యక్తి శరీరములమీద ఏలుచుండు జీవాత్మ మన ప్రభువైన శ్రీయేసుక్రీస్తు యొద్దకు వచ్చునప్పుడు తన సృష్టికర్త యొద్దకు తిరిగి వెళ్ళును. పాపముల చేతను, అపరాధముల చేత నిండిన ఈ దుర్మార్గ దేహము మన ప్రభువైన శ్రీయేసుక్రీస్తు వచ్చునప్పుడు క్షణములో లేచును. లేక మార్చబడును. అప్పుడు నిజముగా సంపూర్ణరక్షణ కలుగును. త్రిత్వమయిన మనిషి త్రిత్వమయిన దేవునితో పొందిక కలిగియుండును. సంపూర్ణరక్షణ. ఆహా దీని నెంతగా నాశించుచున్నాను! సమస్తాటంకములనుండియు, కాలస్థల నిర్ణయముల నుండియు, పాపముల నుండియు, విడిపింపబడి సంపూర్ణముగా రక్షింపబడితే వాస్తవముగా అదెంతో ఆనందము. మనము శ్రీయేసుక్రీస్తునందు విశ్వాసించితే అట్టి రక్షణ నీదియు నాదియు నగును.

యోహాను 3. 16 వ. లోని 'ప్రతివాడు' అను పదమును మరియొకసారి చూతము. ఎందుకనగా ఇతరమయిన వాటికన్న నిది ఎంతో ఆనందకరమయినది. దాని భావము నేనును నీవును అయి యున్నది. అది నీవు, నేను అని తెలియపర్చగలిగినంత విశదముగా తెలియపర్చబడి యున్నది. అది ప్రతివానికి ప్రత్యేకపరచి చెప్పుచున్నది. 'దేవుడు లోకము ఆలాగున నే ప్రేమించెను. కాగా ఆయన తన జనితైకకుమారునియందు విశ్వసించు ప్రతివాడును నశింపక నిత్య జీవము పొందుటకై ఆయన నిచ్చెను'. శ్రీయేసు లోకాంతము వరకు తన వ్యక్తులతో నుండినట్లు ఆయనయందు విశ్వాసముంచు ప్రతివానితోను ఆయన రక్షణ ఆలాగు నుండును.

## నాతో తిరిగి కలువరి యొద్దకు రాగోరెదను.

ఇద్దరు దొంగలను, శిలువమీది, శ్రీయేసును చూతుము పశ్చాత్తాపపడిన దొంగ బాధపడుచున్నాడు. తుదకు వాని కాళ్లు విరవబడినప్పుడు చనిపోయెను. ఒకడు

నిత్యత్వములోనికి ప్రవేశించెను. పశ్చాత్తాపపడని దొంగ కాళ్లు కూడ విరువబడెను. వాడు ప్రాణములు పోవుచు మూల్గెను. వీరిద్దరు మరణించుటకు ముందే క్రీస్తుయేసు తన ఆత్మను విడచెను. పశ్చాత్తాపపడిన దొంగ ఆయన వెంట పరదైసుకు రానై యున్నాడు. గనుక అతనిని చేర్చుకొనుటకు కాచుకొని యుండెను. రెండవవాడు మెడ వంచని గర్విష్ఠుడై తెరదాటి నరకములో ప్రవేశించెను. ఇక్కడ దొంగకు కలిగిన రక్షణయు, ఒక్కనికి కలిగిన శిక్షయు నగుపడుచున్నది. ఇదే ప్రతివానికిని అందరికిని కలుగవయియున్న భాగముగాని రక్షణ నావదగునట్లు చేసికొనుట మనవిధి. హెన్రీ మూరు హౌసు అనుదొరగారు భాగ్యవంతురాలగు నొక యువతిని మూడు ప్రశ్నలడిగెను. నీవు రక్షింపబడినావా? లేక ఇప్పుడు రక్షింపబడగోరుచున్నావా? ఆమె కొంత సందేహించి అవును, కోరుచున్నాననెను. తరువాత యెషయా 53.అ. చదువుము 'మేము' లేక 'మనము' అనుమాటవచ్చు ప్రతిస్థలమందును 'నేను' అని పెట్టి చదువుమనెను. అప్పుడామె యిట్లు చదివెను. 'నిజముగా ఆయన నారోగములను భరించెను. నా వ్యసనములను వహించెను. అయినను మొత్తబడినవానిగాను, దేవునివలన బాధింపబడినవానిగాను శ్రమనొందినవానిగాను నేనతని నెంచితిని. నా అతిక్రమక్రియలనుబట్టి అతడు గాయపరచబడెను. నా దోషములనుబట్టి నలుగగొట్టబడెను. నా సమాధానార్థమయిన శిక్ష అతనిమీద పడెను. అతడు పొందిన దెబ్బలచేత నాకు స్వస్థత కలుగుచున్నది.' ఈ మాటలను చదివిన వెనుక ఆమె మహా దానందముతో 'ఇప్పుడు నేను రక్షింపబడి యున్నాను'; అనెను. అవును ఇప్పుడు నీవు రక్షింపబడి యున్నావని' ఆయన ప్రత్యుత్తర మిచ్చెను.

మరణము ఏలాగు ఒక్కొక్కనికి కలుగునో ఆలాగు రక్షణయు ఒక్కొక్కనికి ప్రత్యేకముగా కలుగనయి యున్నది. ప్రతి మనుజుడు చనిపోయి దేవుని న్యాయ పీఠముముందు ఏలాగు నిలువవలెనో ఆలాగు అందరు ప్రత్యేకముగ రక్షింపబడవలెను; లేనా, నశింపబడవలెను. నీవు రక్షింపబడి ఒకరిగా నగుపడగోరుచున్నావా? లేక నశించినవాడవుగా నగుపడగోరుచున్నావా?

## యోసేపు కుక్ అను మహనీయుడు

చనిపోయినప్పుడు అమెరికా పత్రికలయందొకదానియందీసంగతి నగుపడెను. గత వారమందు 50 సంవత్సరములు బ్రతికిన యొక మహా ఘనులలో నొకడు పరలోకమునకు కొనిపోబడెను. బైబిలునందు చెప్పబడినట్లు ఆయన 'సత్యము నిమి

త్తము పోరాడిన యదార్థశూరుడయి యుండెను. షికాగో పట్టణమందు లోకము యొక్క వినోదవస్తుప్రదర్శన కార్యము జరిగించబడినప్పుడు పేరుపొందిన మతములకంతయు నొక్క ప్రతినిధి కలడు. వారివారి సిద్ధాంతమును ఋజువుచేయునట్టి బలియమైన హేతువులతో సాక్ష్యమిచ్చిరి. క్రైస్తవమత ప్రతినిధి జోసఫ్ కుక్ దొరగారు, మిక్కిలి ప్రోత్సాహకరమయినట్టిదియు, మిక్కిలి యభిరుచికరమయిన అంశములతో నాసభాంత్యమున నుపన్యసించెను. ఇతర మతములలో మనుష్య పాపములను తుడిచి వేయున దెద్దియని భక్తియొక్క జీవనాడినంటు ఈ ప్రశ్న వేయుచు, మాక్బెత్తు దొరసానిని వారిముందు నిలువబెట్టి తనకంటె మును ఉపన్యసించిన వారి ప్రశ్న కేమియుత్తర మిచ్చెదరని యడిగెను. లోకము నేను మనవలన వినగోరునది తెలివితక్కువ ఉత్తరము కాదు. శాస్త్రయుద్ధములో నెగడతగిన ఉత్తరముగా నుండి వాదములలో మఖాముఖిగా పెనగి స్థిరపడు సత్యముగా నుండవలెను. నేను ఈలోకమునుండి పోవుటయు, సౌఖ్యముగా పోవలయునను ఇచ్ఛయు, నాకు తెలియును. అత్యాది స్వతసిద్ధమయిన సత్యమని నొక్కి వక్కాణించెదను. మూడు అంశము లున్నవి. వానినుండి నేనెప్పుడును పారిపోజాలను. అవి యెవ్వియనగా (1) మనసాక్షి (2) దేవుడు (3) గతకాలమున నొనర్చిన త్రిప్పగూడని నా పాపచరిత్ర. నేను తప్పించుకోలేనట్లు నన్నుచుట్టియుండు నీమూటితో నేలాగు పొందిక చేసుకోవలెను? ఇదిగో మాక్బెత్తు దొరసాని, ఆమె తన చేతులు నొట్టు రుద్దుకొనుచు ఏమిపలుకుచున్నదో వినుడి.

ఎంత పాపిష్ఠి నాచ్చలి వెంచి చూడ
వీని కెటుశుద్ధి నెన్నండు వీలుపడునె?
అరబి యాగంధవర్గము లరిసిపూయు
పాపము కాని కరములివి పాపమడఁగ॥

ఆమె భర్తయు నదే విధముగ నిట్లు చెప్పుచున్నాడు. 'ఈ ఎఱ్ఱని కుడిహస్తమును సముద్ర జలము శుద్ధిచేయలేదు గాని ఈ ఎఱ్ఱని కుడిహస్తము సముద్ర జలమును ఎఱ్ఱగా చేయును.

మెక్బెత్తు దొరసాని గారి ఎఱ్ఱని కుడిచేతిని ఎవరేమి కడిగి శుద్ధి చేయగలరు. ఈ ప్రశ్నను నాలుగు ఖండములకును సకల సముద్రములలోని ద్వీపములకును వేయుచు

న్నాను. నీవు దీనికి ప్రత్యుత్తర మియ్యలేకుంటే ఈమతసంబంధమయిన పార్లమెంటుకు ఒక ముఖ్యోద్దేశముతో వచ్చిన వాడవు కావు.

నన్ను స్తుతింపవద్దని వేడుకొనుచున్నాను. ఎందుకనగా ఇతరమయిన వాటి కంటె అతిముఖ్యమయిన విషయ మొకటియుండెను నేను మీతో చెప్పునది అదే. ఇక్కడ లేనటువంటి మతవిషయమును సందేహించువారితో నేను మాట్లాడుచున్నాను. మెక్బెత్తు దొరసానిగారి ఎఱ్ఱని కుడి చేతిని ఏమి కడుగగలదని ప్రశ్నించుచున్నాను. అట్లాంటిక్ మహా సముద్రమును కొలుచుటకు గాలపుముష్వ చాలనట్లు వారి మానమును ప్రత్యుత్తరములును చాలవు.

మహమ్మదు మతమా? ఆమె ఎఱ్ఱని కుడిచేతిని కడుగగలదా? కలవర మతము బౌద్ధమతములు కడుగగలవా? దేవా నాకు సహాయము చేయుము. నేను వేరొక ప్రశ్న నడుగబోవుచున్నాను. అది కొందరి హృదయములలో జొచ్చి సముద్రములను దాటి లోకపు ఆవలి భాగమునకును పోబోవుచున్నది. దానిని నేను పరిపూర్ణముగా నమ్మియున్న ప్రత్యక్ష సాక్ష్య సత్యముల పేరట నడుగుచున్నాను. ఒకడు తన జన్మపాపము నుండియు చేసిన అపరాధము నుండియు కడుగబడితే నేతప్ప అపారమయిన పరిశుద్ధుని యెదుట సమాధానముతో నిలువజాలడు. మరియు మనస్సాక్షి నుండియు, దేవుని నుండియు, పాపముల నుండియు తప్పించుకొనజాలకపోవుట మాత్రమే గాక వాస్తవముగా చూచితే క్రైస్తవమతముతప్ప సూర్యునిక్రింద గాని మనుష్యులలో గాని ఆత్మ నెమ్మదిని తృప్తికరముగా నియ్యగలమతము మరియొకటి లేదు.

నామతమునంతయు కొద్దిమాటలలో సంగ్రహించి చెప్పుచున్నాను. దీనిని నా సమాధిరాతిమీద నుంచగోరుచున్నాను.

1. ఏర్పరుచుకొందు నేఁ బరిశుద్ధత
   లేనియెడల పరము లేకపోవు
   నాకు నేఁగింపనడతఁ జేర్పించిన
   మోక్షమార్గ మపుడు మూయఁబడును.
2. మేరలేనియఘము మితిమీఱి దుఃఖంబ
   ఏను దానియందు నేఁగియుంటి
   దేవ నియమములను దలిసి తప్పితి నేని

పాప మకట వాడుపాలఁబడును.

3. అంబు నరణంబుపల్లంబునందుఁ జేరి
పాయకుండ నల్దిక్కుల౯ బాయునటుల
నమిత దురితపు పల్లముల్ దుమికినైజ
మెల్లకాలమందున నంట నెఱుఁగవలయు.

4. వెలుగు వెలుగునకును లొంగ వెల్గుచుండు
నటులఁ గాకున్నఁ గలుగదే యాధికతమము
ప్రేమయను రవిరశ్మి నుపేక్షచేసి
మఱలఁ గోరంగ నేవాఁడు మాగుడనోఁగు.

5. వెలుఁగునకు లొంగు మోయాత్మ విహీనమొక్క
నతని దండంబు నిను నేల నమమతిమ్ము
నచ్చరితదేవ కృపనీకు నిచ్చునతన
విమల సన్నిధానమునకు వేగఁజనుము.

**అహహ**, ప్రియస్నేహితులారా! పరిశుద్ధతను నేనుత్వరగా ఏర్పఱచుకొనవలెను త్వరగా ఏర్పఱచుకొనవలెను. లేనియెడల పరలోకము పోగొట్టుకొందును. పరలోకము ప్రేమించునవి నేను ద్వేషించితే పరలోకద్వారము మూయబడును. నీవు నీ ప్రత్యేక ఏర్పాటును చేసికొనియున్నావా? లోకమంతటికి ఈ పిలుపు ఇంకా పోవుచున్నది. కాబట్టి నిజముగా 'దేవుడు లోకము ఆలాగున నే ప్రేమించెను. కాగా తన జనితైక కుమారుడుగా పుట్టినవానియందు విశ్వాసముంచు ప్రతివాడును, నశింపక నిత్యజీవము పొందుటకయి ఆయన ననుగ్రహించెను'. దేవుని ప్రేమగల పిలుపును గమనించుచున్నావా? ఆయన పలికిన 'ప్రతివాడు' అను దయగలమాటలో నీవున్నావనే నిశ్చయము కలదా?



## VIII అధ్యాయము.

# BELIEVETH IN HIM.

## ఆయనయందు విశ్వాసముంచుట.

1899 సం॥న మేము బాపట్లకు వచ్చినప్పుడు జనులు మరియొకసారి కరువు వలన బాధపడుచుండుట చూచితిమి. ప్రతిదినము క్రైస్తవులు గుడిలోచేరి "ప్రభువా కనికరించుము, తృష్ణగొనియున్న భూమిపై వర్షము కురిపింపుము. ప్రభువా కరుణించుము మేము త్రాగుటకు సహా నీళ్లులేవు' అని దుఃఖహృదయములతో ప్రార్థించిరి. దేవు డెరుగని రీతిగా తన జనులకు సహాయము చేయును.

న్యూయార్కు పట్టణమందలి క్రైస్తవ హెరాల్డువారును అనేక ఇతర దేశములందుండు లోకోపకారులును, క్రైస్తవసహోదరులును సహాయము పంపిరి. నేనెరిగినంతమట్టుకొకరయిన పస్తుపడి చనిపోయినవారు లేరు. 1901 సం॥న కరువుపోయి మంచికాలము వచ్చెను. ఆసంవత్సర మతి విస్తారముగ వర్షము కురిసినందున అనేక వేల ఎకరములపంట నష్టమాయెను. తిరుగా బెట్ట కలిగెను. ఇప్పుడు బీదలకెట్లు సహాయము చేయగలమని యోచింపగా సముద్ర తీరమున తాటిచెట్లతివిస్తారముగా నున్నందున తాటినార తీయు పనిని సాగించి దానిని స్థిరపరచగల మార్గము మనస్సు తట్టెను. చెన్నపట్టణమందలి ఒకజర్మను వర్తక సంఘము ద్రవ్యసహాయము చేసినందున పేదల అన్నము కొరకు అనేకవేల రూపాయలు సంపాదించబడినవి. ఈపని నేటివరకు జరిగింపబడుచు పని చేయగలిగిన వారందరికి జీవనోపాయమాయెను. 1906 సం॥న నేను సెలవుమీద వెళ్లినప్పుడు బాపట్లలో వీరికి కలిగియుండిన ఆస్తిని జర్మని వర్తక సంఘముపేర నంగీకరించుకొమ్మని కోరితిని. ఇక్కడి సొత్తును ఆసంఘముపేరట విక్రయపత్రము వ్రాసి ఇచ్చుటకయి చెన్నపట్టణమునుండి ఒకపడుచుదొర వచ్చెను. సర్కారుపన్ను వసూలుచేయు నుద్యోగస్తుడొకడు అగత్యమయిన పత్రములను సిద్ధపరచినతర్వాత ఆపడుచువాడు తన దస్తావేజును యిచ్చెను. ఆపత్రము మీద చెన్నపట్టణములోని బాంకి యొక్కయు, బ్రిటిషు గవర్నమెంటుయొక్కయు, చేవ్రాలు పెట్టెను. ఆస్తము ఆపడుచువాని యధికారముమీద నంగీకరింపబడెను, ఈదస్తావేజు సరుకు తెగుమతి దిగుమతియొక్క అంగీకారమై యుండెను. ఈవర్త

క సంఘముయొక్క ప్రధానస్థానములు ఇంగ్లండులోను స్విట్ జర్లాండులోను ఉండును. వాని పేరట సమస్త వ్యాపారము జరిగించుటకు గుమస్తా కధికారము కలదని ఆప డుచువాడు చెప్పెను. అతనిమీద వుంచబడిన నమ్మకమువలన అతడు చెన్నపట్టణ మందలి బ్యాంకిలోనుండి వేలకొలది రూపాయలు ప్రతిసంవత్సరము తీయుచుండెను. అయితే ఆతని స్వంతపేరట కాదుగాని ఆగొప్ప కోరీపేరటనే దీనిని జరిగించెనని గుర్తెరుగుదుము. ఈదస్తావేజును జూచినప్పుడు ఆయునయందు అనగా

## దేవునియందు విశ్వాసముంచు టేమిటో

నాజీవితములో మొదటిసారి కొంతమట్టుకు గ్రహించితిని. మనము మన రాజుయొ క్క పనిమీద యిక్కడ యున్నాము. శ్రీయేసు ఆయన పేరట అనగా మన పేరు మీద తండ్రివలనను, దూతలవలనను, ఆకాశములోను భూమిమీదను, భూమి క్రింద ను వుండే సమస్తశక్తులవలనను సమస్తము చేయుటకు మనలను ప్రతినిధులనుగా నుం డగోరుచున్నాడు. 'ఆయనయందు విశ్వాసముంచుట' జయమునకును, రక్షణకును మూలమై యున్నది. విశ్వాసమధికారముగాక మరేమియు కాదు. అందువలననే శ్రీయేసు మనలను దేవుని విశ్వాసమును దేవుని అధికారమును బొందుమని యాజ్ఞాపించు చున్నాడు. ఆహా! ఇప్పుడు నయితము శ్రీయేసు తన స్వకీయులయొద్దకు వచ్చుచు న్నాడుగాని వారు ఆయన నంగీకరించుటలేదు. గాని తన్నంగీకరించినవా రెందరో అనగా తన నామమందు విశ్వసించినవారికి దేవునిపిల్లలగుటకు ఆయన వారి కధికార ము దయచేసెను. ఈహక్కును, ఈఅధికారమును నీవు బొందియున్నావా? రాజు యొక్క కార్యమును, ఆయన గుమాస్తాగా జరిగించుచున్నావా? ఆయన యధికారపు వకాలతునామా నీకు కలదా?

## శ్రీయేసుయందు విశ్వాసముంచుట, నిజముగా, నేమైయున్నది

మనమెరుగుట మిక్కిలి ఆవశ్యకము. మనయందు దీనిగూర్చి విశదమయిన నిర్ధారణ యుంటే అప్పుడు మన క్షేమి కలిగియున్నది ఏమి చేయవలసినది విశదముగా తెలిసి కొందుము. క్రీస్తు సంఘము విశ్వాసముతప్ప తక్కినదంతయు దాదాపుగా కలిగియు న్నట్లు నేనెంచుచున్నాను. గనుక నేను సంఘమందు నమ్ముచున్నాను. నేను శ్రీ యేసు రక్తముతో కొనబడిన ప్రతి విశ్వాసిని నమ్ముచున్నాను. ప్రతి విశ్వాసియు నాసహోదరుడు, సహోదరి. క్రీస్తు సంఘముమీద నేను నింద మోపను. అయితే దేవునిబిడ్డలు ఆయనఆజ్ఞలను నెరవేర్చుటలోగల లోపములను గూర్చిన పాపము లను కిందట్లు మూసికొని యుండలేను.

క్రీస్తు సంఘము విశ్వాసము తప్ప దాదాపుగా నన్నియు కలిగియున్నదని చెప్పుటకు భయపడుచున్నాను. ఎందుకనగా శ్రీయేసుక్రీస్తు తన శిష్యులతో 'మీకు ఇంకా నమ్మిక లేదా? అయినను మనుష్య కుమారుడు వచ్చునప్పుడు ఆయన భూమి మీద ఈవిశ్వాసము కనుగొనునా' అని చెప్పినప్పుడు మనమనస్సు కరుగునట్లు గురిపెట్టి అడుగుచున్నాడు. అయితే విశ్వాసమనగా నేమిటి? దేవుడు నాకిచ్చిన వెలుగు చొప్పననుస్ను, నూతన నిబంధనను మిక్కిలి జాగ్రతగా చదువుటవలననుస్ను, విశ్వాసమనగా అధికారమని నేనమ్ముచున్నాను. దేవునియందు కేవల నమ్మిక యుంచుట యయినను, ఆశ్రయించుటయైనను కాదుగాని మనము తిరిగి జన్మించినప్పుడును, మన మాయన సేవకులగుయినప్పుడును మనమీద ననుగ్రహించిన విశ్వాసమే అధికారము. శ్రీయేసు దేవుని విశ్వాసము పొందుడీయని ఆజ్ఞాపించినప్పుడు దేవుని యధికారము పొందుడని ఆయన భావము. బైబిలు భాషాంతరీకరణులు విశ్వాసమునుగూర్చి భాషాంతరించునప్పుడు షష్ఠీవిభక్తికి బదులుగా సప్తమీవిభక్తి నుపయోగించి 'దేవుని విశ్వాస ముంచుటకు' బదులుగా దేవునియందు విశ్వాస ముంచుడని భాషాంతరించియుండిరి. మార్కు 11: 22, గలతీయ 2: 16 వ. లో నుండు 'అందు' 'అందలి' అను మాటలను దీసివేసి 'యొక్క' అను మాటనుంచి చదువుడి. గలతీయ 3: 26 వ లో 'క్రీస్తు యేసునందు విశ్వాసమువల్ల మీరందరు దేవుని కుమారులై యున్నారు' దీనివల్ల దేవుని విశ్వాసము శ్రీయేసుక్రీస్తుయొక్క విశ్వాసము అనగా దేవుని అధికారమును శ్రీయేసుక్రీస్తు విశ్వాసమునయి యున్నది. నేను శాస్త్రిని కాదని ఎరుగుదును. గొప్ప శాస్త్రులకు కలిగియున్న జ్ఞానమును నాకు కావలెనని కోరుట లేదు. మన ప్రభువయిన శ్రీయేసును, అపొస్తలుడును దీనిని చక్కగా విశదపరచి చెప్పుటకు తెలియకపోయినదనియు ఈమాటల భావము విశదపరచుటకు మరియొకరు కావలెననియు నేను కనుగొంటే వారి సర్వోత్కృష్టజ్ఞానమునకు వారియెదుట వినయముతో వంగుదును. దేవుని మాటకు సాధారణమయినట్టియు, స్పష్టమైనట్టియు భాషాంతరమే మంచిదనియూ, బైబిలునందు లేని విభక్త్యర్థకమయిన అన్వయము లుండరాదనియు ఎరుగుదును. నాకును నాదేవునికిని మధ్య విభక్త్యర్థకము రానియ్యను.

ఈలాగు భాషాంతరము చేయుట తెలుగుభాషయందు మాత్రమే గాక యూరపుఖండ భాషలందును గలదు. గొప్ప శాస్త్రులని ఎంచబడినవారు సయితము 'దేవుని యొక్క విశ్వాసము' అను దానిని 'దేవునియందు విశ్వాసము' అని భాషాంతరము

చేసిరి. ఆయన స్వంతది 'యొక్క' అని చెప్పవలసినదానికి బదులుగా 'యందు' అని వుంచిన స్థలములను గమనించి చూడుడి. రోమా 3: 22, 26; గల 2: 16, 20; 3: 22; ఫిలి 3: 9; ఎఫెసీ 3: 12; 4 13; యాకోబు 2: 1; ప్రత్యక్ష 2: 13, 14:12 అపో. కార్య 3: 16.

వీనిని చదివిన తరువాత మన మనసులో విశ్వాసమునుగూర్చి ఒక విశదమైన తలంపు కలిగినదా? నేనెరుగను. మనము దేవుని నిరూపణను తీసికొని మానవబుద్ధి కుశలతలను విడుచుదము. షష్ఠీవిభక్తికి బదులుగా సప్తమీవిభక్తి నుంచినది భాష యను జలమును వడియగట్టి నిర్మలపర్చబోయి బురదజేసి జలమును మునుపటికంటే మురికి చేసినట్లున్నది. విశ్వాసము స్వకీయమైనదిగాను, నొకదానిమీద నానుకొనినదిగాను కాదు. విశ్వాసము అధికారమై యున్నది. క్రీస్తు దీనిని తీసికొని వినియోగించినట్లు మనము దీనినిబొంది పని చేసినయెడల మనమును దేవుని కిష్టులమై యుందుము. మనుష్యకుమారుడు వచ్చునపుడు ఆయన భూమిమీద ఈవిశ్వాసము నీయందును, నాయందును కనుగొనునా?

## విశ్వాసమునుగూర్చి దేవుని ఘనమయిన వ్యాఖ్యానము గల హెబ్రి ఉత్తరమును

తీసికొని 11-వ అధ్యాయము చూతము. ఆ యధ్యాయమందు దేవుని విశ్వాసము, క్రీస్తు విశ్వాసము అనగా దేవుని అధికారము, క్రీస్తు అధికారమునై యున్నదని చాలినన్ని ఋజువులు గలవు. మనము దేవుని బిడ్డలమైనప్పుడు ఈవిశ్వాసము మన విశ్వాసమై, ఈఅధికారము మన అధికారమై యున్నది. 'విశ్వాసమనగా నిరీక్షించబడువాటియొక్క నిశ్చయము, కనబడనివాటి దృఢమైన నమ్మకమునై యున్నది. ఎందుకనగా దానియందు పెద్దలు మంచి సాక్ష్యము బొందిరి.

ఈ గొప్ప అధికారమువల్లను, సాక్ష్యము వల్లను, మనలో మనము పొందు దాని నిజమును చూతము. విశ్వాసమువల్ల ఆబేలు, కయీనుకంటె, శ్రేష్ఠమైన యాగమును దేవునికి జేసెను. విశ్వాసమువల్ల హానోకు మరణము, చూడకుండునట్లు కొంచుపోబడెను. విశ్వాసమువల్ల నోవహు తన యింటివారి రక్షణకొరకు ఒక నావను సిద్ధము చేసెను. విశ్వాసమువల్ల అబ్రాహాము భూమిమీదనున్న మహాశ్చర్యకరమైన జనాంగములకు తండ్రియాయెను. ఎందుకనిన దేవుడు దేనికి శిల్పియు

నిర్మాణకుడునై యున్నాడో పునాదులుగల ఆపట్టణముకొరకు అతడు ఎదురు చూచుచుండెను. విశ్వాసమువల్ల శారాయు, తాను వయస్సు చెల్లినదైనను గర్భము ధరించుటకు శక్తిని పొందెను. అందుచేతను బీజమట్టుకు చనిపోయినవాడైనప్పటికి ఒకనికి ఆకాశ నక్షత్రములవలె విస్తారముగాను, లెక్కింపబడుటకు శక్యముగాని సముద్రతీరమందలి యిసుకవలెను సంతానము కలిగెను. విశ్వాసమువల్ల అబ్రాహాము, ఈసాకును అర్పించియున్నాడు. విశ్వాసమువల్ల ఈసాకు రాబోవువాటినిగూర్చి ఏశావును, యాకోబును ఆశీర్వదించెను. విశ్వాసమువల్ల యాకోబు చనిపోవుచుండగ యోసేపు కుమారులను ఆశీర్వదించెను. విశ్వాసమువల్ల యోసేపుతనకు కాలము సమీపించినపుడు తన ఎముకలనుగూర్చి ఆజ్ఞాపించెను. విశ్వాసమువల్ల మోషే తాను బుట్టినప్పుడు తన తలిదండ్రులచేత మూడు మాసములు దాచబడెను. విశ్వాసమువల్ల మోషే పెద్దవాడై కొంతకాలముమట్టుకు పాపభోగమును అనుభవించుట మంచిదని ఏర్పర్చుకొనెను. విశ్వాసమువల్ల అతడైగుప్తును విడచెను. విశ్వాసమువల్ల అతడు పస్కాను ఆచరించెను. విశ్వాసమువల్ల వారు తేమలేని భూమిమీదవలె ఎఱ్ఱసముద్రముగుండా వెళ్లిరి. ఐగుప్తీయులు లాప్రయత్నము చేసి మునిగిపోయిరి. విశ్వాసమువల్ల యెరిఖో పట్టణపు గోడలు కూలెను. విశ్వాసమువల్ల రాహాబనే వేశ్య అవిధేయులతో నశింపకపోయెను.

విశ్వాసమువల్ల రాజ్యములు జయించినట్టియు,

న్యాయములను జరిగించినట్టియు, వాగ్దత్తములను పొందినట్టియు, సింహముల నోళ్లను మూసినట్టియు, అగ్ని బలమును చల్లార్చి ఖడ్గధారను తప్పించుకొని బలహీనతనుండి బలపర్చబడి యుద్ధములో శక్తిమంతులై అన్యుల సేనలను పారదోలిన విశ్వాసవీరులందరిని, ఏలాగు లెక్కపెట్టగలము? 'స్త్రీలు మృతులయిన తమ వారిని పునరుత్థానమువలన మరల బ్రతికించుకొనిరి. కొందరైతే మరి శ్రేష్ఠమయిన పునరుత్థానము పొందగోరి విడుదల పొంద నొల్లక యాతన పెట్టబడిరి. మరికొందరు తిరస్కారములను కొరడా దెబ్బలను మరి బంధకములను ఖైదును అనుభవించిరి. రాళ్లతో కొట్టబడిరి, రంపములతో కోయబడిరి, శోధింపబడిరి, ఖడ్గముతో చంపబడిరి. గొర్రె చర్మములను మేక చర్మములను వేసికొని దరిద్రులై యుండి శ్రమపడి హింస పొందుచు, గుహలలోను సొరంగములలోను తిరుగులాడుచు సంచరించిరి. అట్టివారికి ఈలోకము యోగ్యమయినది కాదు'.

వీటి నన్నిటిని చేయుటకు వీరికి శక్తి కలిగించిన దేది? ఈశ్రమలను సహించుటకు బలమిచ్చినది వారిలోని అధికారముగాక మరియేది. విశ్వాసాధికారమును మనము ధరించియుండునట్లు నిశ్చయమయిన నమ్మికముద్వారా మాత్రమే ఈలోకములో దేనినయినను పొందగలము. ఈఅధికారము లేకుండ, ఈవిశ్వాసము లేకుండ దేవుని కిష్టులమయి యుండజాలము. విశ్వాసము లేకుండ దేవుడిచ్చే ఈ యధికారము లేకుండ పాపమును జయించుటకు బలము పొందలేము. మనకువిశ్వాసము కలిగినప్పుడు మన మెల్లప్పుడు జయశీలులమయి 'మనప్రభువైన శ్రీయేసుక్రీస్తుద్వారా మనకు విజయము నిచ్చునని దేవునికి వందనములని యెల్లప్పుడు పాడుదము.

## ప్రభువా మావిశ్వాసమును వృద్ధి పొందింపుమని ప్రార్థింతము.

శరీరసాధకమువల్ల మన దేహము పెరుగునట్లు, సాధకమువలన మన విశ్వాసము పెరుగును. నీవిశ్వాసమును సాధకము జేయుచున్నావా? ప్రేమవలన పని జరిగించు విశ్వాసము నీకు కలదా? విశ్వాసము రక్షించునని జ్ఞాపక ముంచుకొనుము. శ్రీయేసు ఈసత్యమును యెన్నోసారు లునొక్కి చెప్పెను. ఆయన బాధపడుచుండు వారితోను' శ్రమనొందు చుండువారితోను'' నీవిశ్వాసము నిన్ను స్వస్థపర్చెను నీవిశ్వాసము నిన్నురక్షించెను సమాధానముగా వెళ్లుమని' పలుమారు పలికియుండలేదా? ఈకాలమందు జనులు మనయొద్దకువచ్చి అయ్యను మేమురక్షింపబడుటకు కోరుచున్నాము గాని నమ్మలేమని చెప్పుదురు. అదే దేవుడు అబద్ధికుడని పిలుచుట. అదే మహాపరాధము. జనులు నమ్మకుండే నశింతురనుట నీకు ఆశ్చర్యముగా నున్నదా? ఒక సబ్బాతుబడి విద్యార్థిని శ్రీయేసును నీరక్షకునిగా నంగీకరించుమని వేడుకొనినప్పుడు నేనువిశ్వసించలేనని చెప్పెను. అప్పుడు నేను నీవు సైతానును నమ్ముచున్నావు. అయితే నీవు సైతానుకంటె శ్రీయేసుని నమ్మకునని ప్రత్యుత్తర మిచ్చితివి; తరువాత అతడు నేను విశ్వసించుచున్నానని మహా సంతోషముతో చెప్పి అతక్షణమే రక్షింపబడెను. అతను ఇరువది సంవత్సరములకు పైనబర్మాలో నొక మంచి మిషనెరీ యాయెను. నీవెవరిని నమ్ముచున్నావు? సైతానునా? శ్రీయేసునా? నీనమ్మికచొప్పున నీవు జీవింతువు. నీవు జీవించినచొప్పున చనిపోదువు నీవు చనిపోయిన రీతిగా నడుతువు. నీవు నడచినరీతిగా నుందువు' ఒక జర్మనీదేశకవి నీకు, రక్షించే విశ్వాసము కలదాయని యడిగెను.

# విశ్వాసము ధైర్యమును కలిగించును.

మనకు ధైర్య మగత్యము. పిరికివానికి విశ్వాసము లేదు. ఒక హూరు సెట్లు పొగు డుదుమా 1908 సం॥ ఆగస్టు నెలలో ప్రచురింపబడిన నొక పత్రికయందిట్లు వ్రాయ బడి యున్నది. విశ్వాసముతోను సత్క్రియలతోను నిండిన యీ సాధారణ జనుని గూర్చి నీవేమి తలంచెదవో దీనిని చదివిన వెనుక చెప్పుము.

జనవరి నెలలోని ఒక యుదయమున హడ్సనునది పేరిన మంచుచేత నిండి యుండెను. అప్పుడొక బల్లకట్టును, నెట్టుకొనుచు మధ్య నదిలో తెడ్లునా నేవరకు పోవు చుండిరి. బల్లకట్టు పై భాగము నిండ కూలివారుండిరి. గుర్రపుబండ్లు చాటలలో విస్తారముగ నుండెను. స్త్రీలు పిల్లలు తలుపులమట్టుకు క్రిక్కిరిసి యుండిరి. ఆబల్లక ట్టు కొంతకాలము నిలచితిరుగగా బయలుదేరు సమయమైనప్పుడు సముద్రపుపోటు వచ్చి దానిని తొలగద్రోసి ఒకచోటున తాకినందున నీళ్లలోనున్న భాగమంతయు బద్దలా యెను. తత్క్షణమే జనులు భయముతో బొబ్బలు పెట్టిరి. స్త్రీలు భయపడి తమ బిడ్డలను కౌగిలించుకొనిరి. పురుషులు భయాక్రాంతులైరి. గుర్రములు సము ద్రములో బడిపోకుండ చేయుటకు బల్లకట్టు పై భాగమున కెక్కెను. ఒక క్షణ ములో నాబల్లకట్టు ఒకప్రక్క కొరిగి తల్లక్రిందులాయెను. నీళ్లు నిండా పోయెను. కొన్ని నిమిషములలో బల్లకట్టు యావత్తు పేరిన మంచుగడ్డలక్రిందికి పోయెను.

దీనికి నూరు గజముల దూరముననున్న పట్టణమునుండి ఒక యోడ బొగ్గు కొరకై మరియొక స్థలమునకు వెళ్లుచుండెను. ఆఓడయొక్క ముందలి భాగమున కూర్చుండియున్న సరంగు వెనుక భాగమందు చుక్కానియొద్ద కూర్చుండియున్న వా నితో నడుపుటను గూర్చి హెచ్చరించెను. పగిలిపోయిన బల్లకట్టు సముద్రపు పోటు వలన తిరిగి పైకి లేచెను. సరంగు దీనిజూచి తన యోడను దానియొద్దకు నడిపించి ఒక్క పెట్టున దానిమీద పిల్లి దుమికినట్లు దుమికెను.

పగిలిన బల్లకట్టులోని పురుషులు ఆయన చేతులను బట్టుకొనిరి స్త్రీలు మీద నిలిచి తమ బిడ్డలను కౌగలించుకొనగా బల్లకట్టులోని వారందరికి నెమ్మదియు, ధైర్య మును గలిగెను అతడాబల్లకట్టుకు అన్నిప్రక్కల సమానబరు వుండునట్లు జనులను క్రమపరచెను.

కదలిన ప్రతివానిని సముద్రము లోపడద్రోయుదునని బెదిరించి బల్లకట్టులోని పడకలను, కంబళ్లను, తివాసీలను, దూదిని, తీసికొని సముద్రపుపోటువలన పగిలిన రంధ్రములలో నొకటిని దప్ప అన్నిటిని బిగించెను. దానివలన నీళ్లు లోపలికి వచ్చుచుండెను గనుక అతడు ఐదునిమిషములలో వదికూడ బిగింతును మరి యేమైన యుంటే దెమ్మనెను. అప్పుడు జనులు అనేక వస్తువులు తీసికొనివచ్చి ఇచ్చిరిగాని వాటివలన ప్రయోజనము లేకపోయెను. తిరుగ డ్రయివరు తాను బిగింపప్రయత్నించిరిగాని అదియు లాభము లేదయ్యెను. ఎందుకనగా నీళ్లను వెలుపలికి త్రోయుకొలది అవి వచ్చుచునేయుండెను. తుద కాబల్లకట్టు నీళ్లతో నిండసాగెను.

సరంగు ఏమిచేయుటకు తెలియక నిలువబడి యుండెను. డ్రయివరు సహాయము చేయకముందే నీళ్ల ప్రవాహము వచ్చుచున్న రంధ్రము లో తన దేహమును దూర్చి చేతులను మంచుగడ్డలమీద చాపెను.

ఒకగంట కాలమయిన తరువాత బల్లకట్టులోనుండి అందరు క్షేమముగా రక్షింపబడిరి. సరంగును ఆపగులులోనుండి పైకెత్తినప్పుడు స్మారకము తప్పి కొనప్రాణముతో నుండెను. నీళ్లు అతని రక్తమును కరుడుగట్టునట్లు చేసెను. పైన తేలుచున్న పేరిన మంచుగడ్డ ముందుకు చాపిన చేతులను భుజములు మొదలు, ముంజేతులవరకు చీల్చియుండెను. అతడు స్మారకము తెలిసినప్పుడు కండ్లు తెరచి, కట్లు కట్టుచున్న వైద్యునితో 'పిల్లలలో నెవనికైన హాని జరిగెనా' అని అడిగెను. అతడు తిరుగ బలపడుటకు నొక నెలరోజులు పట్టెను. అతని చేయి బాగుపడి చొక్కా వేసికొనుటకు నొకవారము పట్టెను.

ఇది సంభవించినప్పుడు నేను న్యూయార్కు పట్టణమందుంటిని. గనుక నాకిది బాగుగ జ్ఞాపకమున్నది. ఆహా, స్నేహితులారా! ఇది విశ్వాస ధైర్యముల నిచ్చును. ఆసరంగు పురుషులను, స్త్రీలను, పిల్లలను, జలసమాధినుండి రక్షించుటయందు తన జీవము నపాయముల పాలు చేసినట్లు ఆత్మల రక్షణార్థమయి నీతి సంబంధమయిన ధైర్యమును మనము చూపింపవద్దా?

నాతో కలువరి యొద్దకు మరియొకసారి రాగోరెదను.

దేవునికిని, మనకును మధ్య భయంకరమయిన సందు కలిగించినదక్కడనే. కలువ

మీదనున్న శ్రీయేసును మన మిప్పుడు జూచినట్లయిన ఆయన తనపరిశుద్ధ దేహముతో ఈగండి పుడ్చినది మనము గ్రహింపగలము. ఆబల్లకట్టులోనున్న జనులకు కలిగిన అపాయము నానరంగు జూచి, వారి శరీరసంబంధమయిన మరణమునుండి తప్పించుటకై తనశరీరమును సమర్పించెను. అయితే శ్రీయేసు నిత్యమరణమునుండి తన శత్రువులను, పాపులను, లోకమును, రక్షించుటకొరకుచనిపోయెను. ఆహా శ్రీయేసు ప్రేమ! ఆహా శ్రీయేసు ప్రేమ!! ఎవరువర్ణింపగలరు?

రా—అసావేరి. తా—చాపు.

నజరేతువాసమానుజ వంశోద్ధారక నా - వృజినముల్ బాపుమో - యజిత శ్రీయేసు
నిజమహిమ స్వపజీవమిడినను - విజయశిల్వాని వింతసిలువను నిజముగానే మదిం
దలంచిన - నిజన గర్వములను త్యజింతును॥

1. నా దేవుండా క్రీస్తు - మీదు మృత్యువు తప్ప - నే దానియందయిన - నేనతిశయింప
పక = నాకు ప్రియ లోకభోగభా - గ్యములెల్లను హృదయము పూర్తిగ - మీదు
నిర్మల శోణితమునకు - మోదమున నర్పింతు వభవా॥

2. కరుణాసముద్రుని - చరణారవిందవర - కర శిరస్థలులనుండి = పరమ ప్రేమయు
నమిత దుఃఖము - నిరతము సంక్షోభించి పారుట - కరకుకంటము విలువ మకుటము -
ధరనుజీవుండ యెపుడు కంటిని॥

3. పరమరక్షకయేసు - సరిలేని మీ ప్రేమ - కొరకై విశ్వము నెల్లను = నిరతి వర్పించి
నను లఘువది - ధరనునిట్టి మహాద్భుతంబౌ - పరమదైవప్రేమనాయా - త్మరజన
జీవాదు లడిగెను॥

4. యేసు శ్రీమంతమీ - దాసదాసుండగుని - నా మనిం కాలింపుమీ - మీ నునుంగ
శ శిలువశక్తిని - దోసకారుల దొరనయినను - మీ పమంచితకృపత్వదీయ - దాను
నిం దరిజేర్చికొనిన॥

మేము దక్షిణ ఆఫ్రికాలోని బోయురులను చూడబోయినప్పుడు ఆదేశములోని జనులందరికీ కీర్తన బహు ప్రియమయినదిగ నుండెను. ఈ కీర్తనను

వారెట్లు నేర్చుకొనిరి? జిప్సీస్మిత్తుదొరగారను దైవసేవకుడు బోయరులకును, ఇంగ్లీషువారికిని జరిగిన దుఃఖకరయుద్ధము ముగిసిన వెనుక దక్షిణాఫ్రికాకు రావలసి వచ్చినప్పుడాజనుల కీర్తన నేర్పించెను. మానవద్వేషమువలనను అత్యాశవలనను కలిగినఘోరమగు గాయములు కలువరిలోని శిలువయొద్ద మాత్రమే నింపబడగలవు. మహిమాధిపతి మరణమునొందిన ఆశ్చర్య శిలువను చూచినప్పుడు వారు తమ ద్వేషములను విడిచిరి. నీజీవితమందుగాని, నీకుటుంబమందుగాని, నీసంఘమందుగాని, నీజనులందుగాని కలహము లేదా? వారిని శిలువయొద్దకు, శ్రీయేసు యొద్దకు శిలువమీదికి తీసికొనిరమ్ము. అప్పుడు కలహము నిలుచును. అక్కడ మనము జగడమాడలేము; సందు పెద్దది చేయలేము. ఎందుకనగా శ్రీయేసు తన స్వకీయపరిశుద్ధదేహముతో దానిని నింపియున్నాడు.

చెప్పవలసినంత చెప్పి యున్నాడు. దేవునియెదుట మనము మానవులమై ఆయన తనతో నింపుటకై ప్రార్థింతము. అప్పుడు మనము విశ్వాసబ్రతుకు బ్రతుకుటకు సిద్ధపడుదుము. పాపము వల్ల కలిగిన సందులను మన స్వాస్థ్య బ్రదుకు లోనింపగలము. శ్రీయేసునుమరువకుము. ఆయనయందు విశ్వాసముంచుము. దేవుని విశ్వాసమునుపొందుము, దేవుడు నీవేమి చేయవలయునని కోరుచున్నాడో ఎరుగుము. దానిని నీపూర్ణహృదయముతోను నీపూర్ణబలముతోను చేయుము. అదే విశ్వాసము!



## IX. అధ్యాయము.

# SHALL NOT PERISH:- నశింపక.

లోకపాండిత్యము నీ వెరుగుకొలది బైబిలునందలి సకలమును మించు పారస్యమును జూచి భక్తిపూర్వకమైన భయముతోను, ఆశ్చర్యముతోను బహుగా నింపబడితివి. ఒక ఆదివార పుదయమున కొందరు తెలివిగల బ్రాహ్మణ బాలురు మాచే బ్రాతుబడికి హాజరయిరి. వారు తమ జీవితకాలములో నిట్టిబడికి వచ్చుట యిదే మొదటిసారి. బ్రాహ్మణులు తమ బాల్యమునుండి ఆశ్చర్యకరమయిన సంస్కృతపద్య గద్యములను మహారణ్యంబున సంచరించి విద్యాధనమును సంపాదించుకొనువారని నీ వెరుగుదువు. నేను బైబిలు నొకబాలుని చేతికిచ్చి పందొమ్మిదవ కీర్తనను చదువమంటిని. ఆపిల్లవాడు బ్రాహ్మణులు చదువునట్లు రాగముతో జదువగా ప్రాగ్దేశీయ తలంపులతో నిండిన దీనిని వినుచున్న ఇతర బాలురు విభ్రాంతులయిరి. అంతకంటె తెలివిగల మరియొక బాలుడు ఆకీర్తనకు వ్యాఖ్యానముగా 119 వ కీర్తనను జదివెను. ఈ రెండుకీర్తనలు పరస్పర భేదముతో నిండియున్నందున బాలురు ఈగొప్ప అలంకార పారస్యమును గ్రహించిరి. అయితే యోహాను 3: 16 వచనమువలన పలుకబడిన లేక వ్రాయబడిన సకలవిద్యల బలమును అలంకారమును మించియున్నది. ఈవచనమును మన మెన్నిపర్యాయములు చదువుదుమో, దీనియర్థ గౌరవమంత అధికముగా బలపరచబడి దానిలోని సమస్త సంగతులను తెలియజేయుటకు మనము సమర్థులమని ఒప్పుకొనవలయును. ఇది దేవుని సొమ్ములపెట్టెలోని శ్రేష్ఠరత్నము.

ఒకక్షణ మీచిన్నవచనమందుగల పరస్పర భేదములను చూతము.

నిత్యుడయిన దేవుడు నశించుచున్న లోకమునకు నెదుర నిలచెను. మన కింతమాత్రము గ్రహింపుగాని సన్మానముతో 'దేవుడు ప్రేమించెనని చదువుచున్నాము. మరియు మనస్సు కరిగించే సిలువద్వారా 'ఆయన తన జనితైక కుమారు నిచ్చెను' అను మాటలందుగల సత్యము ప్రతిహృదయమందు గుచ్చబడి, తేటపరచబడి తీసికొనిపోబడును. మరియు ఈవచనాంతమం దింతకుపూర్వము చూచిన భేదముకంటె ఎక్కువ భేద మగుపడుచున్నది. నరకము, పరలోకము, నాశనము, రక్షణము, నిత్యనా,

శనము, నిత్యసుఖప్రాప్తి. ఇవే ఈవచనమందు పరస్పర భేదములు. శ్రీయేసు నందు విశ్వాసముంచువా డెన్నటికి నశింపక నిత్యజీవమును పొందును. దేవుని వాక్యములు ఎందు కింత పరస్పరభేదము గలవై యున్నవి? బైబిలు అలంకారము యొక్కయు, దేవుని మాటయొక్కయు, పూర్ణోద్దేశమునగా పాపమును, నిత్యమరణాపాయమును గుర్తెరుగుటయు, నైతికమును విడిచి శ్రీయేసునొద్దకువచ్చుటకుమన లను బలవంతపెట్టుటయు, మరణము నుపేక్షించి జీవము నేర్పరచుకొనుటయు, లోకమును విసర్జించి దేవుని హత్తుకొని 'నశింపక నిత్యజీవము పొందుట' యునై యున్నది. నీవు దేని నేర్పరచుకొందువు? నేను నాయింటివారును సత్యము నేర్పరచుకొంటిమి. మాఏర్పాటయినది. ప్రస్తుతపు మాయల నన్నిటిని విడిచి రాబోవు సత్యములనుదరిగి 'నీయాలోచన చేత నన్ను నడిపించెదవు. తరువాత ఘనతతో నీవు నన్ను చేర్చుకొందువు. ఆకాశమందు (నీవు తప్ప) నాకెవరున్నారు? నీవు నాకుండగా లోకములోని దేదియు నాకక్కరలేదు. నాశరీరము నా హృదయము క్షీణించిపోయినను దేవా నిత్యము నాహృదయమునకు ఆశ్రయదుర్గమును స్వాస్థ్యమునయి యున్నావు' అని పలుకుదును.

శ్రీయేసునందు చూచువారందరు రక్షింపబడుదురనే సత్యమును యోహాను 3: 15 వ. ఋజువుపర్చుచున్నది. పునర్జన్మమునుగూర్చి మన ప్రభువైన శ్రీయేసు క్రీస్తు చేసిన ఈగొప్ప ప్రసంగమునందు 'ఆయనయందు విశ్వాసముంచుడి, ఆయనయందు విశ్వాసముంచుడి' అని గద్దించి బుద్ధిచెప్పినసంగతి పలుమారు వింటున్నాము. దీనిని అపొస్తులుడైన యోహాను తన సువార్తయందు వ్రాసియున్నాడు: విశ్వసించుము, విశ్వసించుము' అరణ్యములో మోషే సర్పము నెలాగు ఎత్తెనో అలాగే విశ్వసించు ప్రతివాడు నశింపక ఆయనద్వారా నిత్యజీవమును పొందునట్లు మనుష్యకుమారుడెత్తబడవలెను' తాపకరములయిన సర్పమును ఎత్తుటను గూర్చినసంగతి 'వారు ఎదోము దేశమును చుట్టి పోవలయునని హోరుకొండనుండి ఎర్రసముద్రమార్గముగా సాగినప్పుడు మార్గాయాసము చేత జనుల ప్రాణము సొమ్మసిల్లెను. కాగా ప్రజలు దేవునికిని మోషేకును విరోధముగా మాటలాడి- ఈఅరణ్యములో చచ్చుటకు ఐగుప్తులోనుండి మీరు మమ్ము నెందుకు రప్పించితిరి? ఇక్కడ ఆహారము లేదు. నీళ్లు లేవు. చవి సారములేని ఈ యన్నము మాకు అసహ్యమైనదనిరి. అందుకు యెహోవా ప్రజలలోనికి తాపకరమైన సర్పములు పంపెను, అవి ప్రజలను కరువగా ఇశ్రాయే

లీయులలో ననేకులు చనిపోయిరి. కాబట్టి ప్రజలు మోషేయొద్దకువచ్చి మేము యెహోవాకును, నీకును విరోధముగా మాటలాడి పాపము చేసితిమి. యెహోవా మామధ్యనుండి ఈసర్పములను తొలగించునట్లు ఆయనను వేడుకొనుమనిరి. మోషే ప్రజలకొరకు ప్రార్థన చేయగా యెహోవా—నీవు తాపకరమైన సర్పమొకటి చేయించి స్తంభముమీద పెట్టుము. అప్పుడు కరవబడిన ప్రతివాడును దానివైపు చూచి బ్రదుకునని మోషేకు సెలవిచ్చెను. కాబట్టి మోషే ఇత్తడి సర్పమొకటి చేయించి స్తంభముమీద దానిని పెట్టెను. అప్పుడు సర్పపుకాటు తినిన ప్రతివాడు ఆయిత్తడి సర్పమును నిదానించి చూచినందున బ్రదికెను.' అని చదువుచున్నాము.

## ఒకడు నరకమును గూర్చియు నాశనమును గూర్చియు

పలికినట్టయిన అది తెలివిమాలినది గాను, జన సమ్మతము కానిదిగా నుండునని ఎరుగుదుము. ఇవి చెవుల కింపుగా నుండవు. సంభాషింపదగిన సంతోషకర సంగతులనేకము లుండగా ఇంపు గాని వాటినిగూర్చి యేల మాటలాడెదవని అడుగుదురు. దీనినిగూర్చి బైబిలులో నేమియు చెప్పకయుంటే నిజముగానే చెప్పకుందుము. ఇది దేవుని కోరిక. దీనికి వ్యతిరిక్తముగా నెవరు పలుకలేరు. దేవుడు ఎవనినయినను నరకములో వేయునని చెప్పుట కెవరికయినను అధికారము లేదు. ఆయన నరకము నుండియు, నాశనము నుండియు రక్షించుటకు తన జనితైక కుమారు నిచ్చెను. ఎవడయిన నరకమునకు పోతే దేవుని యిష్టప్రకారము కాదుగాని వాని స్వయిష్టప్రకారము పోవుచున్నాడు. దేవు డందరితో వాదాడి అందరిని రక్షింపగోరుచుండగా ఆయన సర్వశక్తుడయినను వారిష్టపడకుంటే రక్షింపలేడు. శ్రీయేసు యెందుకు చనిపోయెను? శిలువమీద తండ్రి, తన పరిశుద్ధుడయిన కుమారు నెందుకు విడచెను? అందరు ఆయనయందు విశ్వాసముంచి జీవింపవలయుననుటకే గదా! ఇత్తడిసర్పమును చూచినంతమాత్రాన రక్షింపబడుదురని ఒకవ్యక్తుడు నమ్మెను. నేను కన్నులు మూసికొని చూడకయుందునంటే అతని మరణమున కెవరు నిందింపబడవలయును. నిశ్చయముగా దేవుడు నిందింపబడడుగదా!

## నశించుటనగా నేమి?

సిరిల్ అనుఆయన చెప్పిన దేమనగా:—నరకమునకు వెళ్లుట నరకము జీవములేనిమరణ దేశము, వెలుగులేని అంధకార ప్రదేశము, సంతోషములేని దుఃఖపుఅగాధము;

నశించినవారి నిట్టూర్పు లచ్చటనుండి పైకి వ్యాపించుచున్నను కరుణారసముతో వారి అంగలార్పును ఆలకించు చెవిని కనుగొనలేరు. ఆరోగ్యమును పొట్టకొరకలు విన బడు లోతయిన గొయ్యి, కాని ఆకేకవలన కనికరించువారిని కనుగొనజాలరు. సకల విధములయినవారి విన్నపముల దెలిపి వారి నుద్ధరించువా రెవరును లేరు'. ఈ భయంకరమయిన స్థలమును గూర్చిన వర్ణన కేవలము ఒకనికి తోచినవిధమై యుండగా నేను చెప్పిన దేమంటే, దీనిని వినకుందుము. అయితే స్నేహితులారా, శ్రీయేసును అపొస్తలులును నశించినవారికి కలుగు భయంకరస్థితిని గూర్చి ఏమిచెప్పిరో చూతము. మన ప్రభువయిన శ్రీయేసుక్రీస్తుకు పరలోకమును, నరకమునుగూర్చి బాగుగా తెలియును. నాశనమునుండి రక్షించుట కాయన ఈలోకమునకు వచ్చెను. ఇందును గూర్చి, మనము గొప్ప అపాయములో నున్నామనుగనుక నాశనమునకు పోవుటకంటె కన్ను పెరికివేయబడితే, చేయి నరకబడితే మంచిదని శ్రీయేసు చెప్పెను. 'రెండు చేతులనయినను రెండుపాదములనయినను కలిగినవాడవై నిత్యాగ్నిలో పడవేయబడుటకంటె అంగహీనుడవుగానయినను, కుంటివాడవుగా నయినను జీవములో ప్రవేశించుట నీకు మేలు'. అంత్యన్యాయతీర్పునుగూర్చి వివరించునప్పుడు నీతిగల సర్వజ్ఞానినయిన రాజు ఎడమవయిపున నుండువారిని చూచి 'శపింపబడినవారలారా, నన్నువిడచి సైతానుకు దానిదూతలకును సిద్ధపరచబడిన నిత్యాగ్నిలోకి పొండి' అని చెప్పెను. దీనివలన నరకము మనుష్యునికి సిద్ధపరచబడలేదని స్పష్టమగుచున్నది. అయితే మనుష్యుడు సైతానువలెను, దాని దూతలవలె నయినప్పుడు అతడు వారుండుచోట నిత్యముండవలెను. ఇతరచోట్ల నరకమునకు 'నాశన స్థలము 'అగ్నిగుండము 'ఆరని అగ్ని 'నిత్య దండన' అనియు 'పనికిమాలిన ఆదాసుని వెలుపటి చీకటిలోకి త్రోసివేయుడి; అక్కడ ఏడ్పును పండ్లు కొరుకుటయు నుండును.' నాశనమునకు పోవుద్వారము వెడల్పు అనియు శ్రీయేసు పలికెను. అపొస్తలుడయిన పౌలు ఈభయంకరస్థలమునుగూర్చి చెప్పినదేమనగా దుర్మార్గులు ఆయన 'సన్నిధినుండియు, ఆయనపరాక్రమముయొక్క మహిమనుండియు నిత్యమయిన నాశనమనే దండన పొందుదు రని చెప్పుట. పేతురు నరక కూపచరయాని పిలుచుచున్నాడు. యోహాను తాను చూచిన దర్శనమందు నశించినవారి దుర్గతిని, రక్షింపబడినవారి సంతోషమును చూచుటలో నరకమును అగాధమని పిలచెను. 'నీవు చూచిన క్రూరమృగ ముండెను అది అగాధమునుండి పైకివచ్చిన నాశనమునకు వెళ్లబోవుచున్నది.' క్రూరమృగమునకును, అబద్ధ ప్రవక్తలును అంత్యనాశనమందు 'గంధకముతోనుండు అగ్నిగుం

డ మున్నది. అందువారు ప్రాణముతో వేయబడిరి. ఇదే శూన్య స్థలము ధనవంతుని లాజరును గురించిన దృష్టాంతమందు మన ప్రభువు చెప్పిన మాటలే కడపటి మాటలై యున్నవి. నిత్యత్వమును గురించి ఇక్కడ మనము కొంచెము చూడగల ము. ఆయన సాక్ష్యము విన్నమీదట ఇక్కడనుండు మన మందరము రాబోవు కోప మునుండి తప్పించుకొని పారిపోవుట మరణమే. అంత్యము కాదని మనకు తెలియు చున్నది. ఎచ్చట వారి జీవపురుగు చావదో, అగ్ని చల్లారదో అట్టి భయంకర నాశన స్థలమునుండి శ్రీయేసునందలి విశ్వాసము మాత్రమే మనలను రక్షింపగలదు.

జ్ఞానము కలిగియుండుము. బుద్ధి గలిగి బ్రతుకుము. తెలివిగలిగి నడువుము. నాశనమునుండి పారిపొమ్ము, తప్పించుకొనుము. ఇదే అనుకూల సమయము. నీవు నశించుట దేవుని కిష్టము లేదు. కాబట్టి ఆయన నిన్ను తన జనితైక కుమారుని ఇచ్చునంతగా ప్రేమించెను. నీవాయనయందు విశ్వసించితే నశింపక నిత్యజీవమును పొందుదువు.

## మనుష్యులు శ్రీయేసుయొక్క సాక్ష్యమును వినినతరువాత

సహితము ఏమీ నరకమున్నదని నేను నమ్ముటలేదా? అయితే నిత్యశిక్ష వున్నదని మాటికి మర్మాటికి ‘నేను నమ్మను’ అనే వారి నేమిచేయుదము. కన్నులుండి చూడజాలకను, చెవులుండి వినజాలకపోయినను వీరి నేమందుము. ఆయన వాక్యము లోని సత్యము నొప్పుకొనక, ఆయన పరిశుద్ధ నామమును దూషించి, నిత్యమైన సత్య ములనుగూర్చి ఎగతాళిచేయు జనులను ఇంకా ఉండనిచ్చుటవలన దేవు డెంతమంచివా డని ఆశ్చర్యపడుచున్నాను. ఇట్టిపాపులు పశ్చాత్తాపపడుటకు సమయమిచ్చుట యందు దేవుని కృపనుగూర్చి ఆశ్చర్యపడుచున్నాను. దయచేసి సిలువయొద్దకు మరి యొకసారి నాతోకూడి రమ్ము. మరణ మొందుచున్న రక్షకుని నిదానించి చూడు ము. మనుష్యుడా! ఇదంతా ఎందుకు! శ్రీయేసు యెందుకు చనిపోయెను? సిలువ మీద ఆయన చనిపోవుట ఆశ్చర్యమైన మరణము మాత్రమేనా? నశించుటయందు అపాయము లేకుంటే శ్రీయేసు మరణము లోకమెన్నడు చూడనిరీతిగా న్యాయము తప్పినదై యుండును. లేదా లోకములో నెన్నడును చేయబడని అత్యాశ్చర్యకర మైన మోసమై యుండును. ఇది దౌర్భాగ్యకరమయినదా లేక భాగ్యకరమైనదా? ఆహా, దేవా నీజనితైకకుమారు నెందుకు విడచితివి? పరిశుద్ధు డెందుకు మనుష్యుల వలన విసర్జింపబడి, తృణీకరింపబడి దూషింపబడవలయును? రాబోవు కోపములేకుం

కే అంత్య న్యాయపుతీర్పు లేకుంటే, నశించుట లేకుంటే మనుష్యు డెన్నడమునను శ్రమపడనిరీతిగా అయ నెందుకు శ్రమపడవలయును? శిలువమీద శ్రీయేసును నేచూచునప్పుడు ప్రాయశ్చిత్త మగత్యము లేకుంటే, నశించినవారు వేరొకవిధమున రక్షింపబడగలిగితే నేను నాస్తికుడనయి లోకములోనివారందరికంటె దౌర్భాగ్యుడనగుదును. అలాగుకాదు. ధ్వజ స్తంభముమీది కెత్తబడిన తాపకరి సర్పమును' చూచి జీవింపుమని ప్రకటించినట్లు శిలువయు ప్రకటించుచున్నది. నీవు చూడకుంటే మరణింతువు స్వనాశనమునకు కన్నులు మూసికొనుము.

## శ్రీయేసు పునరుత్థానమును ఆరోహణము నయిన వెనుక

పేతురు, యూదా ఇస్కరియోతుకు బదులుగా మరియొకరి నియమించుటకుగాను సహోదరులమధ్య నిలచి ప్రార్థించి తన ప్రార్థనలో యూదా తన అపోస్తలత్వము" బోగొట్టుకొనెననియు, యూదా తన చోటికి పోవలయునని' ప్రార్థించెను. దీనివలన యూదా నాశన స్థలమునకు వెళ్లుటకు తనకుతానే ఏర్పరచుకొనెనని విశదముగానగపడుచున్నది. అతడు శ్రీయేసు మాటలను వినక తన పాపఫలితముగా ఆయన నప్పగించుట కేర్పరచుకొనెను. అతను తన్నుతాను చంపుకొని మరణమైన వెనుక తన చోటికి వెళ్లెను. పాపులు నాశనస్థలము వారంతట వారే ఏర్పరచుకొనిరి. అట్టి స్థితి వారంతటవారే సిద్ధపరచుకొనిరి. కారణము వెనుక కార్యము కలుగునట్లు పాపము చేసిన వెనుక నరకము కలుగును.

శ్రీయేసుయొక్కయు,అపొస్తలులయొక్కయు మాటలును, మనసాక్షియొక్క స్పష్టమైన సాక్ష్యమును, సర్వకాలములయందును, సర్వ దేశములయందుగల సర్వజనాంగములయొక్క మనస్సాక్షియు, నశించినవారిస్థితి భయంకరమైనదని ఋజువు పరచుచున్నది.

## నశించినవారు దేవునితో, యేకత్వముగాని, అన్యోన్య సంబంధము గాని కలిగియుండరు

నశించుటనగా దేవునినుండి శాశ్వతముగ వేరగుట, శ్రీయేసు ఈయెడబాటునుండి మనను రక్షించుటకు శిలువమీద నీయెడబాటును సహించెను. ఆయనను మనల రక్షకునిగా నంగీకరించితే దేవు డాయనను మనకుమారుగా నంగీకరించి మనను విడిపిం

చును. దేవునివలన ఇయ్యబడిన ఆత్మ ఆయననుండి వేరగుటనగా నేమిటో తెలియ గోరుచున్నావా? శ్రీయేసు యెరూషలేములో శ్రమపొందిన దినములను చూడుము. గెత్సెమనెకు వెళ్లి తన చెమటరక్తధారలవలె భూమిమీద పడునంతగా వేదనతో ప్రార్థించుచున్న శ్రీయేసుప్రభువు చూడుము. ఆయన ప్రాణము మరణము చుట్టును బహు దుఃఖము పొందుచున్నది. అయినను ఆయన తన తండ్రియెదుట నున్నానని గ్రహించి నా తండ్రీ సాధ్యమయితే ఈగిన్నె నాయొద్దనుండి తొలగిపోనిమ్ము. అయినను నాచిత్తప్రకారము కాదు. నీచిత్తప్రకారమే కానిమ్మని ప్రార్థించెను.

శ్రీయేసు ప్రేతోర్యమందుండి జనులవలన దూషింపబడి కొట్టబడి, ముండ్లకిరీటము పెట్టబడినప్పుడు తండ్రి తనతోకూడ నున్నాడని ఎరుగును. ఆయన శిలువ వేయబడుటకు తేబడినప్పుడు, ఆయన చేతులలోను కాళ్లలోను మేకులు కొట్టినప్పుడును, తండ్రి ఆయనను బలపరచి, యోదార్చి, సహాయము చేసిన దెరిగియుండెను. ఆయన శిలువమీద నుండునప్పుడు తన శత్రువులకొరకు 'తండ్రీ వీరిని క్షమించుము. వీరేమి చేయుచున్నారో ఎరుగరని ప్రార్థించెను.' అయితే మధ్యాహ్నము మొదలుకొని మూడుగంటలవరకు ఆదేశమంతటిమీదను, సూర్యునిమీద చీకటి క్రమ్మెను. నరకపుచీకటి శ్రీయేసు ప్రాణముమీద విశేషముగా క్రమ్మెను. అప్పుడు శ్రీయేసు నరకములో వశించినవారి శబ్దమువలె గొప్ప శబ్దముతో నోరెత్తి 'నాదేవా, నాదేవా ఎందుకు నన్ను చేయి విడచితివని పలికెను'. నరకమనగా అదే. తండ్రితో నేకీభవించి యుండుటకు వీలుకాక విడువబడి ఒంటరిగా నుండుటయే. శ్రీయేసు మనిమ రక్షించుట కీగొప్ప వేదనను సహించెను. మనము శ్రీయేసు నంగీకరింపక ఆయనయందు విశ్వాసముంచకపోతే ప్రభువు తన న్యాయతీర్పుతో వచ్చు భయంకర దినమును తప్పక చూతము. అనేకులు పర్వతములను చూచి మామీద పడుమనియు, కొండలను చూచి మమ్ము కప్పుకొనుమని చెప్పసాగుదురుగాని తప్పించుకొనుటకు మార్గములేదు. ఎందుకనగా కాలము మించిపోయినది. నరకమునుండి వచ్చుశబ్దములు విని జాగ్రత్తపడుము. ధనికులిక నెంతమాత్రము దేవుని ప్రార్థించలేరుగాని, నాయందు కనికరపడి లాజరు తనకొనవ్రేలిని నీళ్లలో ముంచి నానాలుకను చల్లార్చుటకు అతనిపంపుము నేను ఈఅగ్ని జ్వాలలో యాతనపడుచున్నానని కంఠమెత్తి అబ్రాహాముకు ధనికుడు మొరపెట్టుకొనగలడు. నరకములోని ధనికులు మనలబిలచి రాబోవు కోపమునుండి పారిపొమ్ము. ఎందుకనగా జీవము కలిగినట్టియు, తన కుమారునియొక్కయు, తనభక్తులయొక్కయు,

మరణమునుగూర్చి పగ దీర్చుకొను కోపముగల దేవుని చేతులలో బడుట భయంకరమ యినదని చెప్పుచున్నాడు. 'ఆయనయందు విశ్వాసముంచుము, నీవు నశింపవు, నీతండ్రియయిన దేవునితో ఏకత్వమునుగాని, అన్యోన్య సంబంధమునుగాని నీవెప్పుడయి నను పోగొట్టుకొనవు.

## నరకములో నేమివని లేదు

ఇహలోకమందు ప్రేమతో చేయుకార్యమే నిజమయిన పని. పని మన బ్రతుకును సంతోషపరచుచున్నది. భారమును, ముండ్లకిరీటమును ధరించుటకు సహాయము నిచ్చుచున్నది. జయకర ప్రయత్నములను చేయించును. మన బ్రతుకును ప్రయో జనకరమయినదిగా చేయును. పరలోకము చాల పనిగల స్థలము. ఎందుకనగా ప్రేమ కార్యములు నిత్యము జరుగుచుండును. అప్పుడీలోకమందు సహితము సోమ రిగా నుండుట నరకమే; అయితే పని చేయువానికి సోమరిగా నుండుట యీలోక మే నరకముగా నుండగా అక్కడ నరక మెట్లుండునో తలంచుము. నరకములో నిత్యము సోమరులై యుందురు. మన చేతులు పని చేయక నిత్య మూరకుం డును. మనుష్యుడు నిత్య మేమియు చేయకుండుట మాత్రమే గాక కేవలమాప ణములును, అంగలార్పును, పండ్లు కొరుకుటయు, కలిగియుండును. నరకములో ప్రేమకార్యము లుండవుగాని ద్వేషము పశ్చాత్తాపము మాత్రముండును. ఆహా! దీని జూచిన ప్రభువయిన శ్రీయేసూ! నీయందు విశ్వాసముంచని ప్రతివానికొరకు కాచుకొనియున్న ఈభయంకర నాశనమునుండి పారిపోవుటకు మాకు జ్ఞానమిచ్చి నది ఎంతగొప్పనిత్యత్వము స్థిరపర్చగలదు. అని తలంచుము.

## నరకములో సంతోషము లేదు.

నీవెప్పుడయినను నిర్జనమయిన, సంతోషమయిన స్థలములకు వెళ్లియుంటివా? పుష్ప ములు పూయనట్టియు, పక్షులు పాడనట్టియు, ఎగరనట్టియు, చీమలు పారాడ నట్టియు, సమస్తము పాడుపడిన స్థలములకు వెళ్లియుంటివా? ఆసియా, ఆఫ్రికా, ఖండములం దిట్టి భయంకరమయిన యెడారులకు వెళ్లి చూచినాను. ఎడారియెంత సంతోషములేనిచోటు! అది చెట్టుచేమలు లేక కేవలము మండుచుండే యిసుకగల భయంకరస్థలము. అక్కడ సంతోషము లేకపోయినను, నరకమునకుపోల్చి చూచి నప్పు డది స్వర్గతుల్యము. ఒక డీలోకములో నెడారిని మంచిదిగా మార్చగలడు. గాని నరకములో మార్పే లేదు. అది సంతోష శూన్యస్థలము.

## నరకములో విశ్రాంతే లేదు.

నీ వెప్పుడయిన నిద్రరాక శ్రమ పడితివా? నీవు గంటలకొలది పడక మీద నేమేలొక్కని యుం డియుండినను లేక కొంతకాలము నిద్ర పట్టినప్పుడు దయ్యము వచ్చినట్లు త్రుళ్లిపడి లేచి యున్నావా? ఇట్టి నిద్రరాని స్థితి కొంతకాలమయిన వెనుక పిచ్చివానిగ జేయునని త లంచుట ఆశ్చర్యమా? ఈలోకములో నల్లమందు ద్రాక్షరసము కొంత నిద్రను విశ్రాంతి ని కలిగింపగలదు. గాని నరకమున కీమందు కనికిరాదు. నరకవాసులకు నిద్రయే కలుగదు. ఆదౌర్భాగ్యస్థలమందిదివరకు చేసిన పాపములన్నియు ఎడతెగకుండనే కన్పించుటకును, విసికించుటకును కారణములాయెను. ఎన్నడును చావని పురుగు అదే. తల్లిదండ్రులయొక్కయు, సహోదరులయొక్కయు, స్నేహితుల యొక్కయు కన్నులనుండి రాలిన కన్నీళ్లు కరిగిన సీసపు రవల మూసనుండి రాలునట్లు నిత్యము రాలును. ఆహా, పాపము! పాపము!! పాపము!!! పాపపు జీవిత మెం త భయంకరమైనది, పాపము విశ్రాంతిని కేవలము చంపివేయును.

## నరకములో తృప్తి లేదు.

నన్ను తృప్తిపరచుమని దావీదు ఒక కీర్తనలో ప్రార్థించుచున్నాడు. మన మిప్పు డదే ప్రార్థన చేయగలము గాని నశించినవారు చేయలేరు. పూర్వకాలమందు గ్రీకు లు కూడ నీసత్యము చూపించి యున్నారు. ఎట్లనగా:- టెంటోలస్ అనే వృద్ధుడు ఒక కోనేటిలో నిలచియుండెను. నీళ్లు గడ్డము వరకు వచ్చుచుండినను దప్పిచేత చా వవలసి యుండెను. ఎందుకనగా త్రాగుటకు వంగినప్పుడెల్ల నీళ్లు అదృశ్యమై నల్లటి యిసుక మాత్రమే తనచుట్టు నగుపడుచుండెను. అతని తలపైని ఫలవృక్షములు ఫల ములతో నిండియుండెను. తానొకపండును కోసికొనబోవునప్పుడెల్ల ఆ చెట్లపైని తుపాను విసరి మేఘములవరకు పోవుచుండెను.

ధనము, ఘనము, సంతోషము మరియేదయినను ఈలోకములో నొకఆత్మను తృప్తిపర్చలేవు. శ్రీయేసుభక్తి దప్ప మరేదియు తృప్తిపరచలేదు. నశించినవారు ఆయన సముఖమునుండి దూరముగా వెళ్లగొట్టబడియున్నారు గనుక నరకములో తృప్తిలేదు

ప్రసంగికులు నరకమును గూర్చి విస్తారముగ ప్రకటించి భయపెట్టుచున్నారని నీవనవచ్చును. అనేకులను నాశనమునకు నడిపించు సైతానుయొక్క అబద్ధముల

నిప్పులయొద్దకు తీసికొనివచ్చి కూర్చుండబెట్టెను. అప్పుడతడు తన సహోదరునివైపు చూచి 'విల్యం నా చేతనయినంతమట్టుకు నేజేసినానా?' నీవు పదునేడుగురునిరక్షించితివని జవాబియ్యగా 'అది నేనెరుగుదును, నేనెరుగుదును. అయితే నేను చేయవలసినంత చేయులేదు. అట్లు చేసితినా?' అని అడిగెను. విల్యమతని తిరుగ తీసుకొనివెళ్లి పరుండబెట్టెను. ఆరాత్రియం దతనికి సన్నిపాతగుణము సంభవించినందున విల్య మతని చేతులను బట్టుకొని నెమ్మది నొందింప బ్రయత్నము చేసెను. ఎడ్వర్డ్! నీవు పదునేడుగురిని రక్షించితివి. 'అని చెప్పగా విని నేనెరుగుదును, నేనెరుగుదును, అయితే ఇంకొకరిని రక్షించియుంటే ఎంతబాగుండునని ఎడ్వర్డు పలికెను.

ఈపట్టణమందు స్త్రీపురుషులు జీవితకాలమనే తుపానుగల సముద్రమునొద్ద మనమందరము నిలచి యున్నాము. ఎక్కడజూచిన, నపాయములు, కరువులు కలవు. స్త్రీ పురుషులు మునిగిపోవుచున్నారు. క్రిందికి పోవుచున్నారు. నీవును నేనును ఏదేపదే మన బలమంతయు పోయేవరకు మునిగి, తేగలిగినవారందరిని గట్టుకుదెచ్చి, ఆహా, ఇంకొకని రక్షించితే ఎంత బాగుండునని ఆసక్తితో పలుకుదుము గాక.

అక్కడుండువారంద రిది వినినవెంటనే కంటనీరు బెట్టిరి.

వందలాది జనులు తమ మోకాళ్లమీద నిలచి ఆత్మలపట్టు పనికొరకు తమ్మును తాము సమర్పించుకొనిరి. వెంటనే ప్రెసిడెంటు బిషర్ అను దొరగారు టారీదొరగారివెనుకవచ్చి ఎడ్వర్డు స్పెన్సరు ఇక్కడ గుంపులో కూర్చుండియున్నాడని చెవిలో చెప్పెను. వెంటనే టారీదొరగారు ప్రసంగపీఠపు ముందలిభాగమునకు వచ్చి ఎడ్వర్డు స్పెన్సరుయేమయినాడని పలుమారడుగుచుండెను. అతని మిగత జీవితకాలమంతయు శరీరబలహీనత కలిగియుండెననియు సువార్తసేవకొరకు సిద్ధపడుట విడిచెననియు నేనెరుగుదును గాని ఇప్పుడీస్థలమందున్నాడని నాకు తెలిసియుంటే ఈప్రసంగపీఠముమీదికి రమ్మనెదను. క్లివ్ లాండు దొరగారు టారీదొరగారి ప్రక్కకు ఆయనను వెంటనే తీసుకొని వచ్చెను. అప్పుడు కూడియున్న జనులందరు లేచి చప్పట్లుకొట్టి తమ చేతి రుమాళ్లను విసిరిరి. అక్కడ కూడియున్న ప్రతిమనిషియు కంటనీరు బెట్టెను. టారీదొరగారు అతని మెడమీద చేయివేయగా అందరు ప్రార్థింపసాగిరి. అప్పుడాయన 'దేవా ఎడ్వర్డు స్పెన్సరుయొక్క అంత్యకాలము మంచిదినములై యుండునటుల ఆశీర్వదించుమని ప్రార్థించెను.' స్పెన్సరు 'అలాగు నున్నదని మెల్లగా చెప్పెను. అక్కడ కూడియున్నవారిలో ప్రతివాడు ముందుకువచ్చి యుత్సాహమున సన్మానించిరి. వందలాదిజను లింతకుపూర్వ మెప్పుడును పొందని ఆసక్తితో ప్రేరేపింపబడిరి.

స్నేహితులారా! నీపనియు నాపనియు అనే సేవజేయుటకే రక్షింపబడితిమి. అనేకాత్మలను రక్షించుకొరకు నాశనమునుండి రక్షింపబడితిమి. ఈక్రింది ప్రశ్నలను చక్కగా నాలోచించి చూతము. నీవు రక్షింపబడినావా? రక్షింపబడగోరుచున్నావా? ఇప్పుడు రక్షింపబడగోరుచున్నావా? ఒక ఆత్మను మరణమునుండి రక్షించితివా?



## X. అధ్యాయము.

# HAVE ETERNAL LIFE.

# నిత్యజీవమును బొందుటకై.

అమెరికాలోని రవరెండు విల్యాము ఇ. హాచర్ డి. డి. దొరగారు జాక్ జాస్పరు అను నొక నీగ్రో బోధకుని జీవిత చరిత్రను వ్రాసియున్నారు. ఆచరిత్ర మిక్కిలి కరుణారసపూరితముగ వ్రాయబడినది. ఆబోధకుడు 'పరలోకమును' గురించి చేసిన ప్రసంగము నీక్రింద చెప్పబడురీతిని స్పష్టముగ వివరించుచున్నాడు. దీనిచదువుచుండగ మన హృదయములు పరలోకమునుగూర్చి చెప్ప వలవిగాని ఆశతో నింపబడవా? ఒక సబ్బాతు మధ్యాహ్నమున ఆయన యింటివద్దజనులు కిక్కిరిసియుండిరి. అది విల్యాము ఎలిసక్, మేరీ బారనెస్ అనువారి శవములను భూస్థాపన చేయు సమయముగ నుండెను. మూల వాక్యము వినిపింపబడి ప్రసంగము మాత్రము బలతరముగ చేయబడెను. ఆరంభమందు తన జనులకు గొప్ప సంగతులు చెప్పబోవుచున్నట్లగుపడెను. అయినను ఆరంభమందే ఎన్నడనుమానింపనివా డిప్పుడు కొంత అనుమానించి యిట్లనెను. విల్యాము ఎలసనును గురించి నేనొకమాట చెప్పెదను. నేను దీని చెప్పి నామనను నెమ్మది పరచుకొందును. ఎలసక్ మంచిమనిషి కాడు. తాను మంచివాడనని చెప్పుకోలేదు. మంచివాడగుటకు ప్రయత్నింపనూ లేదు. ఈలోకమందు దేవుడుగాని నిరీక్షణగాని లేకుండ నెట్లు బ్రదికితినో అట్లు చనిపోదువనెను. ఆయన చరిత్ర మంచిది కాదు. అది ఆయనకే తగినదయి యుండెను. చెట్లు ఎక్కడ పడునో అక్కడనే యుండును. దుర్మార్గముగా జీవించినవారికి ప్రసంగించుటకుగాని మహిమార్థముగా పాడుటకుగాని జాస్పరునొద్దకు వారిని తీసికొనిరాకుడి. దేవుడు అంగలార్చువారిని ఆదరించి, లొంగనివారిని హెచ్చరించును.

ఆయన ప్రకాశ ముఖముతో నిట్లు పలికెను.

అయితే నా సహోదరులారా, మేరి బార్నను అట్టిది కాదు. ఆమె గొర్రెపిల్ల రక్తములో తన్ను ఉతికి తెలుపు చేసికొని బ్రతికినది. ఆమె దైవభక్తముకలిగియుం

డినది. ఆమె ఎక్కడనున్నను నమ్మగలము. నాటక గృహములందుగాని, దుముకులాటలందుగాని, ఆటలందుగాని రాత్రులందు వీధులలోగాని అగుపడదు. దేవుని యింటిని ప్రేమించి ఇరుకును సంకుచితమయిన దారియందు నడుచును. ఆమెను బాగా ఎరుగుదును. ప్రార్థన కూటమునందును, రాత్రి భోజనకాలమందును, ప్రసంగకాలమందును, రోగులను పరామర్శించి దుఃఖించు పాపులకు సహాయము చేయుటను చూచితిని. నా సహోదరివైన మేరీ, నీకు సలాము. నీ పరుగు కడముట్టించితివి. నీవు నిజముగా కిరీటమును పొందుదువు.

ఇవి పలికినతరువాత జాస్పరు మరియొకవిధముగా మాట్లాడెను. అగ్నితో నింపబడెను. ఆయన కన్నీళ్లు ప్రకాశించెను. విడుదల ఆయన కాహళమాయెను. క్రమక్రమముగ నాయన మరణదేశమును సమీపించి దానిమీద దండెత్తువానివలె వెళ్లెను. ఆయన మాటలందు ఎవడో ఒకడు పంతముచేసి జగడమునకు రమ్మనినట్లు ఆయనమాటలు మండుచుండెను. మరణపు సభాస్థానమునకు క్రైస్తవునితోకూడ పోయి వీని బాధించుటకు నీబలము చూపుమని ఆభయంకరరాజుతో పలికెను. భీకరరాజు సన్నిధికి వెళ్లి 'నేను వచ్చితిని నీవు చేయగలిగినకీడు చేయుమని చెప్పుట దేవుని బిడ్డకుగల గొప్ప ధైర్యము నింత చక్కగా వివరించుటవలన ఆశ్చర్యము కలుగుచున్నది. అందుచేత మరణము లొంగి, మెల్లగా మాటలాడి, తానపజయము పొందితినని ఒప్పుకొని ఇమ్మానుయేలు బిడ్డలకు సేవ జేయుటకు సిద్ధముగా నున్నానని వెల్లడి చేసెను. అప్పుడాయన తన ముఖమును సమాధిలో నుంచుట కిష్టముగలవాడయి నిజముగా నొక మనిషితో మాట్లాడినట్లు 'సమాధీ, సమాధీ, సమాధీ, నీవిజయ మెక్కడ? నీగొప్పధ్వజము క్రిందపడి యున్నట్లు వింటిని. ఈదారిని వచ్చువారందరిని భయపెట్టువాడవే! నీసేవలకు బయటకు రప్పించి నీజయధ్వజముల నెత్తుము. నీ చేయిచాపుము. నీవేమిచేయగలవో నన్ను జూడనిమ్ము' అని కేకవేసెను. అందు కాసమాధి, 'నాకిప్పుడు జయములేదు. ఒకప్పుడుండెను. అయితే రాజైన శ్రీయేసు ఒకప్పుడీదేశముగుండా నడచి నాధ్వజమును చేసెను. ఆయనజనులికమీదట నెప్పుడయినను తొందరపడకుండునటుల నాద్వారమును తెరచి మహిమలోనికి వారిని ధారాళముగ పోనిమ్మని' చెప్పియున్నాడు.

అప్పుడు జాస్పరుగుండె ఝల్లుమను శబ్దముతో 'ఓహో దేవా నీవు దానిని వినుచున్నావా? నా యజమానుడయిన శ్రీయేసు, మరణపు ముల్లును తీసివేసినాడు. భీకర

రాజుయొక్క దండమును విరిచినాడు. ఆయన సమాధిలోనికి వెళ్లి దాని జయధ్వజములను తీసికొని ఆదారిని పోవు తర జనులకొరకు సొగసుగను మనుష్యగ నుండునట్లు నాటెను. ఇంతేకాదు ఆయన ఒక కీర్తన వ్రాసి మనము సూర్య చంద్ర నక్షత్రములద్వారా వెళ్లునప్పుడు దాని పాడగోరుచున్నాడు. ప్రభువయిన శ్రీయేసుక్రీస్తుద్వారా మనకు విజయము దయచేసిన దేవునికి స్తోత్రము. జాస్పరు క్లుప్తముగా మాటలాడిన శ్రేష్ఠమాటలవలన ఆయన గొప్పతనమును నేనెంచచాలను. ప్రతివిషయము స్పష్టముగా చెప్పబడిన ఈసంగతి యావత్తు జనులు వినుచుండిరి. వారు పట్టజాలని మహత్తయిన ప్రోత్సాహముతో నింపబడిరి.

జాస్పరు స్థిరబుద్ధితో మరల చెప్ప నారంభించి యిట్లనెను. 'నా సహోదరులారా! నేను పరలోకమునకు పోవలసినట్లయిన శాయంతట నేనెట్లు నడచుకొనవలసినది పలుమారు నన్ను నేనడుగుకొంటిని. నాకు సంభవించినవాని చూచి భయపడుచున్నాను. ఇప్పుడు మహిమ రాజు నగరిదర్శనము క్షణమాత్రము నాకు కలుగనుండిన అది యేఆటంకము లేకుండ కలుగుచున్నది. నేనక్కడ చేరినప్పు డేమిచేయవలెనో తెలియునా?

మొట్టమొదట నేను జీవజలనదిని చూతును. దానియందలి నిర్మలమయిన నీళ్లను, దాని గట్లమీదనుండు చెట్లయందలి నానావిధఫలములు కోరుదును. ఈనరసిన నాతల పలుమారు జ్వరముతో నుండుచు రాత్రియంతయు నొచ్చినందున పడకమీద పొరలితిని, ఆపరలోకమునందు జీవజలనది పొంగి పారునప్పుడు దానియందు నాతలను చల్లగా చేసికొనుటకు అనేకసారులు కోరితిని. దేవునికి స్తోత్రము కలుగుగాక. ఆనదిని జూచుట దానినీళ్ళు త్రాగుట, ఆచెట్లక్రింద విశ్రమించుటయే నాతలంపు.—తక్షణమే జాస్పరు ఒక కీర్తన పాడెను. ఆహా అక్కడవుండుట ఏమైయుండవలెను అను పల్లవి దప్ప నాకేమియు జ్ఞాపకము లేదు.

దీనితర్వాత జాస్పరు మరియొక సంగతి చెప్పెను. ఆపట్టణాలంకారమును నాతండ్రియింటిని నీకు చూపించెదను. వెడల్పుగానున్న వీధులను మీకు చూపించెదను. నాతల్లి అక్కడ చేరినప్పుడు ఆమె యింటిపనులు చేయుటకొరకు నారక్షకుడు ఆమె నుంచిన యింటిని వెదకుడి. ఆయింటి పెరటిలో రోజాపుష్పములును, ముంగిటిలో ద్రాక్షావల్లియు కలదని ఎరుగుదువనెను. జాస్పరు యిట్టి తలంపులతో నిండి

యుండగా అతడు తన సంభాషణను నిలిపి 'ఇదిగో ఆ పెద్దయిల్లును చూడుము. అది యెంతో సుందరముగ నున్నదని' కేకవేసెను. వెంటనే ఆయన చేతులు తట్టుచు హృదయము సంతోషముతో నింపబడి 'హల్లెలూయ, ఆయన జాన్ జాస్పరు అని తలుపుమీద వ్రాయబడిన దీనిని చూడుడనెను. నాకొరకు స్థలము సిద్ధపరచుటకు ఆయన ముందుగా వెళ్లెను. అదిగో అక్కడ నున్నది చూడు! నావంటి బీదపాపికొరకు ఆయన దీని కట్టెను. అది నిత్యముగ నాది. తక్షణమే అతడు 'ఆహా అక్కడవుంటే యేమై యుండవలెను. అను పల్లవిని తిరుగ పాడుచుండెను.

అప్పుడు చాలకాలమువరకు నిశ్శబ్దముగా నుండెను. అప్పటికి పూర్ణముగా డెబ్బదిసంవత్సరముల ప్రాయము కలిగిన ఆ ముసలి సువార్త సేవకుడు నిశ్శబ్దముగా నుండిన కారణము తెలిసినది. జనులందరు మరీ నిశ్శబ్దముగ నుండగా అతడు నేను సింహాసనమునకు వెళ్లి, రాజు తన రాచవస్త్రములు ధరించుకొనినప్పుడు చూతునని చెప్పెను. ఈసంగతికొద్ద ఆయనను గూర్చి ఎక్కువగా నేర్చుకొనగలము. అతను ఆతురతయు, గౌరతయు, సకల సంభావణను మించెను. సింహాసనమందలి వెలుగు దూరమందుండి ఈయనమీద పడెను. గొప్ప తెల్లని సింహాసనమును, దానిచుట్టు ఆశ్చర్యముతో నమస్కరించుచున్న పెద్దలును, రాజు నాజ్ఞకొరకు మౌనముగా కనిపెట్టుకొనియున్న ప్రధాన దూతలును, మహామహిమగల రాజును, విమోచింపబడిన లెక్కింపలేని సైన్య సమూహమును అక్కడనుండెను. దీనిని వినువారికిని చదువువారికిని మహాశ్చర్యమును కలిగించెను. ఇప్పటికి ఆవృద్ధుడయిన నీగ్రో ప్రసంగియుహిమ పరచబడినట్లగపడుచున్నది. భూమి ఆయన నుంచుకొనజాలదు. అతడు చురుకుదనముతో ప్రసంగపీఠముచుట్టూ ఎగిరెను. ఒక జయశీలునికి వందనములు చెల్లించువానివలె పరవశుడై తన చేరుమాలను విసరుచుండెను. అతని ముఖము కన్నీటి ధారలచేత నింపియుండెను. విమోచకునిముందు నమస్కరించుచుండెను. చప్పట్లు కొట్టుచు, నవ్వుచు, కేకలు వేయుచు, కన్నులనిండ నున్న నీళ్లను తుడుచుకొనుచుండెను: ప్రతివానికిని పరవశమును, ఆశ్చర్యమును కలిగించెను. అది నిలుపబడినట్లు అగుపడుచుండగ తక్షణమే ఆయన, ఆహా! అక్కడుంటే ఏమైయుండు ననే మనస్సు కరిగించే మాటలు తిరిగి పలికెను. ఇది అన్నిటికంటె అత్యున్నతమయిన సంగతి. దీని తరువాత మరేమి రాజాలదు. మనము అనేకసార్లు అనేక యెత్తయిన స్థలములలో నుంటిమి. తిరుగ మనము తీసికొనిపోబడము. అయితే అదిగో

జాన్సరు ఆస్థలమును సంపూర్ణముగా చూచుచున్నాడు. ఆయన ముందుగా వెళ్లాచి సిద్ధపడి యున్నాడు. ఆయన క్షమాపణా వాక్యములుగా 'నా సహోదరులారా! నేనొక సంగతి మరచిపోలేదు. మరియొక ప్రయాణము నేను చేయవలెను. ప్రభువు వల్ల విడుదల నొందితిని: వారిని నేను చూడలేదు. నేను వారిని చూడకుండా పోలేను. వారు అనేకులుందురని యెరుగుదును. నేను వారిని తప్పక చూడవలెను. ఆయన క్షణములో పరలోకమంతు వరుసగా నిలువబడియున్న పరిశుద్ధులను మాకు చూపెను. అక్కడ వారు లెక్కింపగూడని గొప్ప సమూహమై మహిమతో నిండియుండిరి. మేమందరము వారి నొక్క క్షణములో దర్శించితిమి. ఇక్కడ మొదట ప్రవేశించిన మన సహోదరుడైన హేబేలు ఇదుగో, మహిమలో ప్రవేశించుటకు ప్రయాసపడిన మన సహోదరుడైన హనోకు ఇదుగో, తన రథము నంపి పట్టణములోని దగ్గర దారి ప్రవేశించినవృద్ధురాలైన లిజి ఇదుగో' అనుచు నీలాగు ఆయన పితృలకు, ప్రవక్తలకు, అపొస్తలులకు, హతసాక్షులకు, ఆయన సహోదరులకు తాను ప్రేమించినవారై తనకంటె ముందుగా వెళ్లియున్న వారికి సలాములు చేయుచు తటాలున తిరుగ దుమికి యింటికిప్పుడు వచ్చునంతగా గొప్పకేక వేసెను. ఇదుగో ఆమె యిక్కడ చేరువని నేనెరుగుదును. మేరీ బార్న్సను నీకిల్లు కోరినది. ఆమెను గొప్పగ సన్మానించి నూతనముగా మహిమపర్చబడిన జాన్సరుయొక్క తలంపులలో మేరీ బార్న్సను ఉన్న ట్లొకక్షణ మగుపడెను. కాగా తక్షణమే అంకితము మూర్చబడెను. చచ్చినవారనిగూర్చి అగుంపు పాడుచున్న కీర్తనయొక్క పల్లవిగా గొంతెత్తి 'ఆహా అక్కడ వుంటే యెమ్మ యుండునని' పాడుచుండెను. జాన్ జాన్సరను వృద్ధక్తునికి కలిగిన దర్శనమువల్ల దేవావేశము నొంది 'నిత్యజీవము పొందుటకై ఆయన యిచ్చెను' అనే మన ప్రభువయిన శ్రీయేసుక్రీస్తుయొక్క మాటల భావము నిప్పుడు మనంతట మనమే చదువుదము. ఇదే చదువులన్నిటిలో మంచి చదువు. అన్ని విషయముల మించిన విషయము, దర్శనము లన్నిటిని మించిన దర్శనము. మనము దేవుని నెరిగినట్లయిన నిత్యజీవము కలవారమే. నిత్య జీవము కలిగియుండుట పరలోకమందుండి విశోధింపబడిన దేవుని పరిశుద్ధ సమూహముతో పరలోకము నాథల్లని చెప్పుటతో సమమై యుండును. మనము పరలోకమునుగూర్చి మాట్లాడునప్పుడెవరును అభ్యంతరపడరు గనుక నాకు సంతోషము. కొందరు పరలోకములో నిత్యము ఆశీర్వాదములను పొందుదు మనే సంగతి విడచి అక్కడ మన నిత్యత్వము కూర్చుంటుటతోను పాటలు పాడుటతోను గడుపుదుమని ఎగతాళిచేయుట నిజమే.

పరలోకమునుగూర్చి అట్లు తలంచువారు కొద్దిమంది, వారు దానికి దూరస్థులునయి
యున్నారు. లోకముయొక్క ప్రతిభాగమందును గల మెరిగిన జనాంగముల నన్ని
టిలోను నానావిధజాతులు, స్థితిగతులుగల జనులలోను, పూర్ణ సంతోషమును అమ
రత్వమును గల పరిశుద్ధులు తిరుగు ఒకభూమి కలదనియు, అదే మననిత్యమయిన ఇల్ల
నియు నెరుగుదుము. అక్కడ దుర్మార్గులు తొందర చేయరు. అలసటనొందినవా
రు విశ్రాంతి తీసికొందురు. రాత్రిరాగానే పక్షి తనగూటికి నేరుగా ఎగిరి వచ్చుస్వ
భావముకలదై నట్లుమనుష్యుని ఆత్మకు మరణచీకటులు కలిగినప్పుడు గువ్వరెక్కలు గ
లిగిఆకాశము తట్టు ఎగిరినిత్య విశ్రాంతి నొందుటకు అంగలార్చి అరచుట నిశ్చయము.
'దేవుడు లోకము నాలాగున ప్రేమించెను. కాగా ఆయన తన జనితైక కుమారుని
గా పుట్టినవానియందు విశ్వాసముంచు ప్రతివాడును, నశింపక నిత్యజీవము పొందుట
కయి ఆయనను ఇచ్చెను.' నిత్య జీవము; అహా, ఇది యెంతటి స్వాస్థ్యము! లోక
రాజ్యములన్నియు, రాజుల ధనమంతయు దీనితో పరిపోల్చితే ఇవి ఎంతస్వల్పము.

అందు నాకొకనగర మమరుచుండ
గుడిసెలు గుడారులెందుకీ పుడమియందు
తోలివేయంగబడిన పుత్రుండఁ గాన
మహిమరాజును స్తుతియింతు మమతఁ దీఱ॥

## అయితే పరలోకమనగా నేమి?

అది యెక్కడ నున్నది? అక్కడ చేరినప్పుడు మన మేమి చేయవలెను? అను నీప్ర
శ్నలకు ప్రత్యుత్తరము లియ్య ప్రయత్నింతును. నిజముగా పరలోకము మనవశ్యము
చేసికొనినప్పుడు మన సంభాషణగాని, నడకగాని యిక్కడ గృహీతము పరలోకసం
బంధమయినప్పుడు లోకము మనకు మనోహరమయి యుండదు. పాపము మనలను
మరలుకోల్ప లేదు. ఎందుకనగా మనము పునాదులు గల పట్టణముకొరకు చూచు
చున్నాము.

పరలోక మనగా నేమి? పరలోక మనగా నిత్యజీవమని శ్రీయేసు వివరించుచు
న్నాడు. నిత్య జీవము మాత్రమే పరలోకమని అర్థమిచ్చును. పరలోక మనగా
దేవునితోడి యేకత్వమును, పరస్పర సంబంధమునయి యున్నది. శాస్త్రప్రకా

రము చెప్పినప్పుడమరలోక మనగా తన చుట్టుప్రక్కల నుండువాటితో పొందిక కలిగియుండుటయని భావము. ఇక్కడ మనమట్టున నుండువాటితో సమ్మతిగా నుండలేము. ఎందుకంటే యిక్కడ అభ్యంతరపరచబడకుండు నిజమయిన ఐకమత్యమును సంబంధమును దేవునితో కలిగియుండలేము. మన ప్రభువు సిలువమీద పలికిన 'సమాప్తమయినదన్న మాట మనమును చెప్పగలిగినపుడును, చివరకు 'నీ చేతులకు నాయాత్మ నప్పగించుచున్నానని' చెప్పగలిగినపుడును, మనముకూడ దేవునితో నేకమయి యుందుము. శ్రీయేసు యోహాను పదునేడవ అధ్యాయమందు యేకత్వమును గురించి ప్రార్థించిన ప్రార్థన మనదగును. పరస్పర సంబంధము లేకుండ ఏకత్వముండదు. ఆయనను అంత్యమందున చూచి ఆయనవలె మనముండునపుడు ఈ ఏకత్వము మనదగును. అదే నిత్యజీవము. పరలోకము నిత్యజీవమై యున్నది. నిత్య జీవము సేవయం దగుపడుచున్నది. అపొస్తలుడయిన యోహాను బైబిలుయొక్క కడపటి అధ్యాయమందు పరలోకము నిజముగా ఏదేనువలె నుండునని చెప్పుచున్నాడు. ఎందుకనగా 'యిక మీదట శాపగ్రస్తమయిన దేదియు (దానిలో) నుండదు, దేవుని యొక్కయు గొర్రెపిల్లయొక్కయు సింహాసనము దానిలో నుండును. ఆయన దాసులు ఆయనను సేవించుచు ఆయన ముఖావలోకనము చేయుచుందురు. ఆయననామము వారి నొసళ్లయం దుండును. రాత్రి యిక నెన్నడు యుండదు; దీపకాంతిగాని సూర్యకాంతిగాని, వారి కక్కరలేదు, దేవుడయిన యెహోవా వారిమీద ప్రకాశించును; వారు యుగయుగములు రాజ్యము చేయుదురు.' ఈలాగుండును. దేవుని సేవ, యేలుబడై యున్నది. ఇక్కడ చక్రవర్తిక్రింద గవర్నరు పని చేయుట గొప్ప ఘనమయిన కార్యమయితే, అక్కడ పరలోకమందు రారాజుక్రింద సేవచేయు టెంతటి ఘనమయిన కార్యము! నిత్య జీవము పరలోక సేవయై యున్నది.

## ఈలోకములో సంతోషమును గూర్చి

మనము మాట్లాడునప్పుడు వశించే చిత్తవిభ్రమమును గురించి మాట్లాడుచున్నాము. అయితే నిత్య జీవము నిలచే సంతోషమయి యున్నది. అదే పరలోకము కేవల సంతోషముగల దేశములోకి మనము వచ్చినప్పుడు జీవమెరుగుదుము. ఇండియాలో జీవించుట ఒకని యింటియందు సంతోషమును తీసివేయునట్లు కొన్ని పొర్లు

అగుపడును. చాల సంవత్సరములక్రిందట మాప్రాణరక్షణకొరకు ఇండియాను విడచుటకు బలవంతి పెట్టబడితిమి. మాబిడ్డలలో నొకరు కొన్ని సంవత్సరములు రోగియై యుండెను. ఆయు నెప్పుడయినను నవ్వలేదు. ఆడలేదు. చచ్చినట్లు పడియుండెను. ఆయునయందున్న కొద్దిజీవమును రక్షించుకొనుకొరకు మహా జాగ్రతతో పరామర్శింపవలసి వచ్చెను. తుదకు మేము స్విట్జర్లాండులోని పర్వతముల దగ్గరకు వచ్చినప్పుడు ఆపిల్లవాడు ఆపర్వతములమీఁదనుండి వీచిన నిర్మలమయిన గాలిని తనజీవితమందు మొదటిసారి పీల్చుకొనినందున ప్రాణమువచ్చి చాలా సంతోషముతో నుండెను. ఆగొప్ప దినమంతియు చప్పటు కొట్టుచు, ఆడుచు పాడుచుండుటవలన అది మాకు తెలియకనే గడచిపోయెను. ఆయనస్నేహితు లాయనకు 'ఆనందతాంషక్' అనే పేరుపెట్టిరి. ఎందుకంటే ఆపిల్లవాడు మహాసంతోషముతో 'నాకు చాలసంతోషము, నాకు చాలా సంతోషమని' చెప్పెను. భూ సంబంధమయిన మరణకరబ్రతుకులోనుండి దేవునియొక్క స్థితికి, అనగా, వెలుగులోనికి వచ్చునప్పుడు పరలోకసంతోషము అట్టిదై యుండవచ్చును. ఆహా అక్కడుంటే యెంత బాగుండును!

## నిత్యజీవము నిత్యవిశ్రాంతియై యున్నది.

శాశ్వతమయిన విశ్రాంతి పరలోకము. యోహానుయొక్క మహిమగల దర్శనమే వాదగ్గినమంఁబు యున్నది. 'అప్పుడాకాశమునుండి ఒకశబ్దము వింటిని. అది ప్రభువుయందు మృతిబొందు మృతులు ఇప్పటినుండి ధన్యులు. అవును వారు తమ ప్రయాసములనుండి విశ్రాంతి పొందుటకు మృతి పొందుచున్నారు'. క్రైస్తవుల పాడెయొద్ద నిలచినప్పుడు వారు తమ ప్రయాసములనుండి విశ్రాంతి నొందియున్నారను మాటలను అనేకసార్లు ధ్యానించితిని. విశ్రాంతి యనగా పరలోకమే. భూలోకమందు మన బ్రదుకు ఎంతటిది? మోషే ఇట్లు చెప్పుచున్నాడు. 'మాఆయుష్కాలము డెబ్బది సంవత్సరము లధికబలమున్నయెడల యెనుబది సంవత్సరము లగును. అయినను వాటి వైభవము ఆయాసమే దుఃఖమే. అది త్వరగాగతించును. మేమెగిరి పోదుము'. ప్రయాసము, దుఃఖము. ఈరెండును భూసంబంధమయిన బ్రతుకుయొక్క సారసంగ్రహమై యున్నవి. ఈలోకమందు మనకేమియున్నది? పాపము

పరిశుద్ధులను ప్రియాతిశయముతో ఆహ్వానించుచున్నది, అంటే పరలోకములో మనకు నిత్యజీవము కలదు. అక్కడ మరణము గాని, ప్రయాసము గాని, దుఃఖము గాని లేదు. అంతేకే శాశ్వతానందము మాత్రమే కలిగియుందుము. ఆహా! అక్కడ ఉంటే ఎట్టుం డును.

## పరలోకము దేవునితో ఏకత్వము, సంబంధము

కలిగియుండుటకైయున్నది. అనిత్యత్వముండదంత టాదైవసంబంధమయి సమానత్వము కలదు. పరలోకము గొర్రెపిల్లతో కూడ మనము ఏలుచున్నప్పుడు అది ఆయన సేవయై యున్నది. పరలోకములో నిత్యానంద మెందుకనగా దానియందు చక్కని విశ్రాంతి కలదు. అక్కడ దేవుడు మనల నెరుగునని యెరుగుదుము. అక్కడ మనకు తృప్తి కలుగును. ఎందుకనగా నిత్యజీవము నిత్యతృప్తియై యున్నది. అదే పరలోకము. రాజైన దావీదుకూడా ఈలోకముయొక్క దుఃఖప్రయాసములను మనలో కొందరవలె రుచిచూచి తాను వ్రాసిన పదునేడవకీర్తన నిట్లు ముగించుచున్నాడు. 'నేనయితే నీతిగలవాడనయి నీముఖము దర్శనము చేసెదను, నేను మేల్కొనునప్పుడు నీస్వరూపదర్శనముతో నా ఆయాసను దీర్చుకొందును.' ఆతృప్తి నొందనట్టియు, ఆశ దీరనట్టి హృదయము ఈవిశ్రాంతిలేనితనముతోను దుఃఖముతోను నిరాశతోను, తొందరతోను, మోహావాకారకు వెలిచుయుండును. తొందర నొందిన హృదయము నెమ్మది నొందును. తుదకు నీవు పరలోకము చేరుదువు. అక్కడ నీఆశ దీరును. ఎందుకంటే పరలోకము తృప్తిని కలిగించును, అని ప్రభువు చెప్పుటను వినుము. ఆయనయందు విశ్వాసముంచుము. నీవు నశింపక నిత్యజీవము పొందుదువు.

## పరలోక మెక్కడ నున్నదనే ప్రశ్నకు

ఎక్కడ క్రీస్తుప్రభువునతో అదే పరలోకమని ఒకచిన్నబిడ్డ ఇచ్చిన ప్రత్యుత్తరము కంటె మంచిజవాబు మనకు దొరకదు. శ్రీయేసు యెక్కడ నున్నాడు? ఆయనతండ్రితో మహిమయందున్నాడు. శ్రీయేసు ఆయనప్రియులతో నిట్లు చెప్పుచున్నాడు. మీహృదయములు కలవరపడనియ్యకుడి; దేవునియందు విశ్వాసముంచుడి, నాతండ్రి

గుపడును- సూర్యచంద్రులు ఎవరును చూడజాలని వెలుగయిన దేవుని రాయభారులకు నీ తమ పత్రికాశతలో పలుకుచున్నాడు- లోకమంతయు మన దేవునియిల్లు- తండ్రి యెక్కడ నున్నాడో, శ్రీయేసు యెక్కడనున్నాడో అక్కడనే పరలోకమున్నది- పరలోకమందు తండ్రి యింటిలో 'అనేక నివాసములు' కలవు- పరలోక నివాసము ఈలోకనివాస మంతటివి కావు- ఒకనగర మెంతస్థిరమైనదయినను సరే కాలము దానిని మార్చి శిథిలపరచి నాశనము చేయును- ఈలోకమందు మహాప్రఖ్యాతికెక్కిన నగరములు న్యూయార్కు పట్టణమందలి యొక వ్యాపారస్తుడు చెప్పినట్లు బాటసారుల సత్రములే- అనగా మనము మన గమ్యస్థానమునకు చేరువరకుదిగి వంట చేసికొను స్థలములే- పరలోకమందనేకనివాసములు గలవు- అవి నివాసము చేయుస్థలములు- అక్కడ మనము శాశ్వతముగ నుందుము- ఆనివాసస్థలములను నేదియు నాశనము చేయలేదు- ఎందుకనగా నివి నిత్యము నిలుచునవి గనుక కాలభేదముండదు-'సిద్ధపర్చుట' అనేమాట వెనుకకు సిలువయొద్దకును, ముందర కిరీటము నొద్దకును నడిపించుచున్నది- శ్రీయేసు తన జయకర మరణమందు 'సమాప్తమయినది' దని చెప్పినప్పుడు ఆయనయందు విశ్వాసముంచువారిని పరలోకములో ప్రవేశపెట్టుటకయి సమస్తమును సిద్ధపరచుటను ముగించెను. కాబట్టి వారిప్పుడు కిరీటముకొరకు ముందు చూచుచున్నారు- పాపు మరణమనే యోర్దానునదిని దాటినతరువాత పొందబోవు జీవకిరీటముకొరకు ముందు చూచుచున్నారు-

> తేజోమయలోకము-నాస్వర్గము-రాజిత సుక్రమము-నిశ్శోకము = పూజిత
> మమలము-ప్వరము కేవలధర్మ-భాజిగైు నిర్మింప-బడె నీశ్వరుని చేత = నా
> జగతి క్రీస్తుని యనుగ్రహ-భాజనంబున నక్షయంబగు-తేజమతిపావ
> నము లబ్ధంబయి జనులెల్లఁ గొందుచుందురు ॥వినరే॥

## పరలోకములో ప్రవేశించినపిమ్మట యేమిచేయుదుము?

నిత్యత్వమును మనమెట్లు గడుపవలెను? వెయ్యి సంవత్సరములు ఒకదిన మెట్లగునని ఒక అధికప్రసంగియయిన సన్యాసి ఒకప్పు డడిగెనని ఒకపురాతనకథ కలదు. అత డడవిలో ప్రవేసించి ఒక మనోహరమయిన పాట పాడుటను వినెను. ఒకగంటసేపు మాత్రము తిరిగి తన మఠమునకు వచ్చెను- అయితే ఆస్వల్పకాలములో ప్రతిది ఎంత

గొప్పతూర్య మెందెను? అతని సేవ కొరుగుదురు- అతడెవరి నెరుగడు- ఆ చకోర
పక్షి పాడుటను విని పెర్యోండ్లు గతించిపోయెను- ఆహా పరలోకమందు సంగీతముం
డును- మనము పాడుదుము- మూడీదొరగారు కీర్తన పాడ ప్రయత్నించునప్పుడెల్ల
నాకు నవ్వు వచ్చుచుండెను- అయితే యిప్పుడాయన పాడగలడు- నిత్యము పాడ
గలడు-

సతతమచ్చట సాధువు-దీప్త కిరీటాంచిత మస్తకవిశిష్టులు-ఘననిష్ఠులు
=నతిభక్తితో నీశ్వరాననముజూచుచు-స్తుతిజేతురో దేవ-శుభదదయా
నిధి=సతతమును నీసద్గుణావళి-నుతియొనర్పగనీదు సన్నిధి-నతులితా
నందమునుండెదు-స్థితియొనంగితివనుచు మ్రొక్కుచు ॥వినరే॥

నా ఆత్మా యోహానువలె పైనచూచి వినుము 'మరియు అగ్నితో కలిసియున్న
స్పటికపు సముద్రమువంటి దొకటి నేను చూచితిని. ఆ క్రూరమృగమునకు దాని ప్ర
తిమకును దాని పేరుగల సంఖ్యకును లోబడక వాటిని జయించినవారు దేవుని సేవార్ధ
మయిన వీణెలుగలవారయి యాస్పటికపు సముద్రమునొద్ద నిలచియుండుట చూచితిని
వారు యెహోవా దేవా సర్వాధికారీ నీక్రియలు ఘనమయినవి, ఆశ్చర్యమయినవి;
యుగములకు రాజా నీమార్గములు న్యాయములు సత్యములునయి యున్నవి, యెహో
వా నీవుమాత్రము పవిత్రుడవు. నీకు భయపడనివాడెవడు? నీనామము మహిమ ప
రచనివాడెవడు? నీన్యాయవిధులు ప్రకటనమయినవి గనుక జనులందరువచ్చి నీయె
దుట నమస్కారము చేసెదరని చెప్పుచు, దేవుని దాసుడగు మోషే పాడిన కీర్త
నయు, గొర్రెపిల్ల కీర్తనయు పాడుచున్నారు'. ఆహా, ఆసంగీతపాటకులలోనుం
డే ఎట్లుండునో! ఆస్తోత్రగీతపువీణె లెంతరమ్యమయిన శబ్దము నిచ్చునో! నేను ఆ
గుంపులో కలసి పాడుదును, నీవును పాడుదువా?

## పరలోకమందు మన మాయన నారాధింతుము.

నమస్కరింతుము. ఆమహిమకరమయినదినము వచ్చును. యోహాను చూచిన నా
లుగు జీవులును, ఇరువదినలుగురు పెద్దలుమాత్రమేగాక విమోచింపబడిన సమూహ
మంతయు వారివలెనుండి వారితో కలసి మన దేవుని ఆరాధింతుము. ప్రత్యక్షి 4
అధ్యాయమందు ఆయారాధనాక్రమ మెటులవ్రాయబడియున్నదో చూడుము 'ఈ
నాలుగు జీవులలో ప్రతిజీవికి ఆరేసిరెక్కలుండెను, అవి చుట్టును రెక్కలలోపటను
కన్నులతో నిండియున్నవి. అవి భూతవర్తమాన భవిష్యత్కాలములలోనుండు
సర్వాధికారియగు దేవుడునగు యెహోవా పరిశుద్ధుడు, పరిశుద్ధుడు, పరిశుద్ధుడుఅని

మానక దివారాత్రము చెప్పుచుండును. ఆసింహాసనమందు కూర్చొనియుండి యుగ యుగములు జీవించుచున్నవానికి మహిమయు, ఘనతయు, కృతజ్ఞతాస్తుతులును కలుగును గాకని ఆజీవులు కీర్తించుచుండగా అఇరువదినలుగురు పెద్దలు సింహాసనమునందు కూర్చుండువానియెదుట సాగిలపడి యుగయుగములు జీవించుచున్నవానికి నమస్కరించుచు-యెహోవా మాదేవా నీవు సమస్తమును సృష్టించితివి. నీచిత్తమును బట్టి అవి యుండెను; దానిని బట్టియే సృష్టింపబడెను గనుక నీవె మహిమ ఘనత ప్రభావములు పొందనర్హుడవని చెప్పుచు తమ కిరీటములను ఆసింహాసనము నెదుట వేసిరి' సింహాసనముమీదనున్న గొర్రెపిల్లకు చేయబడిన ఆరాధనయే పరలోకములో మనము చేయు పనియై యున్నది. ఆయారాధనయే నిత్యజీవము. అపొస్తలుడయిన పౌలు వ్రాసిన ప్రేమమాటయందు యిట్లు చెప్పుచున్నాడు. 'మనము కొంతమట్టుకు యెరుగుదుము, కొంతమట్టుకు ప్రవచించుచున్నాము. కాని పూర్ణమయినది వచ్చినప్పుడు అపూర్ణమయినది నిరర్థకమగును. నేను పిల్లవాడనయి యున్నప్పుడు పిల్లవానివలె మాటలాడితిని పిల్లవానివలె తలంచితిని పిల్లవానివలెయోచించితిని, ఇప్పుడు పెద్దవాడనయి యున్నాను గనుక పిల్లవాని చేష్టలు మానివేసితిని'. పరలోకమందు మనము పూర్ణముగా తెలిసికొందుము. సకల విద్యలను గ్రహింతుము. ప్రపంచముయొక్క రహస్యములును, మన స్వంతరహస్యములును తెలుసుకొందము. ఒకజర్మను కవీశ్వరుడు తత్వశాస్త్రమును వైద్యశాస్త్రమును న్యాయశాస్త్రమును వేదాంతశాస్త్రమును మనుష్యులకు తెలియబడిన సకలశాస్త్రములు చదివిన వెనుక అతనిప్రాణము అతృప్తినొంది, నిరాశతో 'వాస్తవముగా నేనేమి నేర్చుకొనలేదని కడుపుమండుచూ చెప్పెను' మన మెక్కువ చదివేకొలది యెక్కువ అతృప్తి నొందుదుము. అవివేకమే ధన్యమయినదని ఆఖరున చెప్పవలసి వచ్చును. అయితే క్రీస్తుపు డెప్పుడయిన అధైర్యపడడు. గాన తెలివి ఈలోకములో నెంతమాత్రపుదయినను సరే. ఇక్కడ చీకటిగా నగుపడునదంతయు సంపూర్ణముగా తెలియబడు పరలోకమువైపు చూచుచుండెను. పరలోకమందు మనకు జ్ఞానము కలుగును. అప్పుడు శ్రీ యేసును ఆయన పునరుత్థాన బలమును యెరుగుదుము. అహా అక్కడుంటే యెంతబాగుండును.

శ్రీయేసు మాటలలో మనకెంత భాగ్యమున్నది! ఇదే మన బ్రతుకునందు, మరణమందు, నిత్యజీవమందు నొకటియై యుండుగాక! 'దేవుడు నన్ను అలాగున నే ప్రేమించెను. ఆయన తన జనితైకకుమారునియందు విశ్వాసముంచు నేను నశింపక నిత్యజీవము పొందుటకయి ఆయన ననుగ్రహించెను' ఆమెన్, హల్లెలూయా! ఆమెన్.

# CONCLUSION:—ముగింపు.



మరియొకమారు మీరందరు పాస్టరులు పలికిన గొప్పమాటను ధ్యానింపగోరుచున్నాను. జనులను తెలుసుకొని ప్రేమించవలయునుగాని దేవుని ప్రేమించి ఆయనను తెలుసుకొనవలయును. మరియు మనము దేవునెరుగునట్లు ఆయన మనలను ప్రేమించెను. ఈక్రిందికథ నేర్పించునీతులను హృదయపూర్వకముగా గ్రహింతుముగాక.

నా యేసును నీవు ప్రేమించుచున్నావా ?

ఒక రైలు స్టేషనులో నేనున్నప్పుడు ఒకరు నాభుజముమీద చేయివేసి "నార్మన్, నీవా" అనెను. నేను తిరిగిచూడగా అతడునాతో చదువుకొనిన రిచ్చర్డ్ అనువాడు చాలసంవత్సరములనుండి ఆయనను చూడలేదుగాని కొన్నివారములతనితో నుండ నిశ్చయించుకొంటిని. మేమిద్దరమచ్చటి గుంపును నెట్టుకొని రైలుబండిలో ప్రవేశించినతరువాత స్నేహితుడా, "నీవేలాగు మార్పుబడితివి? పడుచుతనపు మూర్ఖతనముపోయి ఎంత మారియున్నావని" అంటిని. అందుకతడు "అవును స్నేహితుడా, నేను నిన్నడబాసిన తరువాత గొప్పమార్పునొందితిని. అయితే వాటిలో గొప్పమార్పు ఇక్కడనున్నదని చెప్పి, నవ్వుచు తనచేతిని రొమ్ముమీదపెట్టుకొని క్లుప్తముగా చెప్పితే గుర్రుబుర్రుమనుటయే ననెను. నాటిసాయంకాలమందు ఆయన, ఆయనభార్య, నేను, అద్దాలయింటిలో తిరుగుచుండగా సొగసైన మల్లెచెట్లనుచూచి ఆశ్చర్యపడుచుంటిని. అప్పుడతడు "నార్మన్ నీకు చూపింపవలసిన భాగ్యమొకటున్నది. అది చిన్నదయినను

నాకుకలిగినవాని నన్నిటిలోనొప్పది. అది యేదో నీవూహింపగల వా?” అనెను. మేము చావడిలోనికి తిరిగివెళ్ళినప్పుడు తన యేక పుత్రికయైన జెసీ” అను సుందరమైన బిడ్డనునాకుచూపెను. తానుజీ వించిన ఎనిమిది సంవత్సరములలో ప్రతిసంవత్సర మొకదానికంటె మరియొకటి ఎంతో ఆశ్చర్యముగానున్నది. ఆసాయంకాలము మే మిద్దరము మిక్కిలి స్నేహితులమయితిమని నాకు జ్ఞాపకమున్నది. ఆమె నన్ను ప్రేమించెను. నేను ఆమెయెడల వాత్సల్యభావమునొం దితిని. ఆమెనాయొద్ద కొంతసేపు కూర్చుండెను. అప్పుడామెకొ క సుందరమైన కథ చెప్పితిని. తరువాత ఆమె పండుకొనబోయెను. మరునాడు మేమందరము షికారువెళ్ళితిమి. అది సంతోషకరము గానుండెను. చిన్నదైన “జెసీ సంతోషకరముగను, చురుకుగ నుం డెను. అయితే కొన్నిసారులు ఆమెమనసులో ఏమోయున్నట్లుత లంచి తొందరపడితిని. నేను ఆపిల్లతండ్రితో పరిహాసముగా లోక ములో పవిత్రమైన బ్రతుకు బ్రతికకిన శ్రీ యేసును గూర్చి ఎగతా ళిగా మాట్లాడుచుండగా రిచర్డ్ బదులుమాటేమియు చెప్పక జెసీ వైపుచూడుమని సైగచేసెను. ఆపిల్ల నావైపు భయముతోనిదా నించి చూచుచుండెను. ఆపిల్ల చూచినచూపును నేనిదివరకెన్న డు చూడలేదు. ఇప్పటివరకెప్పుడును చూడలేదు. దానిని నే నెప్పుడును మరువజాలను. అది ఒక క్షణమేచూచెను. ఎవరుయేమి యు చెప్పలేదు. అప్పుడాచిన్నది పట్టరానిపసుప్పేడ్చెను. ఆపిల్ల ఎప్పు డయినను విననిదానిని ఆపిల్లయెదుట చెప్పియుండకపోతినని సిగ్గుపడి తిని. ఆపిల్ల నావయిపు దీనమైన చూపుతోచూచి “నాయేసును నీవుప్రేమించుచున్నావ” అని అడిగెను. ఆయననుగూర్చి నీవెట్లుచె ప్పగలిగితివి? అనెను. తక్కిన దినమంతయు ఆపిల్ల తనతండ్రిరొమ్ము మీద నెమ్మదిగా పండుకొనియుండెను. ఎవరేమియుచెప్పలేదు.

మరునాటియుదయమున నాగదిలో నొంటరిగానుండి జరిగిన దంతయు తలపోయుచుండగా నిలవరాని తలంపులు నాలో ననేకములు గలిగెను. ఆపిల్లవలెనేనుంటె బాగుండునని అనుకొనుచుండగ ఆపిల్ల నాప్రక్కలో వచ్చికూర్చుండెను. ఆమెనుచూచి ప్రేమతోను పరితాపముతోను నింపబడితిని. ఆమె నాచేతిమీద పండుకొనెను. ఒక్కక్షణమిద్దరము మౌనముగానుంటిమి. వెంటనే ఆదిన్నది "నాయేసును ప్రేమింపవా? యనిచెప్పి వెళ్ళిపోయెను. ఆపిల్ల పలికినమాటలను ఆమెను ఎగతాళిచేయుమని నాలో నొకదుర్దేశము పొరబడెనుగాని నేనట్లు చేయలేకపోతిని. మరునాటి ఉదయమునను, తరువాతి రెండుమూడు దినములు ఆలాగు ఆమాటలనే పలుకుచు వెళ్లుచుండెను. ఒకనాడు యేమితెలియకనే జెసీ" అదియేలాగో చెప్పుమంటిని. అప్పుడాపిల్ల ఒక క్షణము నావంకచూచి, నామోకాళ్లమీద కూర్చుండి పలికిన ఆమాటలను నేమరువజాలను. నాకు విశేష దుఃఖము కలిగెనుగాని ఆమెకు అంత దుఃఖముకలుగలేదు. ప్రతిఉదయమున వచ్చుచు యేమియు వినుకుకెందక అదే సంగతిని చెప్పుచుండునది, గాని ఒకఉదయమున రాలేదుగనుక చాలాసేపు వ్యర్థముగా ఆమెకొరకు కాచియుంటిని. వెంటనే ఎవరో ఒకరు దబదబ తలుపుతట్టిరి. వెంటనే తలుపుతీయగా వారితండ్రి "నాకుమార్తె ఇప్పుడే నిద్రలేచినది, చాలా జబ్బుగానున్నది చూచెదవా? అది యేమిటో ఎరిగితే చెప్పుము" అనెను.

నేనులోపలికివెళ్ళి చూడగా ఆపిల్ల మైకముతో కన్నులుమూసికొనియుండినది చూడగానే అదిజ్వరమని గ్రహించితిని. వారినేనేమంటినో నాకుతెలియదుగాని వారు ఆశ్చర్యముతో మౌనముగానుండిరి. వైద్యుడువచ్చి అదే జ్వరమని నిర్ధారణచేసెను. అయి

తే విశేషచికిత్స జరుగకయే రెండుదినములైపోయెను. ఇక బ్రతుకునని మాకుగట్టిగా తోచలేదు.

రెండవరోజు కొంచెము నెమ్మదికలిగినట్లు అగుపడెను. కన్నులు తెరిచి నవ్వుతో "అమ్మా, అయ్యా" అని వారి తల్లిదండ్రులను పిలచి నావైపుచూచి "నార్మన్ చిన్నాయనా, నా యేసును ప్రేమించవా? మాఅమ్మ ప్రేమించుచున్నది. మా నాయన ప్రేమించుచున్నాడు. నేను ఆయనను ప్రేమించుచున్నాను, నేనాయనయొద్దకు వెళ్లుచున్నాను, నీవాయనను ప్రేమింతువని ఆయనతో చెప్పుదును. నీవు ప్రేమించవా? అనెను. అందుకునేను "జెసీ, జెసీ" "నాప్రాణము నాజీవము ఇకనెప్పటికి ఆయనవి. మరియు ఈవర్తమానము తీసికొనిపోయి చెప్పుము నీఆత్మవలె ఒకదినమున నాఆత్మయు నిర్మలమైనదై నిష్కళంకమైనదై యుండుగాక" అంటిని.

అమ్మా, అయ్యా, ఓ నాయేసూ, నేనిప్పుడు బహుసంతోషముగానున్నాను. నాకు కావలసినవన్ని ఉన్నవి. నేనిప్పుడువచ్చుచున్నాను, వచ్చుచున్నాను, వచ్చుచున్నాను, ప్రభువైన శ్రీయేసూ రమ్ము"అనుచు ఆపిల్లయొక్క ఆత్మ తానెక్కడనుండివచ్చెనో ఆచోటికిపోయెను. దేవుని చిన్నదూత తానీలోకములో చేయవలసినది ముగించి నీతిగలదాయెను.

---

ఏమీ, శ్రీయేసును యెరుగవా?

1894 సం॥ ఇండియాదేశమందలి ఒక పట్టణపు కోటగోడలపై నొక స్నేహితునితో నడుచుచూ ఆయనతో నీసహోదరుడు భక్తిగల క్రైస్తవుడనియు, తన స్నేహితుని ప్రాణముగ రక్షించుటకై పులివల్ల తాను చంపబడినట్లు విన్నాను. అది నిజమా? ఆయన మరణమునుగూర్చిన సవిస్తరము దయచేసి వివరించుమని యడిగితిని.

నా స్నేహితుడు కోటగోడలమీద కట్టబడిన యొక బంగళాను చూపించి ఆ ఇంటిలోనే నాతమ్ముడు మరణించెనని హీనస్వరముతో చెప్పెను. "అలాగా నా స్నేహితుడా, ఇక్కడేనా నేనెరుగను. అయినను ఈస్థలములోనే నీసంగతినెత్తితిని గనుక నన్ను క్షమింప గోరుచున్నానంటిని"

"స్నేహితుడా, తొందరలేదు నేనీస్థలమునకు వచ్చినప్పుడెల్ల ఈదుఃఖకరమైన సంగతి నామనస్సునకు వచ్చుచుండెను. నాతమ్ముడు చాలభక్తిగల క్రైస్తవుడు అతడు ఒకపడుచు ఇంజనీయరు. అతనిని పులి కొట్టినప్పుడు కొండదగ్గరనున్న అడవిగుండా కాలువను కొలతవేయుచున్న తనస్నేహితులతోనుండెను. ఒక సాయంకాలమున ఆనాటిపని ముగిసినతరువాత నాతమ్ముడును ఆయనయు మరి యిద్దరును అడవికి షికారువెళ్ళిరి. వారికొక అపాయము సంభవించునని అనుకొనకపోయినను వేటకత్తిని తీసుకొనివెళ్ళిరి. ఆకస్మికముగా నాతమ్మునిమీదికొక పులి దుమికి నేలబడగూల్చెను. దీనిజూచి బాకుపట్టుకొనినవాడు పులిమీదికిపోయెను. అప్పుడాపులి వానిబాకును క్రిందబడగొట్టి వానిమీదికి దుమికెను. అంతట నాతమ్ముడు దుమికి ఆబాకును తీసికొని ఆపులిని చాలసార్లు గ్రుచ్చెను. ఆపులి నొప్పితోను, ఆగ్రహముతోను, బొబ్బపెట్టి నాతమ్ముని మునుపటిదెబ్బమీద మరియొకదెబ్బవేసి కనుబడకుండపోయెను.

అయ్యో పాపము! గాయపడిన నాతమ్ముని అతనిస్నేహితులిద్దరు డేరాకుతెచ్చి బహుగా పరామర్శించిరి. అతనిగాయములు కట్టుటకు డాక్టరుండియుంటే అతడు బ్రతికేవాడేను. నాతల్లినివసించుచున్న ఈయింటికి నాతమ్ముని తీసికొనివచ్చుటకు నాలుగు దినములుపట్టెను. అప్పటికే ఆయనరక్తము విషమాయెను.

కొన్ని దినములయినతరువాత అతడు తన సమస్తశ్రమలనుం
డి విశ్రమించేదినము సమీపించెనని జనులు గ్రహించిరి. నాతల్లిక
న్నీళ్లువిడుచుచూ "నాకుమారుడా పులి నిన్నువిడచినీస్నేహితుని పట్టు
కొనినప్పుడు నీవెందుకుతప్పించుకొనలేదు" అనిఅడిగెను. ఆమెవైపు
తిరస్కారముగాచూచి "అమ్మా నాపిరికితనమును చూపింపమం
టావా? నేనుచనిపోయినను తొందరలేదుగాని నాస్నేహితుడు చని
పోవునని, అతనిరక్షింపవెళ్ళితినన్నను."

చివరకు మేమును వైద్యుడును ఆయన మరణపడకచుట్టు నిల
చియుండగ అతడు కన్నులుమూసికొని ప్రాణమును విడువ సిద్ధముగా
నున్నప్పుడు, అతనికి కలిగిన సకలశ్రమలు అంత్యమాయెనని మేము
చెప్పనైయుండగా అతడు తనకన్నులుదెరచి సంతోష సమాధానపు
ముఖముతో శ్రీయేసునుచూచుచున్నానని చెప్పెను.

అందుకు వైద్యుడు ఆయన యేసని నీకెట్లుతెలియునని యడి
గెను. అప్పుడతడు వైద్యునివంకజూచి "యేమీ శ్రీయేసునెరుగవా?"
అనిచెప్పి తిరుగాకన్నులుమూసికొనగా సమస్తమును అంతమాయెను.

ఓ చదువరీ, ముగింపునందు నేను తిరిగిచెప్పేదేమంటే "దేవు
డు లోకమును ఆలాగుననే ప్రేమించెను. గనుక తన జ
నితైక కుమారునియందు విశ్వాసముంచు ప్రతివాడును నశింపక నిత్య
జీవమును పొందుటకై ఆయన ననుగ్రహించెను." ఈమహిమగల స
త్యపు వెలుగులో మనప్రభువును యజమానుడునైన, శ్రీయేసుక్రీస్తు
యొక్క సిలువయొద్ద నిన్ను నిలిపి ఈరెండుప్రశ్నలను బాగా తలపో
యుమని అడుగుచున్నాను "నీవు నాయేసును ప్రేమింపవా? ఏమీ
శ్రీయేసునెరుగవా?"